# ఆంధ్ర సచిత్ర వారపత్రిక



"దీపావళే
నా పుట్టినరోజు"
-కె. కె. శర్మ

కాన్సర్‌ని
మటుమాయంచేసే
"ఆంజియోజెనిన్"

15-21, నవంబర్, '85

రు. 2-50

# ఆలయాల నగరి భువనేశ్వర్

# మధ్య తరగతిని అలక్ష్యం చేస్తే ముప్పు !

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

శ్రీ రాజీవ్‌గాంధి సరైన మార్గానికి వస్తున్నారనుకుంటే దానికి కారణం దేశం మొత్తం సరైన వైపుకి మళ్ళినందువల్లనేనని ఆయన విమర్శకులు చాలామంది విస్మరిస్తున్నట్లు కనిపిస్తున్నది. రాజీవ్‌గాంధి విధానాలు ఆయన తల్లి, ఆ మాటకి వస్తే ఒకటి రెండు అంశాలు మినహా ఆయన తాతగారి విధానాలకేమీ భిన్నంగా లేవు. విదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని నెహ్రూ విపరీతంగా దిగుమతి చేసుకున్నారు. రాజీవ్ కూడా అదే చేస్తున్నారు. నెహ్రూ విధానాలు టాటా, బిర్లాలని ఇప్పుడు వారు ఉన్న స్థితికి పెంచాయి. రాజీవ్ కూడా అందుకు భిన్నంగా ఏమీ చెయ్యడం లేదు. శ్రీమతి గాంధీ బాంకులని జాతీయం చేసి వాటిని అధికార వర్గానికి అప్పగించారు. రాజీవ్ పాలనలో అధికార వర్గం మొత్తం దేశాన్నే తన గుప్పిట్లో పెట్టుకున్నది వాళ్ళ పరిపాలన నెహ్రూ హయాంలో కూడా లేనంత హాస్యాస్పదంగా ఉంది. పద్ధతిలో మార్పు ఉంటే ఉండవచ్చేమో కానీ పరిస్థితి మాత్రం అలాగే ఉంది. ఇదంతా రాజీవ్‌గాంధి సోషలిస్టు అని చెప్పటానికి కాదు. తమ తల్లి కన్నా ఈయన పెద్ద సోషలిస్టు ఏమీ కాదు. ఆమె సోషలిజాన్ని ప్రచారానికి బాగా వాడుకున్నారు తేడా ఏమిటంటే ఆయన మాటలు సోషలిజం గురించి గొప్పలు చెపుతున్నట్లు ఉండవు. ఇటీవల ఆయన ఒక విదేశీ పత్రికలో భారతదేశం ఇంకా సోషలిస్టు దేశంగానే ఉందన్నారు అంటే అర్థం దాని ప్రభుత్వం సోషలిస్టు ప్రభుత్వం అని అయితే తాము కూడా ఇంకా సోషలిస్టుగానే ఉన్నట్లు చెప్పకుండా ఆయన జాగ్రత్తపడ్డారు. తమ తల్లి లాగా కాకుండా ఆయన సోషలిజాన్ని, సోషలిస్టులని బారెడు దూరంలో నే ఉంచుతున్నారు.

అసలు సోషలిజం అన్నమాట దాని అర్థాన్ని, భావాన్ని కూడా కోల్పోయింది భారతదేశంలో నే కాదు చైనాతో సహా మిగతా ప్రపంచం అంతా దాన్ని అదే విధంగా భావిస్తున్నారు బ్రిటన్‌లోని లేబర్ పార్టీ కూడా సోషలిజాన్ని ప్రమాణంగా తీసుకోటం లేదు కారణం సోషలిజం మన సమస్యలని పరిష్కరిస్తుందని ఎవరూ అనుకోటం లేదు కాబట్టి. భారత దేశంలో నెహ్రూ విధానాలు ధనవంతుడిని మరింత భాగ్యవంతుడిగా, బీదవాడిని మరింత నిరుపేదగా చేసాయి. సోషలిస్టు దేశాలలో ఎప్పుడూ ఇలాగే జరుగుతుంది మరింత ప్రమాదం ఏమిటంటే ప్రభుత్వం విపరీతమైన అధికారాలని సమకూర్చుకుంటుంది అత్యవసర పరిస్థితి సమయంలో సరిగ్గా అదే జరిగింది ప్రభుత్వం తన పేరు మీద పరిపాలించే వారి చేతిలో ఆటబొమ్మ అవుతుంది. నెహ్రూ హయాములో ఉన్న ప్రతి ఒక్క సోషలిస్టు వంచకునికి పదిమంది చొప్పున శ్రీమతి గాంధి హయాములో ఉన్నారు. కృష్ణమీనన్, రజనీపటేల్ వంటి వారు బాగా లబ్ధి పొందారు. వాళ్ళిద్దరూ కమ్యూనిస్టులే కానీ వంచనని చక్కని రాజకీయ క్రీడగా మార్చి వాడుకోడం అన్నది వారికి బాగా తెలుసు వారిద్దరూ కుటిల స్వభావం కలవాళ్ళనటంలో ఎలాంటి సందేహం లేదు అటువంటి వాళ్ళు సోషలిస్టు ప్రభుత్వంలో నే ప్రయోజనాన్ని పొందగలుగుతారు

భారతదేశంలో ని మధ్యతరగతి ఈ రకమైన సోషలిజంతో విసిగిపోయింది. నిజాయితీ ఉన్న కాపిటలిజమే నకిలీ సోషలిజం కన్నా మంచిదని అది భావిస్తున్నది రాజీవ్, ఆయన మిత్రులు చెబుతున్న కాపిటలిజం వ్యవస్థలో మీరెక్కడున్నదీ మీకు తెలుసు మీకెవరు మిత్రులో, ఎవరు శత్రువులో కూడా మీకు తెలుసు ఎవరిని నమ్మాలో, ఎవరిని బారెడు దూరంలో ఉంచాలో మీకు తెలుసు. భారతదేశంలో పరిస్థితుల దృష్ట్యా కాపిటలిజం అంటే ప్రైవేటు రంగం ఎక్కువగా ఉండి ప్రభుత్వరంగం చాలా తక్కువగా ఉండటం పెట్టుబడిదారి వ్యవస్థలో మీ కష్టాన్ని యజమానులు సొమ్ము చేసుకుంటారు ఏదో ఒకటి అమ్మకుండా డబ్బు సంపాదించలేరు కాబట్టి దుకాణాలలో ధర ఎక్కువైనా ఏదో ఒకటి దొరుకుతుంది నెహ్రూ రకం సోషలిజంలో మీరు కొనేందుకు దుకాణంలో ఏమీ ఉండవు ఎందుకంటే, ఉక్కు కర్మాగారాలు ఉక్కుని తయారు చెయ్యవు, విద్యుత్ కేంద్రాలు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చెయ్యవు, బేకరిలు రొట్టెలని తయారు చెయ్యవు. ప్రైవేటు రంగంలో ని మూతపడిన మిల్లులు, పరిశ్రమల గురించి అనర్గళంగా మాట్లాడే వారికి ప్రభుత్వరంగంలో ఉన్న దాదాపు ప్రతి సంస్థా సరిగా నడవటంలేదని తెలియదనో, లేదా తెలుసుకోవాల్సిన అవసరం లేదనో అనుకోవాలి. స్టీల్ అథారిటీ మొదలు భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ వరకూ అన్నీ అలాగే ఉన్నాయి. వాటిలో కొన్నిటికి లాభం వచ్చినట్లు కనిపించినా దానికి కారణం గుత్తస్వామ్యమే అనుకోవాలి. పోటీ అసలే లేని మార్కెట్‌లో వాటి నాసిరకం ఉత్పత్తుల అమ్మకం వల్ల వచ్చిన లాభాలే అవి టాటా కంపెనీ ప్రైవేటు సంస్థే కానీ కనీసం అది ఉక్కుని తయారు చేస్తుంది. ఉత్పత్తి తక్కువ, గొప్ప లు



చెప్పుకోవటం ఎక్కువ అయిన ఎటువంటి వ్యవస్థ అయినా అది నకిలీ సోషలిజమే. సంఘ వ్యతిరేకమైనదే పేదవాడు రొట్టె అడిగితే మీరతనికి రాయిని ఇవ్వలేరు కదా!

నలభై సంవత్సరాల నెహ్రూ రకం సోషలిజం తమని ఇంకెక్కడికి తీసుకు వెళ్ళలేదని దేశంలోని మధ్యతరగతి గ్రహించింది -మహా అయితే ఒక అత్యవసర పరిస్థితినించి మరొక దానికి తీసుకుపోవచ్చు ప్రభుత్వానికి అధికారాలు ఎక్కువ అయినప్పుడు అత్యవసర పరిస్థితులనేవి తప్పనిసరి అవుతాయి తప్ప అంతకన్నా జరిగేదేమీ ఉండదు మధ్యతరగతి అనేది సమాజంలో చాలా కొద్ది భాగమేననుకుంటే అది పొరపాటే అవుతుంది ఆధునికీకరణ కారణంగా ఏర్పడిన వొత్తిడి ఫలితంగా మధ్యతరగతి నెమ్మదిగా విస్తరిస్తున్నది జనాభాలో ఇప్పుడది బహుశ మూడో వంతు ఉండవచ్చు ఇప్పుడు దాదాపు ప్రతి వ్యక్తి తాను మధ్యతరగతికి చెందిన వాడుగానో, లేదా చెందాలనుకుంటున్న వాడిగానో ఉన్నాడు ఊడ్చే పనివారు తాము పస్తులుండి అయినా సరే తమ పిల్లలని 'కాన్వెంట్' స్కూళ్ళకే పంపిస్తున్నారు పూట గడవని ప్రాథమికోపాధ్యాయుడు కూడా ఇప్పుడు స్టాక్ ఎక్స్‌చేంజిలో స్టాక్‌బ్రోకర్ల ద్వారా వాటాలు కొంటున్నాడు కొద్ది సంవత్సరాలలోనే వాటాదారుల సంఖ్య నాలుగింతలుగా పెరిగింది త్వరలోనే అది ఒక కోటికి చేరుకోవచ్చు ప్రపంచంలోని అతి పేదదేశాలలో ఒకటిగా భావింపబడుతున్న ఒకదేశంలో అదేమీ తక్కువ సంఖ్య కాదు

పెరుగుతున్న మధ్యతరగతికి పాత నినాదాలు పనికిరావు ఎక్కువ ఉద్యోగాలు, ఎక్కువ జీతాలు, మెరుగైన గృహవసతి, మంచి విద్య, మరిన్ని వి. సి ఆర్ లు వారికి ఎవరైతే ఇస్తారో, లేదా ఇస్తామన్న వాగ్దానం చేస్తారో వారి వెంటే ఉంటారు క్రూరత్వం వారిని భయ పెడుతుంది వాళ్ళు పొరపాటు పడవచ్చుకానీ వారిని అలక్ష్యం చెయ్యడానికి వీలులేదు. అలా చేస్తే ముప్పు తప్పదు. విశ్వవిద్యాలయంలో కుమారుని విజ్ఞానశాస్త్రం చదివిస్తున్న ఒక తండ్రికిగాంధీగారి చరఖాకి తిరిగి వెళ్ళమని మీరు చెప్పలేరు. అసలు మీరు ఎవరినీ వెనక్కి వెళ్ళమని చెప్పలేరు. ఆనాటి భారతదేశానికి మహాత్మాగాంధీ తగిన వ్యక్తి అయన మరణం తర్వాత గడిచిన దాదాపు ఈ అర్ధశతాబ్దంలో భారతదేశంతో సహా ప్రపంచం అంతా గుర్తు పట్టలేనంతగా మారిపోయింది. నిన్నటి పనిముట్లతో మీరు నేటి సమస్యలని పరిష్కరించలేరు. మన సమస్యలని ఈనాటి పనిముట్లే పరిష్కరించగలవు. ఆధునిక పరికరాలని ఎన్నో దేశాలు, చివరికి చైనా కూడా తయారు చేస్తున్న ఈ సమయంలో గాంధీగారి పేరు చెప్పి ఆధునిక పరికరాలని విసర్జించటం రాజకీయ ఆత్మహత్యే అవుతుంది. □

# మనలో మాట

గతవారం దీపావళి సంచికలో ప్రచురించిన ★ ఓనమాలు ★ ఖాండవదహనం ★ దేవమ్మ; ఈ వారం వేసిన ★ భిన్నరూపాలు ★ సావిత్రి పెళ్ళి ఆగిపోయింది ★ సుమతి కథలతో దీపావళి కథల పోటీలో రు. 650/- బహుమతి పొందిన ఆరు కథల ప్రచురణ పూర్తయింది.

ఎప్పటి వలెనే ఈ ఏడాది కూడా పాఠకుల కోసం దీపావళి కథలపై బాలట్, వ్యాసరచన పోటీలని నిర్వహిస్తున్నాము.

సంపాదకుని ఎన్నికలో రు 650/- బహుమతి పొందిన ఈ ఆరు కథలలో అత్యుత్తమమైన కథ పేరుని పాఠకులు ఈ కింద ఇచ్చిన బాలట్ పత్రంలో పేర్కొనవలసిందిగా కోరుతున్నాము వ్యాసరచన పోటీలో పాల్గొనే వారు బహుమతి పొందిన ఈ ఆరు కథలనీ సమీక్షిస్తూ ఒక సమీక్షా వ్యాసాన్ని వెయ్యి అక్షరాలకి మించకుండా రాసి, దానితో పాటు పూర్తి చేసిన బాలట్ పత్రాన్ని జతపరచి పంపగోరుతున్నాము వ్యాసం రాసినా, రాయకపోయినా పాఠకులందరూ బాలట్ పత్రాన్ని పూర్తి చేసి పంపవచ్చు

**ముగింపు తేదీ:30-11-1985**

పోటీకి పంపిన వ్యాసాలని ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపటం సాధ్యంకాదు

వ్యాసం వ్రాత ప్రతి పైనా, బాలట్ పత్రంలో రాసిన వారి పూర్తిపేరు, చిరునామా స్పష్టంగా రాసి ఉండాలి వ్యాసాలు కాగితానికి ఒక వైపే సిరాతో, లేదా బాల్‌పెన్‌తో రాయాలి కవరు పైభాగంలో 'దీపావళి కథలపై వ్యాసరచన పోటీకి' అని రాసి దానిని సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి బాలట్ పత్రాన్ని మాత్రమే పంపేవారు కవరు పైభాగంలో 'దీపావళి కథలపై బాలట్‌కి' అని రాసి పై చిరునామాకి పంపాలి

వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందిన వ్యాసానికి రు. 250/-, రెండవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 150/-, మూడవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 100/-లు లభిస్తాయి.

పాఠకుల తీర్పుని అనుసరించి బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో ఎన్నికైన కథలకి వరుసగా రు 700/-, రు. 600/-, రు 500/-లు అదనపు బహుమతులుగా లభిస్తాయి మిగిలిన మూడు కథలకి కన్సొలేషన్ బహుమతిగా ఒక్కొక్క దానికి రు 300/- చొప్పున లభిస్తుంది

బాలట్, వ్యాస రచన పోటి ఫలితాలని, బహుమతి పొందిన వ్యాసాలని, దీపావళి కథల పోటీలో బహుమతులు అందుకున్న ఆరుగురు కథా రచయిత(త్రు)ల పరిచయాలని సంక్రాంతి సంచికలో ప్రచురిస్తాము

పాఠకులందరూ ఈ బాలట్, వ్యాసరచన పోటీలలో ఉత్సాహంగా పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము

---

## ఆంధ్రసచిత్రవారపత్రిక

### దీపావళి కథల బాలట్ పత్రం

ముగింపు తేదీ : 30-11-1985

కథ పేరు : ______________________

పంపిన వారి పేరు : ______________________

పూర్తి చిరునామా : ______________________

______________________

______________________

చిన్నారి ఉడుతలను చూడని వారు, చూచి ఆనందపడని వారూ ఎవ్వరూ ఉండరు. కొన్ని నెలల వయస్సున్న పసిపాపలకి కూడా చిట్టి ఉడుతలని చూస్తే ఎంతో సంతోషం కలుగుతుంది. ఉడుతా! ఉడుతా! హూత్! అంటూ ఐదారేళ్ల పిల్లలు ఆడుకోవడం ప్రపంచ వ్యాప్తంగా కనిపించే దృశ్యం! చక్కగా కూర్చొని ముచ్చటగా జాంపండు తింటుంటే ఉడుత ఎంత అందంగా ఉంటుందో అందరికీ తెలిసిన విషయమే..

ఉడుతలు అన్నిదేశాలలోనూ కనిపిస్తాయి. అడవుల్లో ఉంటాయి. ఎడారుల్లో విహరిస్తాయి. శీతభూముల్లో పరుగులు తీస్తాయి సుందర వనాలలో పాటలు పాడుతాయి. పంట చేలల్లో గంతులు వేస్తాయి. మన ఇళ్లలో గమ్మత్తులు చేస్తాయి. కాబట్టి ఉడుతలు అన్ని ప్రదేశాలలోనూ ఉన్నాయని చెప్పక తప్పదు. ఈ ఉడుతల్లో 50 ప్రజాతులు ఉన్నాయి. వాటిలో 260 జాతుల దాకా ఉన్నాయి. జంతుశాస్త్రజ్ఞులు వీటిని "రోడెన్షియా" క్రమంలో చేర్చారు. అంటే ఎలుకలు వీటికి దగ్గరి బంధువులని తెలుస్తుంది. ఉడుతల కుటుంబాన్ని "స్క్యూరిడే" అని పిలుస్తారు. ఉడుతలన్నీ వృక్ష నివాసులే కాదు. కొన్ని భూమిని ఆశ్రయించుకొని బొరియల్లో జీవిస్తాయి. ఇలాంటివి ముఖ్యంగా ఐరోపాలో – అందులోనూ ప్రత్యేకించి గ్రేట్ బ్రిటన్‌లో ఉన్నాయి. ఇవి శీతాకాలపు నిద్ర, వేసవి నిద్ర వగైరా గడుపుతాయి.వణకు పుట్టించే చలికాలంలో ఐరోపాలోని ఉడుతలు అసలు బయటికే రావు. చలికాలమంతా సరిపోయే ఆహారాన్ని ఈ ఉడుతలు వేసవిలోనే జమ చేసుకొంటాయి! కొన్ని ఉడుతలైతే ఒకటి, రెండు అడుగుల దూరం వరకు ఎగురుకొంటూ చెట్ల కొమ్మల మీద తిరుగాడుతూ ఉంటాయి.

మామూలుగా ఉడుతలు 4 అంగుళాల పొడవు నించి 35 అంగుళాల పొడవు వరకు ఉంటాయి. ఉడుత పొడవు 8 అంగుళాలు ఉంటే దాని అందమైన తోక పొడవు 7 అంగుళాల వరకూ ఉంటుంది. అంటే మొత్తం దేహం ఎంత పొడవుగా ఉందో, దాదాపు తోక కూడా అంతే పొడవు ఉంటుందని తోస్తుంది. ఈ ఉడుతలు 4 నించి 7 ఏళ్ల వరకు బ్రతకగలుగుతాయి. కొన్ని జాతుల్లో మినహాయింపులు ఉండవచ్చు. ఆరు నెలల వయస్సులోనే ఉడుతలు ప్రౌఢ దశకు చేరుకొని సంతానాన్ని వృద్ధి చేసుకొంటాయి. ప్రతి ఆడ ఉడుతా సంవత్సరానికి ఒకటి లేదా రెండు సార్లు కంటుంది. నాలుగుసార్లు కన్న సందర్భాలు కూడా ఉన్నాయి! ప్రతి కాన్పులోనూ 1 నించి 15 ఉడుత పిల్లలు పుట్టవచ్చు. సాధారణంగా ఉడుత గర్భం ధరించిన 22 రోజుల నించి 45 రోజుల లోపు పిల్లలని కంటుంది.

ఉడుతలు గింజలు, కాయలు, పళ్లు తిని బ్రతికే శాకాహారులు మాత్రమే కావు. బల్లి గుడ్లనీ, పక్షి గుడ్లనీ, చిన్న చిన్న పురుగులనీ, క్రిమికీటకాలనీ ఇవి నిరాక్షేపంగా భక్షిస్తాయి. ఇవి సంఘ జీవనం గడుపుతాయి. నాయకత్వం ప్రశ్న లేదు. ఈ జంతువులలో వావి, వరుసలు లేవు. ఇవి పిరికి జంతువులు. ఇవి పగటి పూట మాత్రమే తమ జీవన కార్యకలాపాలని – చివరికి సంభోగ ప్రక్రియని కూడా నిర్వహించుకొంటాయి. రాత్రిపూట గూళ్లలో నిశ్శబ్దంగా నిద్రపోతాయి. తెలతెల వారకముందే కేరింతలు కొడుతూ ఆహార సముపార్జనకి గుంపులు గుంపులుగా బయలుదేరుతాయి!

ముదురు ఎరుపు రంగులో కాని, బూడిద రంగులో కాని ఉడుతలు ఉంటాయి. మామూలుగా కనిపించే ఉడుత శాస్త్రీయ నామం "స్క్యూరస్ వల్గారిస్" ఇవి ఉత్తర ఆసియా, ఐరోపా ప్రాంతాలలో అధికంగా ఉంటాయి. బూడిద రంగు గల ఉడుతని – దీనినే నక్క ఉడుత అని కూడా పిలుస్తారు – శాస్త్రీయ పరిభాషలో "స్క్యూరస్ కరోలి నెన్‌సిస్" అని పిలుస్తారు. ఇది ఉత్తర అమెరికాకి చెందిన జాతి అయితే 19 వ శతాబ్దం ప్రారంభంలో ఇవి అక్కడి నించి గ్రేట్ బ్రిటన్‌కి కూడా వచ్చేసాయి. మనదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ కనిపించేవి బూడిద రంగు ఉడుతలే! అయితే ఇవి "కరోలి నెన్‌సిస్" తెగవి కావు! బహుశా "వల్గారిస్" తెగ ఉడుతలకీ "కరోలినెన్‌సిస్" తెగ ఉడుతలకీ పుట్టి కాలక్రమంలో సరిక్రొత్త తెగగా రూపొందినవై ఉండవచ్చు. ఇది ఒక సూచన మాత్రమే!

ఉడుత మన సంప్రదాయంలో కూడా చోటు చేసుకొంది. రామాయణం మన సంస్కృతికి ప్రతిబింబం అని చెబుతారు కదా! ఈ రామాయణంలో ఉడుతా సేవ ప్రసక్తి ఉంది. రాముడికి ఉడుత లంకకి వారధి కట్టేటప్పుడు సేవ చేసినట్లు చెబుతారు. ఆప్యాయంతో రాముడు ఉడుత వీపు నిమరగా మూడు తెల్లటి గీతలు పడినట్లు మనం కథలు వింటూ ఉంటాము. వాస్తవానికి వాల్మీకి రామాయణంలో ఉడుతా సేవ ప్రసక్తే లేదు. ఉడుతల పట్ల కూడా మనం దయని కలిగి ఉండాలని చెప్పడానికి ఈ ఉడుతా సేవ ఒక ప్రయత్నం కావచ్చు. అంతమాత్రమే! 1940 ప్రాంతంలో ఉడుతల వల్ల పంట పొలాలకి పెద్ద ప్రమాదం వచ్చినట్లు బ్రిటన్ వార్త! అందుకని 1947 వ్యావసాయిక చట్టాన్ని అది రూపొందించింది. ఈ చట్టం ప్రకారం ఉడుతలని నిర్మూలించే కార్యక్రమం ప్రోత్సహించబడింది కూడా! మనదేశంలో పరిస్థితి వేరు. ఉత్తర భారతంలో ఉడుతల అల్లరి ఎక్కువని ఎవరైనా చెబుతారు. అంత మాత్రం చేత వాటిని చంపాలని నిర్ణయించడం అవివేకం. ప్రకృతిలో జంతుజాతుల మధ్య స్పష్టమైన అవగాహన, సమతుల్యత ఉంటాయి. ఏ కారణం చేతనైనా సరే మనిషి కల్పించుకొని ఏదైనా జంతు జాతిని నిర్మూలిస్తే ప్రకృతిలో అవ్యవస్థ తారసిల్లి మనిషికే ప్రమాదం ఏర్పడుతుంది.

ఉడుతలను నిర్దాక్షిణ్యంగా చంపడాన్ని ఎటువంటి పరిస్థితులలోనూ అనుమతించరాదు. మన చిన్నారి బుడుతలకి మల్లే చిట్టి ఉడుతలని కూడా కాపాడటం విధ్యుక్త ధర్మంగా భావించాలి. అందుకోసం పాటుపడాలి!

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

చిన్నారి ఉడుతలు!

(ఫొటో : ఒడయార్)



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

శుక్రవారం : 15-21 నవంబరు, '85
శ్రీ క్రోధన నామ సం. కార్తీక. శు. తదియ
**సంపుటము 78 : సంచిక 10**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : రజని
(ఫోటో : పి. రవిచందర్)


కథలు :

| | |
|---|---|
| భిన్నరూపాలు (రు. 650/= బహుమతి పొందిన కథ) | 8 |
| సావిత్రి పెళ్ళి ఆగిపోయింది (రు. 650/= బహుమతి పొందిన కథ) | 24 |
| ..మతి (రు. 650/= బహుమతి పొందిన కథ) | 40 |
| అభిమానం | 52 |
| వెలుగుబాట | 61 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| కాంచన సౌధం | 16 |
| అంతరాలు-అంతర్యాలు | 30 |
| ప్రతిభ | 46 |
| త్రివేణీ సంగమం | 58 |

వ్యాసాలు, శీర్షికలు :

న్యూఢిల్లీ లేఖ-4, ఉత్తరాలు-7, వ్యక్తిగతం, వారఫలం-14, ప్రశ్నావళి-22, ఆలయాల నగరి భువనేశ్వర్-38, ఫాల్గుని డైరీ-44, ధర్మపథం-49, కాన్సర్‌ని మటుమాయం చేసే "ఆంజియో జెనిన్"!-50, ఇవే మన పద్యాలు-55, హైదరాబాద్ నోట్‌బుక్-56, అవీ-ఇవీ-అన్నీ-66, "దీపావళి నా పుట్టిన రోజు"-67, సినిమా విశేషాలు-69.


# ఉత్తరాలు

### మచ్చుతునక

ఆంధ్ర సచిత్ర వార పత్రిక
లేదు నీకేది సాటిక
అసభ్యానికి తావివ్వక
నీ కథలు మా కెంతో చేరిక
నీ సీరియల్ ఎంపిక
చక్కని మనోరంజక భావాల కూడిక
సాహిత్య లోకంలో నీవొక నెలవంక
అందుకు ఏ విమర్శకుడు పెట్టుకోడు శంక
నిన్ను పొగిడే పాఠకులలో నేనొక మచ్చుతునక

నిచ్చెనమెట్ల సుజాత, కర్నూలు

### కథలు

నాగార్జున అక్కినేని ముఖచిత్రంతో వెలువడిన 4–10 అక్టోబర్ సంచికలో సందేశాత్మకంగా ఉంది – 'పురోగమనం – తిరోగమనం' కథ. గోపాల్‌లాంటి మానసిక రోగుల వంచనకు బలియై జీవచ్ఛవంలా జీవనం సాగిస్తున్న శిరీషలాంటి అమాయకురాళ్ళు వర్తమాన సమాజంలో / అడపా దడపా కానవస్తున్నారు వారిని సహృదయంతో ఆదరించగల లక్ష్మిలాంటి ప్రాణసఖులు దొరకటం మాత్రం అరుదు అని చెప్పక తప్పదు

పాటీల్లిడి చక్రరావు, విశాఖపట్నం

### చాలా బాగుంది

4–10–85 అక్టోబర్ నెల సంచికలో ప్రచురించిన అతిథి కథ చాలా బాగుంది

టి. వి ఫణీంద్రనాధ్, అర్ధవీడు

### ఆలోచింపచేసేదిగా ఉంది

4–10 అక్టోబర్ 85 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించిన డా. జయ్ దుబాషిగారి "న్యూఢిల్లీ లేఖ" నీతిగా మారిన అవినీతి! ఆలోచింప జేసేదిగా ఉంది

పానకాలు, గుంటూరు

### ప్రయోజనం లేదు

జయ్ దుబాషిగారి రాతల్ని విమర్శించి ప్రయోజనం లేదు ఎందుకంటే వాటిని ఆయన చదివేపరిస్థితి లేదు! ఆ విమర్శల్ని అనువదించి ఆయనకు పంపి, ఆయన సమాధానాలు రాబట్టి, ప్రచురిస్తే బాగుంటుంది.

ఉదయ, కాకినాడ

### ఎందుకు?

శ్రీ జయ్‌దుబాషిగారి ఫోటో మొదటిమాటు ప్రచురించడం సరి కాని, ప్రతి వారము ఈ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ఎందుకు వేస్తున్నట్లు? ఆయన వ్యాసాల్లో తెలుగు ప్రజలకు తెలియనవి, తెలుసుకోవలసినవి ఏమీ లేవు అనిపిస్తుంది ఫాల్గుని డయిరిలో అన్నీ పాతవార్తలే. ఈ రెండిటి బదులుగా వేరే ఏవయినా వేస్తే మంచిది

యస్. అశ్వర్ధ నారాయణ స్వామి, ధర్మవరం

### సీరియల్స్

**"శుశ్రుత నర్సింగ్ హోమ్" చివరికి వచ్చేటప్పటికి రవి ఇందుని చేసుకోకుండా అటు మంజుని చేసుకోకుండా వుండటం బాగలేదు. శుశ్రుత నర్సింగ్ హోమ్‌కే అతని జీవితం అంకితం చేయడం బాగలేదు.**

వై. నామా వరలక్ష్మి, కొత్తకాలవ

* * *

అందాల తార కుమారి సంయుక్త ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో "శుశ్రుత నర్సింగ్ హోమ్" ముగింపు చాలా బాగుంది. బంధంకంటే వృత్తి ముఖ్యమైనది అని చెప్పటం బాగుంది.

డా. కె. రవీంద్రబాబుగార్కి అభినందనలు.

సింగందత్తాత్రేయమూర్తి, ఒంగోలు

* * *

నటి సంయుక్త ముఖచిత్రంతో వెలువడిన మీ(మా)పత్రిక మమ్ములను ఆకర్షించినది. ముఖ్యంగా సీరియల్ నవల "కాంచనసౌధం" ప్రారంభం మాకు బాగా నచ్చింది.

కేసరి వెంకటసత్యనారాయణ, లలిత, శివకోడు

ఆదివారం పొద్దున్న కాఫీ తాగుతూ వార్తాపత్రికలో వార్తలు నములుతున్నాను.

పట్నపు పొలిమేరల్లో బందిపోటు దొంగలు ఇళ్ళు దోచుకుంటున్నారన్న వార్త, ఆ విషయంలో తగు చర్య తీసుకొంటున్నామని, కనక ధైర్యంగా ఉండమని రక్షక సిబ్బంది చేసిన ప్రకటన ప్రముఖంగా కనిపించాయి.

ఊరు చివర దిక్కుమొక్కు ఉండదు. కొత్తగా ఇళ్ళు కట్టుకోదలుచుకొన్నవాళ్ళకి అక్కడగాని స్థలాలు దొరకవు.

మా పెద్దలిచ్చిన ఇల్లు ఊరుకి మధ్యగా ఉంది కనక దొంగల భయంలేదని నాకు ధైర్యం.

దీపావళి కథలపోటీలో రు.650/- బహుమతి పొందిన కథ

# భిన్నరూపాలు

నాకు దొంగతనానికి గురైనవాళ్ళంటే జాలి జడ్జీలు దొంగలకి కఠిన శిక్షలు వెయ్యాలని నా అభిప్రాయం పేజీ తిప్పాను. "ఓట్లివ్వకపోతే మీ వాడనంతటిని మసి చేస్తాం, నుసి చేస్తాం" అని అధికార పక్షం బెదిరించి, కొంత ప్రత్యక్షంగా జరిపి చూపించి, హరిజనుల ఓట్లు సంపాదించిందని ప్రతిపక్షాలు ఆరోపించాయి. "ప్రతిపక్షాలు అధికారంతో ఉన్న చోట అవి మాత్రం ఇటువంటి వాగ్దానాలు చెయ్యలేదా? చెల్లించుకోలేదా?" అని ముఖ్యమంత్రి బెదిరింపుల్ని వాగ్దానాలుగా చమత్కరించి ప్రశ్నించారు, అన్న వార్త చదివాను రాజకీయాలలో హరిజనుల ఓట్లు దోచుకోవటం పరిపాటి హరిజనుల పట్ల నాకు జాలి ఉంది రాజకీయాలింత హీనస్థితికి దిగజారకుండా ఉంటే బావుండును.

ఇంట్లో గిన్నెల శబ్దాలు అవుతున్నాయి. అంటే, నూకాలమ్మ పనిలోకి వచ్చిందని అర్థం మా ఆవిడ వరలక్ష్మి, వినటానికిష్టపడే వార్తాప్రసార కేంద్రం నూకాలమ్మ. నూకాలమ్మ వచ్చి ముగ్గుపెట్టటానికి నీళ్ల బకెట్టుతో, చీపురుతో నేను కూర్చున్న వీధి అరుగుమీదకి దండెత్తలేదంటే ఇవాళ ఏదో గట్టి వార్తే తెచ్చి ఉంటుంది.

నూకాలమ్మ బదులు వరలక్ష్మి వచ్చింది. వస్తూనే,

"ఇది విన్నారా?" అని అడిగింది ఉపోద్ఘాతంగా.

"నూకాలమ్మ నాకు చెప్పిందే" అన్నాను పత్రిక మడిచి ఖాళీ అయిన కాఫీ గ్లాసు వరలక్ష్మి చేతికందిస్తూ. నేను ఖాళీ కాఫీ గ్లాసు చేతికందిస్తే మామూలుగా అయితే, "అక్కడుంచకూడదా నూకాలమ్మ తీస్తుంది!" అంటుంది ఇవాళ మాట్లాడకుండా అందుకొని,

"సుభద్రా వాళ్ళిళ్ళు దోచుకున్నారుట" అంది

"ఎప్పుడు?"

"రాత్రి"

"వాళ్ళు ఊళ్లో లేరా?"

"ఉన్నారు."

"సినిమాకి వెళ్లారా?"

"లేదు"

"హోటలుకు వెళ్ళినప్పుడా?"

"శనివారపు ఫలహారం నిన్న ఇంట్లోనే చేసారట"

సుభద్ర ఆమె భర్త సుబ్బారావు శనివారాల రాత్రులు అన్నం తినరు. హోటలుకు వెళ్లి మసాలదోసెల్లాంటి ఫలహారాలు చేస్తారు. ఆ నోరులేని వెంకటేశ్వర్లు అవి తనే తిన్నట్టుగా సంతోషిస్తాడనుకొంటాను

"ఇంతకూ మరి దొంగలు ఇంట్లోకి ఎల్లా ప్రవేశించారట?" వరలక్ష్మి అప్పుడు చెప్పింది నూకాలమ్మ చెప్పగా తను విన్న వైనం.

రాత్రి పదకొండు గంటలప్పుడు తలుపుకొట్టిన చప్పుడు విని లేచిందట సుభద్ర. శనివారాల రాత్రిళ్ళు ఎప్పుడైనా పై ఊళ్లో ఉన్న కొడుకు రఘు, కోడలు సీత వస్తూ ఉంటారుట. వా[illegible] అయివుంటారని సుభద్ర ధైర్యంగా తలుపు తెరిచిందట. ఆ వెంటనే నలుగురు లోపలికి తోసుకు వచ్చారట. ఒకడు తలుపు గడియ పెట్టాడుట. మరొకడు కత్తి ఝళిపిస్తూ, "అరిస్తే పొడిచేస్తాను" అని సుభద్రని బెదిరించాడట. ఈ గొడవకి సుబ్బారావు గారు లేచి వచ్చేసరికి "బుద్ధిగా చెప్పినట్లు చెయ్యమని లేకపోతే మీ ఆడదాని ప్రాణం ఆ పైన నీ ప్రాణం తీస్తాం" అని బెదిరించారుట

ఆ విధంగా ఇద్దరిని భయపెడ్తూ బీరువాలు పెట్టెలు తెరిపించి, డబ్బు, నగలు, వెండి సామానులు, పట్టుచీరలు మూటగట్టారుట. అందులో రఘు పెళ్లి సామానులు అన్నీ ఉన్నాయిట. వెళ్తూ వెళ్తూ సుభద్ర మెళ్లో గొలుసులు, మంగళసూత్రాలతో పాటు నిలువు దోపిడీ చేసారుట, చెవులకున్న దుద్దుల్లో ఒకదాని శీల రాకపోతే బలవంతంగా చెవి తెంపి తీసుకుపోయారుట. అంత కథ చెప్పి,

"ఒకసారి వెళ్లి చూసి రండి" అంది వరలక్ష్మి

"వెళ్ళమంటావా?" అని అడిగాను

"వద్దంటే మానేసేటట్టు. అయినా సుభద్ర చెవి తెగిందంటే మీకు చీమ కుట్టినట్టయినా లేదా!" అని ఆశ్చర్యం ప్రకటించింది.

సుభద్రని పలకరించి వచ్చే అవకాశం కోసం నేను ఎదురు చూస్తూ ఉంటానని అనుమానించేది వరలక్ష్మి మాకు పెళ్ళయిన కొత్తలో, అంటే ముప్పై ఏళ్ళ క్రితం.

ఇప్పుడు నేను, తను, సుభద్ర యాభయ్యోపడుల్లో అడుగుపెట్టాక అలవాటుగా ఎత్తి పొడుస్తూ ఉంటుంది, ఎప్పుడైనా

నాకు సుభద్రకి ముప్పైయేళ్ళ క్రితం విడిగా పెళ్ళిళ్ళయ్యాయి. • ముప్ఫయి అయిదేళ్ళ క్రితం సుభద్రని నాకిచ్చి చేయాలని ఇటువాళ్ళు అటువాళ్ళు అనుకొనేవారు. ముప్ఫయి అయిదేళ్ళ క్రితంకి మధ్య కాలంలో నేను చెడ్డ పేరు సంపాదించుకొన్నాను. నేను సిగరెట్టు కాలుస్తానని చాలామందికి తెల్సింది. ఆడపిల్లల్ని అల్లరిపెడ్తానన్న ప్రఖ్యాతి వచ్చింది అన్నింటికి మించి ఏ డాక్టర్నో, ఇంజినీర్నో అవుతానని వాళ్ళు అనుకొంటే కేవలం లెక్చరర్ని అయి వూరుకొన్నాను అందుకని సుభద్ర తల్లిదండ్రులు తమ ఏకైక సంతానం అయిన సుభద్రని ఇంజినీరైన సుబ్బారావుకిచ్చి పెళ్ళి చేసారు. సుభద్ర ఏ పేచీ పెట్టకుండా చేసుకొంది అందుచేత సుభద్ర నన్ను ఒకప్పుడు ప్రేమించింది అని కాని అభిమానించింది అని కాని చెప్పుకోడానికి దాఖలాలు లేవు నాకు









రోమియో పేరు రావటానికి కారణభూతురాలైన మా పక్కింటి వరలక్ష్మి, మా ఇంటి మహాలక్ష్మి అయింది ఒకే పేట వారమైన మా ముగ్గురికి ఒకరితో ఒకరికి బాగానేస్నేహం ఉండేది

ఈ ముప్పై ఏళ్లలోను సుబ్బారావు ఈ ఊళ్లోనే ఉద్యోగం సంపాదించి, అత్తవారింట్లో స్థిరపడ్డాడు. సుబ్బారావు మంచివాడు, దైవభీతి కలవాడు అన్న పేరు సంపాదించుకొంటే, నేను మొండివాడు, నాస్తికుడు అన్న పేరు సంపాదించుకొన్నాను. మా పై తరం వెళ్లిపోయింది. మేమే పెద్దలం ఇప్పుడు మా కుటుంబాలకి

వరలక్ష్మి తమాషా అయిన మనిషి. మా పెళ్లయిన మొదటి నుంచి సుభద్రని అక్కయ్యా' అని పిలవకపోయినా సుబ్బారావుని బావగారు అంటూ వ్యవహరించేది. మా పెళ్లయ్యేనాటికి నాకు సుభద్ర మీద పిసరంతైనా అభిమానం మిగిలి ఉంటుందని అనుమానిస్తే సుబ్బారావుని అన్నయ్యగారు అని వ్యవహరించి జాగ్రత్తపడేది. ఆ మాటకొస్తే నన్ను పెళ్లి చేసుకొనేదికాదు.

అయితే సుభద్ర పెళ్లాడటానికి పనికిరాడని వదిలేసిన నన్ను తను పెళ్లి చేసుకోవటం వల్ల సుభద్రకి తను లోకువేమోనన్న శంక వరలక్ష్మికి ఉంది అందుకని తను సుభద్ర గురించి నాతో, "మీ సుభద్ర" అని వ్యవహరించినప్పుడల్లా సుభద్ర పట్ల నాకు ప్రేమగాని, గొప్ప అభిప్రాయంగాని లేవని నేను కోరుకొన్నది, పెళ్లాడింది వరలక్ష్మినేనని ఎన్నిసార్లు, అవసరం అయితే అన్నిసార్లు వరలక్ష్మికి చెప్పి ఆమె ఆత్మవిశ్వాసాన్ని ఎగదోయటమే ఆమె నా నుంచి ఆశించేదని నాకు త్వరగానే అర్థమైపోయింది.

"సుభద్ర కట్టుకున్న చీరె బావుంది కదూ!"

"ఆ చీర తనకంటే నీ వంటికే ఎక్కువ నప్పుతుంది. కాని నువ్వు కట్టుకున్న చీర, ఆ చీరకంటే బావుంది నా కళ్లకి."

"ఆ చీర కొనమని అడగనులెండి" అంటుంది వరలక్ష్మి నా పథకం పోల్చుకున్నట్టు. తను ఆశించింది నేను చీర కొనటం కాదు. సుభద్ర కంటే తనే మన్న అని నేను అనటం. వరలక్ష్మి వెర్రిది. నాకు ఏ ద్రాక్షలు పులుపో, ఏవి తీపో అర్థం చేసుకోదు.

# భిన్న రూపాలు

సుభద్రా సుబ్బారావులు ఆర్నెల్లకొసారి సత్యనారాయణవ్రతం చేసుకొని పిలుస్తూ ఉంటారు. "అంతకుముందు ఎన్నోసార్లు విన్న ఆ వ్రత కథలు, ఆ తరువాత ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠతతో నేను వినలేను వినకపోతే సత్యనారాయణకి కోపం వస్తుంది. కనక రాను" అంటాను వరలక్ష్మితో

"మనం ఎల్లాగూ చేసుకోం కనీసం ఇంకొళ్ళు చేసుకొంటున్నప్పుడు వెళ్లడానికేం రండి" అని పట్టుపడుతుంది వరలక్ష్మి. నేను వెళ్తాను.

"ఎంతైనా ఓల్డ్ ఫ్లేమ్ కదా!" అంటుంది వరలక్ష్మి

వ్రతాలు, చేసుకొనేవారికి, చేయించే వారికి లాభసాటి. వెళ్లటం వరలక్ష్మిలాంటి వారికి చెలగాటం. నాకు ప్రాణసంకటం. సుభద్ర ఇంట్లో నేను అనాలోచితంగా అన్న మాటో, చేసిన పనో తరువాత నన్ను దెప్పి పొడవడానికి వరలక్ష్మి వాడుకొంటుంది. నన్ను ఆ విధంగా ఇరుకున పెట్టి, తన కార్యాలేమైనా ఉంటే సాధించుకొంటుంది.

ప్రపంచంలో ఇతర్లు చేత వారి కిష్టంలేని పని నయాన్న చేయించలేమని భయాన్న మాత్రమే చేయించగలమని వరలక్ష్మి నమ్మే సూత్రం. భయాన్న చేయించుకోడానికి తనకి నేను తప్ప ఎవరున్నారు. అందుకే చేస్తాను.

వరలక్ష్మికి సుభద్రతో పోటీ ఉన్నా, ఆమె కొడుకు రఘు అంటే విపరీతమైన ప్రేముండటానికి కారణం మాకు పిల్లలు లేకపోవటమే! రఘు పెళ్లి సీతతో సంభవం అవటానికి రఘు కోరగ, నడుం కట్టి వరలక్ష్మి శ్రమించింది. రఘు సీత పరస్పరం ప్రేమించుకొన్నారు. కాని అంతస్థులు అడ్డుపడ్డాయి రఘు ఒక పెద్ద ఇంజినీరు కొడుకు కావటమే కాక తను స్వయంగా ఇంజినీరు. సీత నాతోటి లెక్చరర్ నరసింహం కూతురవటమే కాక అతని ఆడ సంతానంలో మధ్యది. మొదటి ఆడపిల్ల పెళ్లి శక్తికి మించి ఖర్చుపెట్టి కొంత చితికాడు నరసింహం. సీతకి కాస్త ఆడంబరంగా పెళ్లి చేస్తే మూడో పిల్లకి గుళ్లో దండల మార్పిడి పెళ్లి చెయ్యగలుగుతాడు. కాస్త పొదుపుగా సీత పెళ్లి చేస్తే రెండు పెళ్లిళ్ళు సమంగా చెయ్యగలుగుతాడు.

"ఏం చూసావ్ సీతలో! అందము, చదువు అయితే అంతకంటే చదువుకొన్న అందమైన అమ్మాయిని చూస్తాం. సీతనుచేసుకొంటే మన అచ్చట్లు ముచ్చట్లు అబో ..." రఘు, సుభద్ర ఏమందో చెప్తూ, నా ఎదుట మాట పూర్తిచెయ్యటానికి జంకాడు. వరలక్ష్మి "ఫరవాలేదు చెప్పు" అని వత్తిడి చేసి చెప్పించింది

"ఆ బోడి లెక్చరర్ ఏం తీర్చగలడు అంది అమ్మ" అని పూర్తిచేసాడు లెక్చరర్‌ని అయిన నా ఎదుట, వాళ్లమ్మ వాడిన విశేషణం నోరి జారి చెప్పినందుకు చింతిస్తూ సుభద్రకి లెక్చరర్లంటే ఘనమైన అభిప్రాయం ఉంటుందని నేను అనుకోలేదు. తన భర్త ఉద్యోగాన్ని బోడి ఉద్యోగం అని సుభద్ర అనటం వరలక్ష్మికి కోపమే తెప్పించిందో, తద్వారా నాకు సుభద్రకు మధ్య దూరం పెరుగుతుందని సంతోషించిందో నాకు తెలియదు.

రఘుకి తా వలచింది గుణాలకి సీత, రూపానికి రంభ అన్న నమ్మకం ఉంది. ఎట్టి పరిస్థితుల్లోను ఆమెను వదులుకోడానికి సిద్ధంగా లేడు. "ఈ పెళ్లి జరగకపోతే పిచ్చివాడినై పోతాను" అని మాతో అన్నాడు.

"నేను మీ అమ్మతో మాట్లాడ్తాను" అని వరలక్ష్మి భరోసా ఇచ్చింది.

వరలక్ష్మి సుభద్ర ఇంటికి వెళ్లింది సుభద్రకి చాలా విధాల నచ్చ చెప్పింది. "పిల్ల బంగారుబొమ్మ. మీరు కాదనటానికి నాకు కారణం కనిపించదు. నువ్వు చెప్తే బావగారు కాదనరు సుభద్రా!"

'నాకున్నది ఒక్కడే కొడుకు. ఏ ముచ్చటా వైభవమూ లేకుండా' వాడి పెళ్లి జరగటం నాకిష్టంలేదు. నీకేం నువ్వెన్నన్నా చెప్తావ్! ఒక కొడుకుని కని ఉంటే తెలిసేది"

సుభద్ర, వరలక్ష్మి ఆయువుపట్టులో దెబ్బకొట్టింది. కార్యం సాధించదలుచుకొని వెళ్లిన వరలక్ష్మి ఆ అవమానాన్ని మింగి, "ఒక్కడే కొడుకు కనుకనే వాడు పిచ్చివాడై పోకూడదు" అంటూ ఒక

# టాన్‌టెక్స్®

# ఎకానమి

## నాణ్యత...ఇప్పుడు అందుబాటులో

Imageads M-1797 Tel



పెద్ద పిరికి మాత్ర వేసింది సుభద్రకి.

"తెచ్చుకొనేటప్పుడు కిందింటి పిల్లను తెచ్చుకొంటే అణిగి ఉంటుందంటారు. ఆలోచించు. కన్నకొడుకు కోసం నువ్వు నీ ఆశలు కొన్ని త్యాగం చేయ్యాలి. పిల్లల విషయంలో కన్నతల్లి త్యాగం చేయగలిగినట్టు ఈ ప్రపంచంమీద ఎవరూ త్యాగం చెయ్యలేరు. అది నా అనుభవంలోకి రాకపోయినా నేను చూస్తూ ఉన్న విషయం. నేను కూడా రఘు పెళ్ళి లోటుగా జరిగితే భరించలేను. పెళ్ళి ఏ లోటు లేకుండా జరిపించమని నరసింహం గారితో చెప్పమని మా వారితో చెప్పాను" అని నచ్చ చెప్పింది వరలక్ష్మి, సుభద్రకి.

సుభద్ర క్రమేపి మెత్తబడింది. తను బిగదిస్తే మా అంత చూసుకొని రఘు ఏ రిజిస్టరు పెళ్ళో చేసుకొని ఎదురు తిరగవచ్చునని భయపడింది.

"మావాడు ఆ పిల్లే కావాలంటున్నాడు కదా అని దాన్ని అలుసుగా తీసుకొని ఆ నరసింహంగారు అన్నీ ఎగకొడ్తానంటే కుదరదు. కట్నాలు లాంఛనాలు అన్నీ సవ్యంగా జరిపించే బాధ్యత మీ ఆయనది"

సుభద్ర మాటలు వరలక్ష్మి నాకు చెప్పింది

"నరసింహం గారి దగ్గరేముందని ఇస్తాడుట!" అన్నాను.

"లేకపోతే ఎక్కడ్నుంచైనా తెచ్చి ఇవ్వమనండి. లేకపోతే ఈ పెళ్ళి జరగదు" అంది నిక్కచ్చిగా వరలక్ష్మి. ఆపైన నరసింహం దగ్గరకి రాయబారం పంపింది, నన్ను

"నాకు రఘులాంటి అల్లుడు రావటం సంతోషమే! కాని వాళ్ళకి ఏమేమి కోర్కెలున్నాయో అవి తీర్చగల తాహతు నాకుందో లేదో తెలుసుకోకుండా ముందుకు పోలేను" అన్నాడు నరసింహం.

సుభద్ర దగ్గరకి వరలక్ష్మి, నరసింహం దగ్గరకి నేను ఓ నేను ఓ వారం రోజులపాటు తిరిగి కొన్ని విషయాలలో అంగికారానికి వచ్చేలా చేసాం.

"పెళ్ళికి ముందు రోజు సాయంత్రం టిఫిన్ నుంచి, పెళ్ళి మర్నాడు బ్రేక్‌ఫాస్ట్ దాకా మగపెళ్ళి వారికి భోజనాలు ఏర్పాట్లు చేయాలి"

"అట్లాగే చేస్తాను"

"పిల్లవాడికి తాంబూలాలప్పుడు, ఎదురు సన్నాహం సమయంలోను, కన్యాధార సమయంలోను, గృహప్రవేశం సమయంలోను సూట్లు పెట్టాలి".

"ఆంధ్రాలో సూట్లు వేసుకొనే కాలమే లేదు కదా! లాగు చొక్కాలు పెడ్తాను"

"కుదరదు"

కన్యాధార అప్పుడు తాంబూలాలప్పుడు సూట్లు పెట్టేటట్టు మిగిలిన రెండు సమయాల్లోను కాస్త మంచి పాంటు గుడ్డలు, షర్టు, గుడ్డలు పెట్టేటట్టు రాజీ కుదిర్చాం.

"పెట్టే సూట్లు టెరివూల్‌వే పెట్టాలి. పైగా అవి పెళ్ళి టైముకి కుట్టించి ఇవ్వాలి."

'అంటే కుట్టు ఛార్జీలు కూడా నేనే

## దీపావళి

దిపావళి ఇంకా రానే రాలేదు
బొట్లు అసలు కొననే కొనలేదు
కాని బొట్లు పేలాయి
ఎక్కడను కొంటున్నారు
సామాన్యుడి గుండెలలో
పేలినవి బొట్లు కాదు థైనమైట్లు
మరి వినండి ఈ సామాన్యుడి
దిపావళి బాధల గాథ

చిన్నోడికి వైరు తీగెలు
పెద్దోడికి లక్ష్మి బొట్లు
శ్రీమతికి స్పెషల్ పత్రికలు
కూతురికి కొత్త పరికిణీలు
సామాన్యుడి గుండెలో దడదడలు

జేబులు నిల్లు చేసే టపాసులతో
జారు జారు నూనెలతో
మెత్త మెత్తని ఎండితో
కరకర లాడే కారప్పూసలతో

లటరు 5 రూ మాత్రమే పాలతో
ప్యాకెటు 5 రూ మాత్రమే వరిమిసెల్లితో
కేజి 5 రూ మాత్రమే పంచదారతో
తియ్య తియ్యని సెమియాలతో

జాగ్రుకు తినేస్తున్నారు తన నెలరోజుల కష్టాన్ని
రావట్లేదు చెవిలోకి బొట్ల శబ్దాలు
వస్తున్నాయి గుర్తుకు తక్కిన రోజులు
నెల రోజుల కష్టాన్ని ఒక్క రోజులో
బూడిద చేశామన్న బాధతో
తరువాత జీతము ఎప్పుడొస్తుందా అన్న ఆశతో!

– పులవర్తి

## భిన్న రూపాలు

పెట్టుకోవాలన్న మాట. సరే తప్పేదేముంది!కుట్టిస్తాను. కాని ఆవిడ రిసెప్షన్ అంటోందేమిటి?" అన్నాడు నరసింహం నాతో.

"ఏదో చిన్న వేడుక" అంది సుభద్రమ్మ వరలక్ష్మితో.

"వాళ్ళింట్లో గృహప్రవేశం అయిన సాయంత్రం చేసుకోమనండి" అన్నాడు నరసింహం. కాని చివరికి ఈ పెళ్ళి జరగదేమోనన్న భయంవల్ల పెళ్ళినాటి సాయంత్రం రిసెప్షన్ ఏర్పాటు చేయడానికి ఒప్పుకున్నాడు.

"ఆడబడచులు లేరు కనుక ఆ లాంఛనాలు లేవు"

"రక్షించారు"

"అందుకని అత్తగారికిచ్చే, లాంఛనాలే ఘనంగా ఉండాలి .అంటే నాకు పెట్టే చీరలన్నీ పట్టువై ఉండాలి"

"చీరలు?"

"తాంబూలాలప్పుడు అప్పగింతలప్పుడు ఎల్లాగూ పెడ్తారు. గృహప్రవేశం అప్పుడు వాళ్ళ అమ్మాయితో పాటు నాకు పెట్టాలి "

"గృహప్రవేశానికి మా అమ్మాయికి సాధారణమైన చీర పెట్టినా ఈవిడకి పట్టు చీర పెట్టాలా!"

"వాళ్ళ అమ్మాయికి మధుపర్కం తప్పించి అన్నీ పట్టు బట్టలే పెట్టాలి. అబ్బాయికి కూడా పట్టు తాపితాలు పెట్టాలి."

నరసింహం ఇవన్నీ ఒప్పుకొన్నాడు. వెండి బంగారాల సంభాషణలు ఆగిపోతూ కుంటుతూ నడుస్తూ ముందుకు సాగాయి. అమ్మాయికి పెట్టే నగలు అబ్బాయికి ఇచ్చే వెండి చెంబు కంచం, బంగారపు ఉంగరం ఏది ఎంతెంత బరువుండాలన్న విషయంలో భేదాభిప్రాయాలు వచ్చాయి.

"నేను ఇంతకన్నా తూగలేను. ఇంతకంటే పెడ్తే నేను నా భార్య మిగిలిన పిల్లలు వీధిలో నిలబడి ముష్టెత్తుకోవాలి" అంటూ చేతులు ఎత్తేసాడు నరసింహం

సీత మా ఇంటికి వచ్చి, "ఈ పెళ్ళి ఎల్లాగైనా జరిగేలా చూడండి మావయ్యగారూ?" అంటూ భోరున ఏడ్చింది

"ఈ పెళ్ళి ఎల్లాగైనా జరిగితీరాలన్న పట్టింపు రఘుకి ఉంటే అతని తల్లిదండ్రుల్ని సర్దుకోమని చెప్పచ్చు కదా!" అన్నాను.

సీత రఘుకి ఉత్తరం వ్రాసింది రఘు వచ్చాడు.

"ప్రతీ విషయం తెగేదాగా లాగటం నాకిష్టం లేదు. ఈ పెళ్ళి మీరు చెయ్యకపోతే నేనే చేసుకొంటాను" అంటూ రఘు చిందులు వేసాడు.

"నువ్వు చిన్నవాడివి. నీకు తెలియదూరుకో! మనం గట్టిగా నిలబడకపోతే వాళ్ళు అన్నీ ఎగగొడ్తారు. ఆఖరికి పెళ్ళివారికి ఓ పూట భోజనం కూడా సరిగా పెట్టరు. మనం అక్కర్లేదంటే ఆ డబ్బు కూడా ఆ మూడో పిల్ల పెళ్ళిలో ఖర్చు పెట్టి డాం డూం అని చేస్తారు." అంది సుభద్ర. సుభద్ర అన్నదాంట్లో యదార్థం ఉన్నట్లు వరలక్ష్మికి కూడా తోచింది. ఆ విధంగా సుభద్ర ఆలోచించటం ధర్మమే అనుకొన్నాను.

నాకు ఆ వెండి కంచాలు, ఉంగరం అక్కర్లేదు. ఆయన్ని ఇబ్బందిపెట్టకండి" అన్నాడు రఘు.

"అవి ఇవ్వకపోతే ఈ పెళ్ళి జరగదన్న బెదురు మనం పెట్టకపోతే - ఆయన రాల్చగలిగింది కూడా రాల్చడు. ఆయన ఇంతవరకు ఒప్పుకొన్న వాటిలో ఏవి తనంతట తానుగా ఇస్తానన్నాడుట. మొదట్లో ఇవ్వడానికి ఇష్టపడనివి తరువాత ఇవ్వటానికి ఎల్లా ఒప్పుకొన్నాడట? మనుషులెవరు ఓ పట్టాన తమకున్నది ఇతర్లకివ్వరు. అందుకని మనం బిగదీసుకున్నట్లు నటించాలి. ఈ పెళ్ళి నిజంగా ఆగిపోతుందేమోనన్న భయం కలిగితే అప్పుడు వాళ్ళు ఎక్కివస్తారు. నిజంగా ఎక్కలేని పరిస్థితుల్లో ఎక్కరు. అప్పుడే మనం ఓ మెట్టు దిగచ్చు. ఈ పెళ్ళి జరిగే తీరుతుందిరా పిచ్చి నాన్నా!" అంది

సుభద్ర.

నరసింహం అప్పటికే తన పరిస్థితి బొటాబొటిగా ఉందని ఇంక డబ్బు లేదని చెప్పాడు నాకు.

"ఎల్లాగో కట్నం ఇవ్వటం లేదు కదండీ! అప్పో సొప్పో చేసి ఇప్పటికి పబ్బం గడపండి. కార్యం కానివ్వండి" అని చెప్పి చూసాను.

"హాయిగా రిజిస్టర్ పెళ్ళి చేసుకోండర్రా ఏ గొడవ ఉండదు సాక్షి సంతకం నేనూ మా ఆవిడాపెడ్తాం" అని రఘుకి, సీతకి సూచించాను.

"మధ్య మనకెందుకుట చెడ్డ పేరు. ఇటు వైపు వారు అటువైపు వారు కలిసి మనకి అక్షింతలు వేస్తారు" అంది వరలక్ష్మి.

తన పెళ్ళి అక్క పెళ్ళిలాగే జరగాలని, దానికి బంధువులు, స్నేహితులు అందరు రావాలని, తన పెళ్ళిలో తను మంచి బట్టలు కట్టుకోవాలని ఖరీదైన నగలు వేసుకోవాలని కోరుకొంది సీత.

"ఆడపిల్లల జీవితంలో అది మరుపురాని రోజు. దానికోసం కొంత ఖర్చు ఆడపిల్ల తండ్రి భరించాల్సిందే" అంది వరలక్ష్మి.

"తండ్రి ఖర్చు భరించలేకపోతే సీతే ఆ ఖర్చుకు ఒప్పుకోదు అకాడికి నేను అనవసరంగా మా వాళ్ల మనసులు కష్టపెట్టటం ఎందుకు. అందులోను వాళ్ళు నా పెళ్ళి నేను కోరుకున్న పిల్లతో జరిపిస్తున్నప్పుడు' అనుకొన్నాడు రఘు.

సీత మనసు తెలిసి నరసింహం రఘు సంబంధం వదులుకోలేక పోయాడు. అడకత్తెరలో పోక చెక్కలా నలగటానికే సిద్ధపడ్డాడు. అందుకని కాస్త కాస్తగా ఎక్కి వచ్చాడు. నరసింహం దగ్గర వీలైనంత వరకు రాబట్టుకోడమేకాని, సీతని వదులుకొనే ప్రసక్తి లేదు. కనుక సుభద్ర సుబ్బారావు కొంచెం దిగి వచ్చారు

పెళ్ళి బాగా జరిగింది. రఘు, సీత సంతోషించారు

నరసింహం పి. యఫ్ నుంచి ఎంత అప్పు చేయటానికి వీలవుతుందో అంతా తీసుకొన్నాడు ఆపైన జలగల లాంటి వడ్డీ వ్యాపారస్థుల దగ్గర ఆరువేలు అప్పు తీసుకొని పెళ్ళి జరిపించాడు. కాని సుభద్ర సుబ్బారావులు కోరుకొన్న స్థాయిలో పెళ్ళి జరగలేదు!

ఆ తరువాత అప్పుల వాళ్ళు కాలేజికి వచ్చి వడ్డీ కోసం నరసింహం పరువు తీస్తూ ఉంటే చూసి అప్పు నేను తీర్చాను. "మీ దగ్గరున్నప్పుడు తీరుద్దురుగాని" అని అంటే కాని ఆయన నా దగ్గర డబ్బు తీసుకోడానికిష్టపడలేదు. ఆయన అప్పుల్లో మునగటానికి నేను కూడా బాధ్యుడినే కనక ఆ సహాయం చేసి నా వాటా పాపం ప్రక్షాళన చేసుకొన్నాను. నరసింహం లాంటి వాళ్ళను చూస్తే నాకు జాలి.

నరసింహంకి అప్పుల వాళ్ల వల్ల కలిగిన అవమానం కళ్లారా చూసాక నేను నరసింహాన్ని ఖర్చుకి ఒప్పించకుండా ఉండాల్సిందని, అప్పుడు సీత, రఘు సరైన నిర్ణయం తీసుకొనేవారని చిన్నపిల్లల ముచ్చట తీర్చటం పెద్దల ధర్మం అంటూ నాలాంటి మధ్యవర్తులు మధ్యలో దూరి ఒక పక్షం వారికి మాత్రమే అనుకూలమైన ధర్మాలు చెప్పటం తప్పని, అల్లా చేసి పిల్లలని ఎదగనీయకుండా చేసానని, వాళ్ల సమస్యకి నా పరిష్కారం సరైనది కాదని అనిపించింది నాకు అందుకనే నరసింహం ఇంటికి సీత కొడుకు బారసాలకి, సుబ్బారావింట్లో రఘు కొడుకు అన్న ప్రాసనకి వెళ్లలేదు ఆ రెండు సార్లు వరలక్ష్మి ప్రయత్నాలు ఫలించలేదు.

మళ్ళీ ఇన్నాళ్లకి సుభద్రా వాళ్ళింట్లో దొంగలు పడ్డ కారణంగా సుభద్ర చెవి తెగి గాయం అయిన సందర్భంగా నన్ను వరలక్ష్మి వెళ్ళి పలకరించి రమ్మని బలవంత పెడ్తోంది.

నేను లేచి కాళ్లకి చెప్పులు తగుల్చుకొని గేటు దాటి గేటు మూయబోతూ వెనక్కి తిరిగిన నాకు, "ఎంతైనా ఓల్డ్ ఫ్లేమ్ కదా! వెళ్లకుండా ఉండగలరా!" అన్న భావం తొణికిసలాడుతూ వరలక్ష్మి పెదవుల మీద ఓ చిర్నవ్వు కంట బడింది

సుభద్ర చెవికి ప్లాస్టర్‌తో తలుపు తీసింది. సుబ్బారావు సుభద్రలను చూడగానే, గతరాత్రి అనుభవానికి ఎంతగా నలిగిపోయారో, నీరసపడి పోయారో కదా అని జాలి కలిగింది. ఇల్లంతా అన్ని వస్తువులు చిందర వందరగా విరజిమ్మి ఉన్నాయి టెలిఫోన్ ఉరి తీయబడిన మనిషి లాగా క్రేడిల్ నుంచి వేళ్లాడ్తోంది. పోలీసులకి కంప్లైంట్ ఇవ్వమని, సహాయానికి రమ్మంటే నేను వస్తానని సుబ్బారావుకి చెప్పాను. దోచుకొనే వాళ్ళు దోచుకుపోక మనిషిని గాయపరచడం క్రూరం! సుభద్రా వాళ్లకి రోజు మనుష్యుల పలకరింపు చాలా అవసరం. రావటం మంచిదే అయింది. వాళ్ల దగ్గర సెలవు తీసుకొని బయల్దేరిన నాకు నరసింహం గుర్తుకు వచ్చాడు, బహుశహ వాళ్ల వియ్యంకుడన్న కారణంగా అయి ఉండవచ్చు. ఆయనను చూసి చాలా రోజులైందని అటు మళ్ళాను

నరసింహం నేను వెళ్ళేసరికి ట్యూషన్లు చెప్తున్నాడు "మంచు, నీరు, నీటి ఆవిరి చూడటానికి వేరుగా ఉన్న రసాయనికంగా మూడు ఒకటే ఆ భిన్నరూపాలు వేడిలో తేడాల వల్ల కలిగినవే."

నన్ను చూసి పాఠం ఆపి నరసింహం ఆప్యాయంగా ఆహ్వానించాడు. రెండేళ్లయినా తను నాకు తీర్చని అప్పు గురించి వచ్చా ననుకొన్నట్టున్నాడు, "మీ అప్పు త్వరలో తీరుస్తాను" అని ఒక శుష్కహాసం చేసాడు. అందులో జీవం లేదు మనిషి నీరసంగా కృంగి పోయి ఉన్నాడు. అలిసి పోయి ఉన్నాడు

"తొందర లేదు" అని చెప్పి సుభద్ర ఇంట్లో దొంగతనం గురించి చెప్పాను

"వెళ్ళి పలకరిస్తాను' అన్నాడు నేను ఇంటికి బయల్దేరాను.

ఆయన దైన్య స్థితిని చూసాక ఇందాకట్నుంచి మబ్బు చాటు చందమామలాగా ద్యోతకం అయీ అవకుండా నన్ను ఇబ్బంది పెడ్తున్న భావం అర్థమైంది

దుద్దు రాబట్టటానికి సుభద్ర చెవి తెంచాడు దొంగ. కట్నం, కానుకలు రాబట్టటానికి నరసింహాన్ని కష్టపెట్టింది సుభద్ర. ఈ ఇద్దరు పీడితులే. □






## వ్యక్తి గతం



రెన్యాకు చెందిన శ్రీ జయంత్ షా ఆరవ హిమాలయన్ ర్యాలిలో అక్టోబర్ 29న అద్భుత మైన విజయాన్ని సాధిం చారు ఈ ర్యాలిలో ఆయన గెలవటం వరు సగా ఇది నాలుగవసారి తమ నిస్సాన్ 240 ఆర్ ఎస్ కారుని అత్యంత నైపుణ్యంతో నడిపి 415 పెనాల్టీ పాయింట్లతో ఆయన ఈ మన విజయాన్ని సాధించారు □



ఆచార్య రజనీష్ ఆయన శిష్యులు కొంద రిని అమెరికా సంయుక్త రాష్ట్రాల నించి తప్పించుకు పోతూ ఉండగా ఉత్తర కెరోలినాలో చార్లెట్‌లో అరెస్టు చేశారు ఆయన జెట్ విమానాలని రెంటింటిని కూడా స్వాధీనం చేసుకున్నారు అక్రమ పద్ధతుల ద్వారా విదేశీయులకు ఆశ్రయం కల్పించడానికి ప్రయత్నించడం, ఇమిగ్రేషన్ అధికారులని తప్పుదారి పట్టించడం అన్న నేరాలని ఆయనపై మోపారు శ్రీ రజనీష్ కు అమెరికా సంయుక్త రాష్ట్రాలు, పశ్చిమ యూరోప్, ఆస్ట్రేలియాలలో ఉన్న ధనికవర్గాలలో చాలామంది శిష్యులు ఉన్నారు దాదాపు 5 లక్షల మంది అనుచరులు ఆయనకు ఉన్నారు గతంలో ఒరెగాన్ రాష్ట్రంలో కూడా ఆయనపై ఇలాంటి ఆరోపణలు వచ్చాయి ఆ సందర్భంగా అక్కడ ఆయన ఆశ్రమం కూడా ధ్వంసం చేయబడింది □

# వారఫలం

**15-11-1985 శుక్రవారం మొదలు 21-11-1985 గురువారం వరకు**

★ **మేషం** : గ్రహమండలంలో, మీ రాశికి అనుకూలదాయకంగా, లాభదాయకంగా, క్రయవిక్రయాలలో లాభదాయకంగా కొన్ని మార్పులు జరగనున్నవి మీరే గమనిస్తారు. పత్రికారంగాన ప్రగతి కనిపిస్తుంది. స్త్రీలకు: యత్నకార్యసిద్ధి, ఉద్యోగరీత్యా మేలు

★ **వృషభం** : ఎవరినో అని ప్రయోజనం లేదు స్వయంకృతాపరాధమే దూర బంధువులు యింటికి రాగలరు. మంచి ఆదాయముంటుంది గాని అంతకంత వ్యయమే • చాలమంది ఆశించిన వస్తువులనో, వాహనాన్నినో కొనుగోలు చేయగలరు స్త్రీలకు. అవసర వస్తువులు కొనుగోలు చేయగలరు. ఉద్యోగరీత్యా ఉత్సాహజనకమైన వారం.

★ **మిథునం** : నూతన వ్యక్తులను కలసికోగలరు. ధనాదాయం, వ్యాపారాన చక్కని అవకాశాలు లభ్యం కాగలవు. స్తోత్ర పాఠకులను దాపునకు రానీయకండి అప్రయత్నాదాయం కొందరకున్నది గ్రహించాలి స్త్రీలకు శుభవార్తా శ్రవణం, కొందరకు యిల్లు మారవలసిన పరిస్థితులుంటాయి.

★ **కర్కాటకం** : ఆదాయమున్నది కళా సాహితీ రంగాలలో సదవకాశాలు లభ్యం కాగలవు, నాట్య నాటకాదులందు అనుభవం గలవారికి చక్కని అవకాశాలు ప్రయాణం చేయదలచిన వారు జాగరూకత వహించటం ముఖ్యంగా శ్రేయం ఈ వారం స్త్రీలకు. నూత్న వస్తు, వస్త్ర సేకరణకు అవకాశం గల వారం

★ **సింహం** : నూతన వస్తువులు వ్యాపార సంబంధంగా సేకరించుటలో నిమగ్నులవుతారు. చాలమందికి ఆరోగ్యరీత్యా మేలైన వారం. సంగీతకోవిదులకు, కథకులకు, పత్రికాధిపతులకు అనుకూల వారం స్త్రీలకు ఆర్థికంగా, వృత్తిరీత్యా, కుటుంబరీత్యా మేలైన వారం, గ్రహించాలి.

★ **కన్య** : ఆదాయమున్నది చాల మందికివ్యాపారాన మేలున్నది. ప్రయాణం చెయవలసిన అగత్యం చాలమందికున్నది క్రయ విక్రయాన లాభదాయకవారం గాయక వర్గానికి, నాటక, చలనచిత్రరంగాన అనుభవం గలవారికి సదవకాశాలుంటాయి స్త్రీలకు. యత్న కార్యసిద్ధి ధనవంతుల వలన మేలు, ఉత్సాహతను గమనించగలుగుతారు.

★ **తుల** : గ్రహగతిలో చాల మార్పులు వచ్చాయి గమనించండి రాజకీయంగా పరిభ్రమించేవారు, చాల జాగరూకత వహించాలి ప్రయాణాలలో కూడా జాగ్రత్తపడాలి. స్త్రీలకు. ఉద్యోగరీత్యా చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి

★ **వృశ్చికం** : ఆదాయం గలవారం గత కొంత కాలానికన్నా చాల మేలుగా ఉన్నదని గ్రహింపగలుగుతారు ఎవరో ఏదో చేస్తారని తాత్సారంగా ఉండరాదు. మీ పనులు మీరే చేసికోవాలి పరుల నమ్మి మోసపోవడం తగదు స్త్రీలకు వైజ్ఞానికంగా, లలితకళా ప్రయత్నానా మేలు చేకూరుతుంది

★ **ధనుస్సు** : మీ రహస్యాలు, వ్యాపారమందు మెళుకువలు లాభా లాభాల వివరాలు, కనుగొనాలని యత్నించేవారున్నారు వారిని మీరెరుగుదురు. ఎంత గంభీరంగా ఉంటే అంతమేలు వస్తు సేకరణయందు జాప్యం తగదు స్త్రీలకు ధనవంతుల వలననో, అధికారుల వలననో మీరు ఆశించిన ఉపకారమందుతుంది

★ **మకరం** : కళాసాహితీ రంగాన చాలమందికి , సదవకాశాలు లభ్యంకాగలవు. వృత్తియందు కొంత పెంపు చేకూరు అవకాశం గలదు.' లేనిపోని వ్యవహారాలకు పోయి, పోరాటంలో పడి, అధిక వ్యయానికి గురి అయి ఆవేదనపడకండి స్త్రీలకు కుటుంబంలో యిబ్బందులు రావచ్చు చికాకులుండవచ్చు

★ **కుంభం** : పోగొట్టుకున్న డబ్బును గూర్చిగాని వస్తువుల గూర్చి గాని ఆవేదనపడి ప్రయోజనంలేదు ప్రయాణ మూలకంగా అనేక విషయాలు తెలిసికొనగలరు రావలసిన పైకం అందే అవకాశాలు గురు, శుక్రవారాలందు చెప్పవచ్చు స్త్రీలకు ఒకానొక విషయంలో ఆలస్యమవుతుంది నిరుత్సాహతకు దారితీయవచ్చు, గ్రహించాలి

★ **మీనం** : ఎంతో కాలంగా దగ్గరకురాని ఒకరిద్దరు మిత్రులు 'బుధ' గురువారాలందు చేరనున్నారు విజృంభించి అప్పులు వసూలుచేసికొనుటకు యత్నించండి అభీష్టం నెరవేరుతుంది వ్యాపారాన ఆశించినంత ప్రయోజనం, ఈ వారం కనిపించదు స్త్రీలకు: శుక్ర, శనివారాలు లాభదాయకాలు. ఉద్యోగమందు స్వల్పాదాయం, పెంపు, గమనించాలి

–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

కొత్తగా మెరుగుపరచబడిన

# జాస్మిన్

పూలపరిమళాలతో ప్రతిసారీ స్నానం...




ఇప్పుడు మీరు మెచ్చిన టాయిలెట్
సోప్ మునుపెన్నడూ లేనంత
మెరుగయింది—మీ మనసుకు
మరింత దగ్గరయే ఘుమఘుమలతో.

జాస్మిన్–హాయిగా, ఉద్యానవన
విహారం చేసిన తాజా అనుభూతికి,
స్నానం చేసాక చాలా సేపటిదాకా
మీ శరీరమంతా మిలమిలలాడేందుకు.




## జాస్మిన్

లగ్జరీ సోప్

బోంబే సోప్ ఫ్యాక్టరీ బొంబాయి 400 008.

1904 నాటి నుంచీ నాణ్యమైన సబ్బులను తయారుచేస్తున్నవారు.

Sai-J-1 Tel

సీరియల్

# కాంచన సౌధం

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

డల్గా ఉంటున్న కూతురు హటాత్తుగా ఉత్సాహంగా కనిపించేసరికి ఆశ్చర్యపోయాడు చౌదరి.

మమత . కూనిరాగం తీస్తూ నీట్గా డ్రెస్ చేసుకుని హాల్లోకొచ్చింది.

"ఎక్కడికైనా వెళ్తున్నావామ్మా?" ఆమెలోని మార్పుకి మనసులో సంతోషపడుతూనే .. చిన్నగా నవ్వుతూ అడిగాడు చౌదరి.

"అవున్నాన్నా! .. హాస్పిటల్కెళ్తున్నాను!" అంది మమత కూడా నవ్వి.

"హాస్పిటల్కా?"

"అవున్నాన్నా! ... ఇప్పుడే వచ్చేస్తాను!" అంటూ వెళ్తున్న కూతుర్ని అయోమయంగా చూస్తుండిపోయాడు చౌదరి.

మమత హాస్పిటల్కెళ్ళేసరికి కల్పన ఎవరికో ప్రిస్క్రిప్షన్ రాసిస్తోంది.

మమతని చూడగానే బిత్తరపోయింది. వెంటనే తేరుకొని -

"ఓ! మీరా! రండి!" అంటూ కంగారుగా ఆహ్వానించింది

మమతకీ, విశ్వానికి మాటల్లేవనీ ... మమత అతనంటే మండిపడుతోందనీ ఆమెకి తెలుసు! ... ఆమె కోపమూ ఆవిడకి తెలుసు.

"ఇప్పుడీవిడెందుకు వచ్చినట్టు? .. నాలుగూ తిట్టి పోతుందా? ..." అన్న కంగారు కల్పన మొహంలో స్పష్టంగా కనిపిస్తోంది

మమత మౌనంగా లోపలికొచ్చింది.

ఆమె మొహంలోని ప్రసన్నతకి కాస్త ధైర్యం వచ్చింది కల్పనకి -

"కూర్చోండి! ఏమిటిలా వచ్చారు? .. బావగారు లేరుగా?" నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది.

'నేను బావకోసం కాదు వచ్చింది! ... మీ కోసమే!" నవ్వుతూనే అంది మమత

మరింత కంగారుపడిపోయింది కల్పన.

"చెప్పండి!" అంది లోగొంతుతో.

"మరేంలేదు కల్పనా! . . మొన్నా మధ్య నా బర్త్డే అయింది ఆ రోజుకి ఓ చైన్ చేయించుకుందామని సరదాపడ్డాను ... మీ దగ్గర చాలా రకాలున్నాయి కదా! .. అందులో తనకి నచ్చిన మాడల్ ఒకటి తెమ్మని చెప్పాను! .

ఎక్కడా . అయనకంత తీరుబడేది .. హాస్పిటలూ, పేషెంట్సూ తప్ప ఇంకేం అక్కర్లేదు! "గోముగా విసుక్కుంది! ... మమత

> **జరిగిన కథ—7 :** మమత, విశ్వంలకు ఒకరంటే ఒకరికి ఆరాధన. రాయుడి కూతురు డా. కల్పన కొన్ని రోజులు విశ్వం దగ్గర అసిస్టెంట్గా పని చేస్తానని అడిగితే విశ్వం ఒప్పుకుంటాడు. మమత తన పుట్టిన రోజునాడు సరదాగా పట్నం వెళ్ళి రావాలని ప్లాను వేస్తుంది. విశ్వం అందుకు ఒప్పుకుంటాడు కానీ హాస్పటల్లో కల్పనతో మాటల్లో పడి ఆ మాట మరిచిపోతాడు. మమతకి బావపై కోపం వస్తుంది. విశ్వం, కల్పన ప్రేమించుకున్నారని, పెళ్ళి కూడా చేసుకోవాలనుకుంటున్నారని దాసు మమతతో చెపుతాడు ఆమె అతని మాటలు నమ్మింది.

"అమ్మయ్య! వీళ్ళు రాజీ పడ్డట్టున్నారు!" తేలిగ్గా ఊపిరి తీసుకుంది కల్పన. చిన్నగా నవ్వుతూ -

"మర్చిపోయుంటారు! ... పోనీ ... మీరడగవచ్చుగా?" అంది.

"సరేలెండి!. అయనగారడుగుతానన్నాక ఇంక నేనడిగితే ఏం బావుంటుంది? ..."పెదవి విరుస్తూ అంది మమత

"అయితే ... ఇప్పుడు చేయించుకుంటారా?"

"అనే! ... ఇలా వచ్చాను!"

"అలాగే! . . ఏ మాడల్ కావాలి? ... రాళ్ళవా ... ముత్యాలవా? .. లేక సాదావా?" ఉత్సాహంగా అడిగింది కల్పన.

"సాదావే" నవ్వింది మమత.

"అలాగే. మీరు మా ఇంటికొస్తారా? లేకపోతే నేను తేనా?"

"మీకంత శ్రమ వద్దు! .. ప్రస్తుతం ఈ చైన్ ఇవ్వండి? . చాలు!" ఆమె మెడలోని గొలుసు చూపిస్తూ అంది మమత.

తృళ్ళిపడింది కల్పన.

"ఇది ... ఇది మామూలు చైన్! . ఇందులో స్పెషలేం లేదు!" అంది తడబడుతూ.

"నాకు తెలుసు! ... కానీ ... నాకిలాంటి వంటేనే చాలా ఇష్టం! ఇదివ్వండి! ... కంసాలికి చూపించి ఇచ్చేస్తాను!"

"అబ్బే! ఇది ... చాలా ఓల్డ్ మాడల్! ..."

"ఫరవాలేదు కల్పనా! ... తామరపువ్వులా వున్న ఈ లాకెట్ ఎంతో నచ్చింది నాకు! ..." లాకెట్నే చూస్తూ అంది మమత

"సరే! అలాగే! ... సాయంత్రం వీరడికిచ్చి పంపుతాను!" నసిగింది కల్పన.

ఆమె కంగారుకి మనస్సులోనే నవ్వుకుంది మమత.

"ఫరవాలేదు! ఈ మాత్రం వస్తువు నేను మోసుకు వెళ్ళగలను!' అంది నవ్వుతూ

"అది కాదు మమతా! ..."

"ఏం? ... నా మీద నమ్మకం లేదా?" తీక్షణంగా అంది మమత

"ఛ! ఛ! . అది కాదు! ." మరింత కంగారు పడిపోయింది కల్పన

"మరి?"

"నాకు బోసి మెడతో వుంటే ... అదోలా వుంటుంది మీకెందుకు .. ఇంటికెళ్ళిన వెంటనే పంపకపోతే అడగండి!" చెమటలు తుడుచుకుంటూ అంది కల్పన.

"ఓస్! అంతేకదా!. దాందే వుంది! . అంతదాకా నా మెళ్ళోని గొలుసు వేసుకోండి!" అంటూ గభాల్న తన మెడలోని గొలుసు తీసి ఆమె మెడలో వేసింది మమత

కల్పన బిక్కచచ్చి పోయింది. .

"ఇంకేం అభ్యంతరం లేదుగా?" అంది మమత

"ఉఁహూ!" తప్పనిసరిగా మెళ్ళోని గొలుసు తీసిచ్చింది కల్పన.

ఆమె చేతులు సన్నగా ఒణుకుతున్నాయి. చటుక్కున లేచింది మమత

"థాంక్యూ! . . పని కాగానే తెచ్చిస్తాను!" మమత వంకరగా నవ్వేసి దర్పంగా

అడుగులేసుకుంటూ వెళ్ళిపోయింది!

నిర్ఘాంతపోయి అలా చూస్తుండిపోయింది కల్పన!

★ ★ ★ ★

మూడు రోజుల తర్వాత వచ్చాడు విశ్వం

"బావా!" అంటూ ఎదురొచ్చింది మమత

తెల్లపోయాడు విశ్వం

"ఏవిఁటలా చూస్తున్నావ్?' నవ్వుతూ అంది మమత.

"కోపం పోయినట్లేనా?" తేరుకుని తనూ నవ్వుతూ అన్నాడు విశ్వం.

'ఆ! మళ్ళీ నవ్వింది మమత

హమ్మయ్య! .. బతికాను!"

'సరే! .. స్నానం అదీ కానిచ్చిరా!.. కాఫీ తాగుదాం!" అంది మమత.

విశ్వం మనసులో ఆశ్చర్యపోతూనే స్నానపానాదులు కానిచ్చి హాల్లోకొచ్చి మమత కెదురుగా కూర్చున్నాడు

చౌదరికి కూడా వింతగా వుంది కూతురి ప్రవర్తన

కాఫీలు తాగాక-

'బావా! . ఇవాళ హాస్పిటల్‌కెళ్ళొద్దు!" మెల్లగా అంది మమత.



# కాంచనసౌధం

"ఏం? ఎందుకని?"

"పనుంది! ."

"సినిమా ప్రోగ్రాం వేశావా!. నేను రెడీ!" ఉత్సాహంగా అన్నాడు విశ్వం.

"ఊఁహుఁ!" నవ్వింది మమత.

"మరి? . ."

"ముఖ్యమైన విషయం ,మాట్లాడాలి! ...." "ముఖ్యమైన" అన్న చోట వత్తి పలుకుతూ అంది మమత

"ముఖ్యమైన విషయమా?" అయోమయంగా చూశాడు విశ్వం.

"అఁ! ...అందుకే . . కల్పనగార్ని కూడా రమ్మన్నాను ... మరో పది నిమిషాల్లో రావచ్చు!" తాపీగా అంది.

"కల్పనా?!" కళ్ళు చిట్లించాడతను.

"అఁ! ... డాక్టర్ కల్పన! ..."

చివ్వున తలెత్తి ఓసారి అమె కళ్ళల్లోకి చూశాడు. ఆ కళ్ళల్లో తుఫాన్ ముందు ప్రశాంతత కనిపించిందతనికి.

"ఎందుకు కల్పనని రమ్మంది? ఇద్దర్ని కలిపి .. దులుపుతుందా? అనికూడా అనిపించింది

పావుగంట తరవాత తడబడుతున్న అడుగులతో వచ్చింది కల్పన.

చాలా రోజుల తర్వాత ఆ ఇంట అడుగుపెట్టిందామె.

"రండి! రండి!" ఆప్యాయంగా ఆహ్వానించింది మమత. గిల్టీగా లోనికొచ్చి కూర్చుంది కల్పన

ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది.

ధైర్యంగా ఎవరికేసి చూడలేనట్టు తలవంచుకుని నేలచూపులు చూస్తూ కూర్చుంది.

చౌదరి ఓ ప్రేక్షకుడిలా చూస్తుండి పోయాడు. ఆయనకి మరి అయోమయంగా ఉందిదంతా.

కిష్టయ్య అందరికీ కాఫీలందించాడు. అంతా మౌనంగా తాగారు.

మరో అయిదు నిమిషాలు మౌనంగా దొర్లి పోయాయి.

"బావా!" హటాత్తుగా అంది మమత.

"ఊఁ!" ఏదో ఆలోచిస్తున్న విశ్వం తృళ్ళిపడి చూశాడు.

"ఎందుకు బావా. మాటి మాటికి అలా తృళ్ళిపడతావ్? . ఏదో తప్పు చేసినవాళ్ళే అలా తృళ్ళిపడతారు!" నవ్వింది మమత.

విశ్వం మాట్లాడలేదు.

కల్పన తల మరీ వంగిపోయింది.

'బావా! ఇది . నీ గదిలో పుస్తకంలో ఉంది! ." గంభీరంగా అంది మమత.

ఆమె చేతిలోని కవర్ని చూస్తూ

"ఏమిటి?" అన్నాడు విశ్వం

"కలర్ ఫోటో ! ... బావుంది కదూ?" కవర్లోంచి కల్పన ఫోటో అతనికందిస్తూ అంది.

అతను చూశాడా ఫోటోని

వెంటనే మరింత పాలిపోయిందతని మొహం.

"సారి బావా! నేను చూడాలని చూడలేదు. తొచక నీ గదిలో కెళ్ళి పుస్తకం తిరగేస్తుంటే "

'కానీ . అది అదెలా వచ్చిందో నాకు తెలియదు!" తడబడుతూ అన్నాడు విశ్వం

"నీకు తెలియదా?" నుదురు చిట్లించింది మమత.

"నిజంగానే నాకు తెలియదు! మమతా!"

"ఏం? ఆ పుస్తకం నీది కాదా?"

చెప్పు బావా! ఆ పుస్తకం నీది కాదా?"

"నాదే . కానీ ..."

"పోనీ .. కల్పనగారికెప్పుడైనా చదవడానికిచ్చావా? ."

"ఉఁహూఁ!"

"మరి నీ పుస్తకంలోకి కల్పనగారి ఫోటో ఎలా వచ్చిందంటావ్?

"అదే . . అర్థం కావటంలేదు."

"బావా! . ." గంభీరంగా అంది మమత.

తలెత్తి చూశాడతను

"బావా! ... నీ పుస్తకంలో ఆవిడ ఫోటో వుండడం పెద్ద నేరమేంలేదు! ఎవరికిష్టమైన వారి ఫోటోలు వాళ్ళు దాచుకోవడం తప్పుకాదు కానీ . . ఇది నీకు తెలియదని బుకాయించడం మాత్రం! ఛ! ఛ! చాలా అసహ్యంగా ఉంది!"

అదికాదు మమతా! . ఇది .. ఇది "

"ఇదిగో బావా! . ఎందుకంత ఇదైపోతావ్? ఇందులో నువ్వు చేసిన తప్పు మాత్రం ఏం వుంది! ఒకే ప్రొఫెషన్లో వున్నవాళ్ళు, ఒకళ్ళంటే ఒకళ్ళు ఇష్టపడుతున్నారు . ఫోటో దాచుకోవడంలో కూడని పనేం వుంది? .

అఫ్‌కోర్స్! మి మనసులు తెలుసుకోకుండా నేను ఆశలు పెంచుకున్నాననుకో! . . అది నీ తప్పుకాదు! అందుకే . ఈ విషయం చెప్పడానికే మి ఇద్దర్ని పిల్చాను! ... వెంటనే మీరిద్దరూ పెళ్ళిచేసుకోండి!" దుఃఖం తన్నుకొస్తుంటే, అతి ప్రయత్నం మీద ఆపుకుంటూ అంది మమత.

"మమతా! ఒక్క మాట వింటావా?" గట్టిగా అన్నాడు విశ్వం

"ఏవిఁటి?"

"నిజంగా నాకేం తెలియదు! ... అసలు కల్పనగార్ని నేనాడూ ఆ దృష్టితో చూడలేదు! ఆవిడకూడా ."

"షటప్!" ఆవేశంగా అరిచింది మమత.

ఆమెని చూసి అంతా నిశ్చేష్టులైపోయారు. కొంతసేపు ఎవరికి నోట మాటరాలేదు.

"నిజం! మమతా! ... ఆ ఫోటో సంగతి నాకు తెలియనే తెలియదు! ధైర్యాన్ని కూడదీసుకుంటూ అన్నాడు విశ్వం

మమతలో అంత ఆవేశం ఏనాడూ చూడలేదతను

"తెలియదూ? ... ఛ! ఛ! ... ఇన్నాళ్ళూ నువ్వు నన్నే మోసం చేశావనుకున్నాను ... కానీ ... కల్పనగార్ని కూడా ఘోరంగా మోసం చేస్తున్నావని ఇప్పుడు తెలుసుకున్నాను.

కాదు! నువ్వందర్ని మోసం చేశావ్! నీ బతుకే మోసాల పుట్ట! గెటవుట్! ... గెటవుట్ అయ్ సే!" ... పూనకం వచ్చినదానిలా ఊగి పోయింది మమత



# మొదలెట్టండి యివాళే - 6 వారాల్లో చూడండిక -

## వంటిఛాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్•టోన్

## మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**




కోమలమైన చర్మం కేవలం మూడు రోజుల్లో!

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి...
అబ్బ ఎంత హాయి!

**3వ వారం**



చూసావా, మోచేతులు నిగనిగలాడుతున్నాయి
అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి ఛాయవచ్చి మెరుస్తోంది."
అంది ఓ మిత్రురాలు.

**5వ వారం**



ఎండలో కెళ్ళినా, వాడనిక చర్మం.

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్•టోన్ బృందంలో!

క్లియర్•టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ, మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన ఛాయతో రూపొందిస్తుంది. సున్నితంగా. అంతేకాదు. క్లియర్•టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం, అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది. దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ ఛాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ, మృదుత్వాన్నీ యిస్తుంది.
ఇదంతా కేవలం 6 వారాల్లో!

చక్కని ఆ ఫలితాలు అలాగే వుండటానికోసం క్లియర్•టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి, యింట్లోనూ, ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను.







# క్లియర్•టోన్ మెరుగైన వంటిఛాయలోని రహస్యం— సహజమైన రీతిలో

లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha/NICL/76/85-TL-R

సిగ్గుపడ్డారు.

"లోపలికి రావచ్చా డాక్టరుగారూ!" అన్న రాయుడి మాటలకి తృళ్ళిపడి -

"రండి, రండి!" అంటూ ఆహ్వానించాడు

ఆయన కూర్చుని -

"జరిగిందంతా విన్నానోయ్! ..." అన్నాడు ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండానే.

'సారీ! ....' మెల్లగా అన్నాడు విశ్వం.

"సారీనా! ఎందుకు?" పెళ్ళున నవ్వాడాయన.

ఆయన నవ్వుకు కాస్త తికమకపడ్డాడు విశ్వం.

"జరిగిందేదో జరిగిపోయింది! .. జరిగిందాన్ని గురించి బాధపడుతూ కూర్చునేకన్నా జరగవలసిందాలోచిస్తే మంచిది!" గంభీరంగా అన్నాడు రాయుడే మళ్ళీ

"మమత క్కాస్త కోపం ఎక్కువ! ..."

"మీ మావయ్య మాత్రం తక్కువ తిన్నాడా? ... పసివాళ్ళ మనసుల్ని అర్థం చేసుకోవద్దూ? ఇష్టంలేని వాడికి కూతుర్నంటగట్టాలని చూడ్డం ఏమిటి?" ఆవేశంగా అన్నాడు రాయుడు.

బిత్తరపోయాడు విశ్వం

"అవునయ్యా! ... ఒకరి ఫొటో లు ఒకరి దగ్గరుంటే ... తప్పేమిటి? ... అఁహ! తప్పేవిఁటి అని! .."

"నిజంగా . నాకు ఆ ఫొటో గురించి తెలియదండీ!" కంగారుగా అన్నాడు విశ్వం

"పోన్లేవయ్యా! . తెలుసో, తెలియదో తరవాత్సంగతి! అసలలా కూనీ చేసినట్టు నిలదియ్యడమేమిటి? ... ఆఁ? . "

"పోన్లెండి! ... నా రోజులు బాగాలేవు!" నిర్లిప్తంగా అన్నాడు విశ్వం

'కాదయ్యా! నీ రోజులు బాగున్నాయ్! అందుకే ఇలా జరిగింది!. అవును ... బిల్డింగ్ ఎప్పుడు పూర్తవుతుంది? ... అప్పటిదాకా మీ మావఁ . గొడవేం పెట్టడు గదా? ." గలగలా అన్నాడు.

"దేన్ని గురించండి?"

"అదే. ఈ హాస్పిటల్ ఉన్న కొంప ఆయన్దేగా? ఏవఁన్నా అంటే చెప్పు! మనకి ఇలాంటివి బొచ్చుడిళ్ళున్నాయి! " దర్పంగా అన్నాడు రాయుడు.

"ఛ! ఛ! అలాంటిదేంలేదండీ!"

"సరే అయితే! . భోంచేశావా?"

'ఊఁ? ఊ! ... చేశాను!"

'అబద్ధం! .. అయినా నిన్ను అసహ్యించుకునే కొంపలో అన్నం మాత్రం ఎలా సహిస్తుందయ్యా?

మనింటికొచ్చెయ్యి! ... సరదాగా భోంచెయ్యచ్చు!"

"అబ్బే వద్దండీ! ..." కంగారుగా అన్నాడు విశ్వం.

"ఫరవాలేదయ్యా! ... నీకంత మొహమాటంగా వుంటే ... కేరియర్ పంపుతాను . కాదనకు!... ఆ! ఏం కావాలన్నా నన్నడగడానికి మొహమాటపడకు!" అంటూ లేచాడు రాయుడు.

అన్నట్టే ఆ రాత్రి కేరియర్ పంపాడు

ఎంత వారిస్తున్నా వినకుండా పెట్టిపోయాడు పనివాడు.

"మా ఇంటి భోజనం తిన్నంత మాత్రాన ... మీ పాతివ్రత్యానికేం లోటురాదు తినండి! ... కనీసం మీ వాళ్ళు మామూలు స్థితికొచ్చే వరకైనా!" అంది కల్పన గంభీరంగా.

తినక తప్పలేదు విశ్వానికి.

అయితే మునపట్లా కల్పనా, విశ్వం మనసులు విప్పి హాయిగా మాట్లాడుకోలేక పోతున్నారు. ఎవరికివారే ఏదో తప్పుచేసినట్టు తప్పుకు తిరుగుతున్నారు

*   *   *   *   *

విశ్వం రాయుడిగారింటి భోజనం చేస్తున్నాడని విన్న చౌదరి కోపంతో ఉడికిపోయాడు.

"నాన్నా! ... మన మనిషి కానప్పుడు అతన్ని గురించి ఎందుకు నాన్నా అంతగా ఆలోచిస్తావ్?" అంది మమత.

"మమతా!" ఆశ్చర్యంగా చూశాడాయన. ఈ విషయం తనకన్నా కూతుర్నే ఎక్కువ బాధిస్తుందనుకున్నాడాయన అయితే ఆమె కళ్ళలోని సుడిగుండాలు ఆయన గమనించలేదు

ఓసారి మంగి, వీరడు విశ్వాన్ని గురించి మమతతో చెప్పాలని వచ్చారు అయితే వాళ్ళని అల్లంత దూరాన్నించే పంపేసింది మమత

మమత చౌదరిగార్ల ప్రవర్తన వాళ్ళకి నచ్చలేదు వాళ్ళకే కాదు గూడెం వాళ్ళెవరికీ నచ్చలేదు. అందరూ విశ్వానికే సానుభూతి చూపించారు.

రాయుడు మాత్రం చాలా హుషారుగా ఉన్నాడు విశ్వంవల్ల తను గెలవడానికి అవకాశం ఉందని అతని రాజకీయ బుర్ర హెచ్చరించింది. అందుకే ఇప్పుడు విశ్వం ఆయన దృష్టిలో ఆప్తుడు!

కానీ ... విశ్వం మమత దృష్టిలో దుర్మార్గుడు.

అతను ఎప్పుడయితే తమ ఇల్లు కూడా వదిలి రాయుడిగారింట్లో మకాం పెట్టాడో . అప్పట్నుంచి అతను ఆమెకి బద్ధ శత్రువు!

ఇప్పుడు పగబట్టిన తాచు మమత!

బైటికెళ్ళడం పూర్తిగా మానేసింది అతని మీద ఎలా దెబ్బతియ్యాలన్నదే ఆమె ఆలోచన ఇరవైనాలుగ్గంటలూ ఇదే ఆలోచన!

ప్రస్తుతం ఆమెకి అంతరంగికుడు దాసు!

ఎలక్షన్స్ దగ్గరకొచ్చాయి.

అయితే జనంలో చాలా మార్పులొచ్చాయి

విశ్వం ప్రమేయం లేకుండానే ... అతన్నాదరించే రాయుడికోసి మళ్ళారంతా

హటాత్తుగా రాయుడి వరికుప్పలు తగలబడ్డాయి! మామిఁడి తోపు ధ్వంసం అయింది

మండిపడ్డారు జనం! .. చౌదరి మీద మరింత కోపాన్ని పెంచుకున్నారు

వాటిక్కారణం చౌదరే అని వారి నమ్మకం!

తగూలు! కొట్లాటలు! దొమ్మీలు! సాధారణంగా పల్లెటూరి ఎలక్షన్స్‌లో ఉండేవన్నీ జరిగాయి.

ఎలక్షన్లూ అయ్యాయి.

లెక్కింపూ అయింది

ఈసారి రాయుడు నెగ్గాడు.

చౌదరి ఓడాడు!

"అన్యాయంగా రాయుడిగారి కుప్పలు తగలెట్టించాడు! . ఆ పాపం ఎక్కడికి పోద్ది! .. బగమంతుడు నేడూ?" అనుకున్నారు గూడెపు జనం

కానీ రాయుడే, తన కుప్పలకి తానే నిప్పు పెట్టించుకునీ, తన తోటని తానే ధ్వంసం చేయించుకునీ . . మరింత సానుభూతి సంపాదించుకున్నాడని పాపం! . ఆ పల్లె అమాయక ప్రజకి తెలియదు

ఉత్సాహంగా రాయుడికి జేజేలు కొట్టారు. రాయుడు మామూలుగానే అందరికీ తాగబోయించాడు

*   *   *   *   *

నిద్ర రాని మమత మంచం మీదే అటూ ఇటూ పొర్లుతోంది తండ్రి ఓటమి ఆమెకి ఎదురు చూడని దెబ్బ! జీవం లేనట్టున్న ఆయన మొహం చూస్తున్నకొద్దీ విశ్వం మీదా, కల్పన మీదా, ఆ రాయుడి మీదా కోపం వచ్చింది

తండ్రినెన్నో విధాల ఓదార్చింది.

ఆలోచనలో పడ్డ మమత తృళ్ళిపడింది

తండ్రి గదిలో సన్నగా లైట్ వెలిగింది

ఆయన పడుకున్నప్పుడు బెడ్‌లైట్ కూడా వేసుకోడు! పాపం! నిద్ర రావటంలేదు! అనుకున్నమమత మెల్లగా లేచి తండ్రి గదికేసి నడిచింది కాస్త మాటలు చెప్పి మరిపించాలని

మెల్లగా తలుపు తీసి అక్కడి దృశ్యం చూసి కొయ్యబారిపోయింది

నాన్నా అంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరిచింది

గదిలో వురి వేసుకోడానికి సిద్ధంగా ఉన్న చౌదరి కూతుర్ని చూసి తుళ్ళిపడ్డాడు అంతవరకు తొక్కిపెట్టిన దుఃఖం ఒక్కసారిగా ముంచుకొచ్చింది చటుక్కున తాడు మెళ్ళో తగిలించుకోబోయాడు

గబాల్న వచ్చి లాగేసింది మమత

నాన్నా! ఇదేవ(న్నా బావుందా? వెదవ పదవి కోసం నాకన్యాయం చేస్తారా? ఆయన్ని చుట్టేసి ఏడుస్తూ అంది

ఇంత అవమానం జరిగాక ఎలా బతకమంటావమ్మా! పసివాడిలా కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు చౌదరి

ఇందులో అవమానం ఏం వుంది నాన్నా! మనం దొంగతనం చేశామా దోపిడీలు చేశామా? ఎలక్షన్‌లో ఓడిపోయాం! అంతేగా?

నీకు మాత్రం తెలియదా నాన్నా! ఈ రాజకీయాలే ఇంత! మొన్నటి వరకూ నీ వైపు తిరిగిన జనం ఆ విశ్వం మూలాన గొర్రెల మందలా ఒక్కసారిగా ఆ రాయుడికేసి తిరిగారు!

పోనీ నాన్నా! ఈ వెదవ రాజకీయాలు ఒదిలెయ్! అంటూ ఆయన్ని తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టింది

చౌదరిగారిలో కాస్త మార్పొచ్చింది

"నాన్నా!" ఆయన పక్కనే కూర్చుంటూ అంది మమత.

"ఏమ్మా?"

"మీరు నాకో మాటివ్వాలి!"

ఇంకెప్పుడూ ఇలాంటి ప్రయత్నం చెయ్యద్దని! అంతేగా? పేలవంగా అన్నాడు

అవును! అమ్మ ఎలాగూ లేదు! మీరు కూడా నన్ను వంటరిదాన్ని చేసి వెళ్ళిపోతే ఎలా నాన్నా! పదవి మళ్ళి రావచ్చు! పోయిన ప్రాణం తిరిగొస్తుందా? అనునయంగా అంది

ఏమిటో నమ్మా! మనసంతా శూన్యంగా అయిపోయింది అవమానంగా తోచింది నా ఓటమి!

నాన్నా ఆ మాటకొస్తే మీకన్నా నేనే ముందు ఆత్మహత్య చేసుకోవాలి! గంభీరంగా అంది మమత

మమతా! దెబ్బతిన్నట్టు చూశాడు చౌదరి

అవున్నాన్నా! మీ మనసే శూన్యంగా వుంది కానీ నా జీవితమే శూన్యం అయిపోయింది! మీకు పదవి మరోసారి రావచ్చు! కానీ దుఃఖంతో గొంతు వణికిందామెకి

నిజమే తల్లీ! కూతుర్ని అక్కున చేర్చుకున్నాడు చౌదరి

ఇద్దరూ అలా కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయారు

నాన్నా!

చెప్పు తల్లీ!

ఇంకెప్పుడూ ఇలాంటి ప్రయత్నం

చెయ్యను! నా తల్లిమీద ప్రమాణం చేసి చెప్తున్నాను! మమత తలమీద చెయ్యిపెట్టి స్థిరంగా అన్నాడు

థాంక్స్! నాన్నా! థాంక్స్! ఆ చేతిని రెండు చేతులతో పట్టుకుని అంది మమత

ఇద్దరి కళ్ళూ నీళ్ళతో నిండిపోయాయి.

చౌదరి మనసిప్పుడెందుకో ప్రశాంతంగా ఉంది. అయితే మమత మనసు మాత్రం తుఫానులో సముద్రుడిలా ఉంది. విశ్వం మీద పగ రెట్టింపయింది.

(ఇంకా ఉంది)

### కె. వి. బి. - మల్లవరం

★ అక్కా మగవారెప్పుడూ ఆడవారిని శల్యపరీక్ష చేస్తున్నట్టు చూస్తూ వుంటారెందుకు?

● తాము దేనికోసం చూస్తున్నారో - తెలియక అలా చూస్తారంతే. అయినా వాళ్లలా చూస్తారని - నీకెలా తెలిసింది చిట్టితల్లీ?!

### కె. ఎన్. పి. - వరంగల్

★ మిమ్మల్ని మీరు మేధావులని ఊహించుకొంటారు కదా?

● పొరపాటు నేనెప్పుడూ మేధావినని చెప్పలేదు ఊహించుకోనూ లేదు.

★ హిందూమతం యింకా బ్రతికే వుందా వంటి వ్యాఖ్యలు మీ అల్ప బుద్ధినీ, సంకుచిత మనస్తత్వాన్నీ, కూపస్థ మండూక తత్వాన్ని తెలియ చేస్తున్నాయి. ఈ విమర్శకి మీ దగ్గర జవాబుందా?

● ఉంది. కాని మీకిచ్చి నన్ను నేను తగ్గించుకోదలచలేదు!!

### కె. ఆర్. - బళ్లారి

★ తాళి కట్టిన వాడే దాన్ని బంగారం కోసం అమ్మితే?

● దాని విలువ అంతే అవుతుంది!

★ భార్యాభర్తలు విడాకులిచ్చుకొంటే ఎవరికి లాభం?

● భర్తకే. మళ్లీ పెళ్లి. మళ్లీ కట్నం మళ్లీ హనిమూన్ ప్రారంభం అవుతుంది ఆడదానికి ఒక్క విడుదల మాత్రమే ప్రాప్తిస్తుంది

### కె. ఎన్. ఎన్. - తాడేపల్లిగూడెం

★ మీ నారి దృక్పధం చదివాను బాగుంది దృక్పధాన్ని అర్ధం చేసుకోడానికిదో దర్పణ కాగలదని. అవునా?

● నారీ దృక్పధం అర్ధం చేసుకోవడానికే దారికంటే నారిమణుల ఆలోచనలసరళికి దారిగా నేను వ్రాయడం ప్రారంభించాను. ఈ మధ్య నాగాపడింది




మళ్లీ త్వరలో నే - మొదలుపెట్టాలని వుంది

★ స్త్రీని పురుషుడు అర్ధం చేసుకొనేది ఎప్పుడు?

● అసలు ప్రయత్నమేనా ప్రారంభిస్తే కద!

### కె. వి. ఎస్. - గుంటూరు

★ ఆడదానికి ఆస్తి హక్కు యిస్తే మరింత అహంకారి అవుతుందంటాను

● ఎవరి భయం వారిది! ఆస్తి వున్నవాళ్లు కద యివ్వకల్సేది?! యిస్తామంటేనే యింత బెంగగా వుంది యిక యిస్తే ఏం చేస్తారో - చూడాలి.

### ఎమ్. పి. ఆర్. - మక్కువ

★ స్త్రీ ఆంధ్రదేశానికి శత్రువా? మిత్రువా?

● ఏం ఎన్. టి. ఆర్. స్త్రీ రహిత తెలుగుదేశాన్ని ప్రోత్సహించాలనుకుంటున్నారా?! ఇప్పటికే నామమాత్రంగా వుందామె వునికి అవీ లేకుండా చేస్తే - తెలుస్తుందేమో - ఫ్రెండ్ ఆర్ ఫో అని.

### నాగరాజు - చూదలి

★ తెలుగుదేశం ప్రభుత్వంలోని బాగోగులు మీరు ఎంతవరకు సమర్ధించకలరు?

● ఏ రాయి అయితేనేం పళ్ళూడగొట్టుకుందుకు అన్నమాట నిజపరుస్తూంది - రాష్ట్రప్రభుత్వం.

★ మీ అభిప్రాయంలో కలంస్నేహం మంచికి దారితీస్తుందా? చెడుకా?

● కలంస్నేహం చేయడానికి వ్యక్తిత్వమున్న మనుషులు కావాలి. దొంగ పేర్ల వెనుక కథలు నడిపించేవారు కాదు. కలంస్నేహం ఈ రోజు ఓ దాగుడుమూతలుగా తయారైందని వింటున్నాను .. నేను కలంస్నేహం ప్రోత్సహించను.

### పి. వి. - గుంటూరు

★ నవలకు మంచి పేరు రాకపోయినా బాగా రాసిన తృప్తి గొప్పదా? బాగా రాయకపోయినా నవలకు పేరు రావడం గొప్పదా?

● నాకు యీ పరిస్థితి అర్ధం కాలేదు. రచయిత తాను రాయదల్చుకున్నది రాయడం- మాత్రమే తెలుసు నాకు దాన్ని మెచ్చడం, చెండాడడం- పాఠకుల యిష్టం అంత మాత్రం చేత- పాఠకులు 'కోరి' నట్టు రాయడం నాకు చేత కాదు.

### రాణి - రాజమండ్రి

★ నేను పెళ్లి చేసుకోకూడదని నిర్ణయించుకున్నాను రక్షణలేని సమాజంలో స్త్రీ బ్రతకలేక పోతోంది కదా అందుకని స్త్రీత్వాన్ని ఆపరేషన్ ద్వారా తీయించేసుకుని హాయిగా బ్రతకవచ్చునుకుంటున్నాను.

● ఇలాంటి వంకర ఆలోచనలు ముందు వదలిపెట్టండి. స్త్రీత్వం ఆపరేషనుతో పోయేది కాదు. దురదృష్టవశాత్తూ సెక్సు మార్పు జరిగితేనే- ఎంత కల్లోలం సృష్టిస్తున్నారో గమనించలేదా? అయినా- ఆడదాని జీవితంలో స్త్రీత్వం ఎన్నాళ్ల ముచ్చటని? వయసుడిగిపోగానే పోయే దాని కోసం మీరింత తాపత్రయ పడడంలో అర్ధం లేదు... మరిచిపోండి. పెళ్లి ఒక్కటే రక్షణ కాదు ఆడదానికి. ఇష్టం లేకపోతే పెళ్లి చేసుకోనక్కర లేదు కాని తోడబుట్టిన వాళ్ల పంచన బ్రతకాలని అనుకోకూడదు. మీ కాళ్ల మీద మీరు నిలబడే ప్రయత్నం చేయండి అదే మీకు రక్ష స్త్రీత్వాన్ని అసహ్యంచుకోవడం మానండి ముందు

### డి. జె. ఆర్. - విజయవాడ

★ తరాల అంతరం అంటే?

● 'ఈ తరం అవివేకి వచ్చే తరపు మేధావి! □






కొడుకును తీసుకుని భర్త ఇల్లు విడచి పారిపోయాడు ఆమె హైకోర్టులో హెబియస్ కార్పస్ ఎటిషన్ వేస్తే దానికి జవాబుగా కొడుకు ఎక్కడ ఉన్నది తనకు తెలియదని అబద్ధం చెప్పాడు ఆమె సుప్రీం కోర్టుకు వచ్చింది సుప్రీం కోర్టు వారు పోలీసు ఎంక్వయిరి చేయించితే పిల్లవాడిని ఢిల్లీలో అతని చెల్లెలు దగ్గర దాచినట్లు తేలింది కోర్టులో అసత్యం చెప్పి కోర్టు ఆజ్ఞను ధిక్కరించాడనే ఆరోపణలో కారాగార శిక్ష విధిస్తారని భయపడి భార్య కాళ్ళపైన బడ్డాడు ఆమె ఔదార్యాన్ని ప్రకటించి తన భర్తను రక్షించమని కోర్టును కోరింది ఆమె ఔదార్యాన్ని ఎంతగానో ప్రశంసిస్తూ సుప్రీంకోర్టు ఇకమీద నైనా సత్ప్రవర్తన చూపమని మందలిస్తూ భర్తను క్షమించారు

బిడ్డ సంరక్షణ తండ్రిదా? తల్లిదా? అనే ప్రశ్నపైన కొన్ని కోర్టులు బిడ్డయొక్క క్షేమమే గాని తదితర విషయాలేవీ పరిక్షించరాదని అన్నారు కాని కొన్ని హైకోర్టులు తండ్రికే మైనరు సంరక్షణ ఇస్తున్నారు ఒక కేసులో 16 ఎండ్ల కుర్రవాడు పుట్టినప్పటి నుండే తల్లితో ఉండేవాడు తండ్రి శ్రీమంతుడు తల్లి ఉదరపోషణకై బట్టలు కుట్టుకొనేది కుర్రవాడిని కోర్టువారు అడిగితే తల్లితోనే ఉంటానన్నాడు కాని హైకోర్టు వారు తండ్రికే అతని సంరక్షణ నిచ్చారు

1956 చట్టం హిందువులకే వర్తిస్తుంది ఇతర మతాల వారికి గార్డియన్సు అండ్ వార్డ్సు చట్టం 1890 వర్తిస్తుంది హైదరాబాదులోని ఒక ముస్లిం భార్య, భర్త విడిపోయారు. విడాకులప్పుడు కుర్రవాడిని తల్లికిచ్చారు. ముస్లిం 'లా' ప్రకారం 7 సంవత్సరముల వయస్సు తర్వాత పిల్లవాని సంరక్షణ తండ్రికి వస్తుంది. తండ్రి కుర్రవాని సంరక్షణకు అనర్హుడని నిరూపించినప్పుడె తల్లికిస్తారు.

ఈ కేసులో తల్లి విడాకుల తర్వాత మరొక వివాహం చేసుకుని దేశం వదిలి వెళ్ళింది పిల్లవాడు మాతా మహుల ఇంట్లో ఉండేవాడు వారు శ్రీమంతులు వారు అతని సంరక్షణ భారం వహిస్తామన్నారు కుర్రవాడు కూడ తండ్రి-- సవతితల్లి దగ్గరకు వెళ్ళను సమ్మతించలేదు తల్లి అతనికి అరేబియా నుండి డబ్బు పంపేది అయినప్పటికి హైకోర్టు వారు అతని సంరక్షణ తండ్రికిచ్చారు ఈ తీర్పును చాలామంది వ్యాఖ్యానించారు

సుప్రీంకోర్టు కొన్ని హైకోర్టులు బిడ్డ యోగక్షేమం దృష్ట్యా బిడ్డను తల్లికి యిచ్చినా క్రింద కోర్టులు సెక్షన్ '6 ను అక్షరాల అమలుపరుస్తూ బిడ్డను తండ్రికే ఇస్తారు మర్కట కిశోర న్యాయం, కచ్ఛప కిశోర న్యాయం వలె బిడ్డలు తల్లి సంరక్షణలో




తల్లిప్రేమతో అభివృద్ధికి వచ్చినంతగా తండ్రి సవతి తల్లుల సంరక్షణలో అభివృద్ధికి రారు స్త్రీ పురుషులకు సమాన హక్కులున్నవని పదే పదే నొక్కి వక్కాణించినా కొన్ని చట్టాలలో స్త్రీకే అన్యాయం జరుగుతున్నది అమర భారతి కేసువంటి కేసులలో తల్లి బిడ్డను పెంచి పెద్దవాడిని చేయగల విద్య ఉద్యోగము ఆర్థిక స్తోమత ఉన్నా తండ్రి నిరక్షకుడు అవినీతి పరుడైనా సెక్షను 6 ను అక్షరాల చదివితే తండ్రే బిడ్డ సంరక్షణకు అర్హుడౌతాడు చాలా పరిస్థితులలో తల్లి నుండి విడదీయబడిన బిడ్డ మానసికంగా మిక్కిలి దెబ్బతింటాడు తండ్రి ఐశ్వర్యవంతుడయినా, పరస్త్రీతో కాని, లేక రెండవ భార్యతో కాని కాపురం చేస్తున్నప్పుడు పిల్లల జీవితం దుర్భరమవుతుంది వర్ష కేసు వంటి కేసులో సుప్రీం కోర్టు కాబట్టి మిగిలినవి ఏవి విచారించకుండా బిడ్డను ముందుగా తల్లికిప్పించారు ఈ పరిస్థితిలోని ప్రతిస్త్రీ సుప్రీంకోర్టు హైకోర్టులకు వెళ్ళటం దుర్భరం చట్టంలోనే తగిన విశదీకరణ చేసి కట్టుదిట్టాలను చేయటం చాలా ముఖ్యం

పార్లమెంటు ఈ విషయాన్ని గురించి దీర్ఘంగా పరిశీలించి సెక్షను 6 లో తగిన మార్పులు తీసుకొని రావలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది

—పాలపర్తి భుజంగరావు.

జైసల్ మెర్‌లో తెలుగు సాంస్కృతిక సంఘంవారు "వినాయక చవితి" ఉత్సవాలని నిర్వహించిన సందర్భంగా తీసిన చిత్రం.



దీపావళి కథలపోటీలో రూ. 650/- బహుమతి పొందిన కథ

# సావిత్రి పెళ్ళి ఆగిపోయింది

"అమ్మాయి వచ్చే టైము దాటిపోయి నట్టుంది. ఇంకా రాలేదేమిటి చెప్మా? పొద్దుట వెళ్ళేటపుడు ఏమీ అనలేదు కూడాను."

నెత్తి మీద కొంగు సవరించుకుంటూ సుభద్రమ్మ మూలుగుతూ లేచింది.

అంతలో నే వీధి తలుపు చప్పుడు. "ఆ ( వచ్చే, వచ్చే" అంటూ నేల మీద చేతులు ఆనించుకుని కష్టం మీద నిలబడి "ఏమిటో ? ఈ కాళ్ళు చేతులు ఇంక లాభం లేదు. నా పని అయిపోయింది." అనుకుంటూ, "వస్తున్నాను", అంటూ తలుపు తీసింది.

స్కూల్లో పిల్ల కాబోలు. పరుగెత్తుకుని వచ్చిందేమో, ఆయాసపడుతూ, "మరేమో మా టీచర్లందరూ, ప్రభాకరం మాష్టారు భార్య పోయిందట, అక్కడికి వెళ్ళారు. రావడం ఆలస్యం అవుతుందనిసావిత్రి టీచరు మీతో చెప్పమన్నారు" అని మళ్ళీ పరుగెత్తుకుని పోయింది.

'అదేమిటది? పురుడయి నిక్షేపంలా కొడుకు పుట్టాడన్నారు అంతలో ఏం ముంచుకొచ్చింది? సరిగ్గా విందా ఈ పిల్ల? గట్టిగా అడుగుదామంటే అదే పరుగుపోయింది రోజుల్ల గుడ్డు, ముందు ముగ్గురు ఆడపిల్లలు – ఏం కబురు చెప్పావయ్యా దేవుడా? ఆ పిల్లలు ఎలా పెరిగేను? మగ పిల్లాడో అని కొట్టుకుపోయిందట ఈ పదిరోజుల ఋణమేనా ఉంది పాపం? ఏమయిందో గానీ" అని నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వంటింట్లోకి వెళ్ళి కాసిని నీళ్ళు తాగి, "ఇవాళ ఒకపూట స్కూలు,ఇద్దరం కలిసి తిందామని కూర్చున్నాను ఇంక నేనేం తింటాను? వచ్చాక అది మాత్రం ఏం తింటుంది? ఎన్ని కష్టాలు రాసి పెట్టావు తండ్రీ ఆ పిల్లలకి" అని వీధి గుమ్మంలోకి పోయి కూచుంది.

మూడు అవుతుంటే సావిత్రి వచ్చింది మొహం వేలాడేసుకుని. "అలా చుట్టూ తిరిగి రామ్మా పెరట్లోంచి నీళ్ళ ఇస్తాను తల మించి స్నానం చేసి ఆ బట్టలు తడిపి పడెయ్యి నేనేదో చీర ఇస్తాను గానీ చుట్టబెట్టుకుని రా" అని లోపలికి వెళ్ళింది సావిత్రి పెరటి వైపుకి వెళ్ళింది. అమ్మమ్మ ఏం చెప్పినా కాదనదు ఆవిడే సావిత్రికి ఉన్న ఒక్క ఆత్మీయురాలు, బంధువు

నీళ్ళు అందిస్తూ," ఎలా అయిందే అమ్మాయి ఇంత ఘోరం? పాపం ఆయన ఎలా వున్నారు? పిల్లలు గోల పెడుతున్నారా?' అంటూ అందుకుంది

"ఏం చెప్పమంటావు అమ్మమ్మా? ఆవిడ మనిషి నీరసంగా ఉంది. ఉన్నది నలుగురే కానీ లెక్కకి ఏ ఏదో దో అనుకుంటాను మగపిల్లాడు లేడని వాళ్ళ అత్తగారు దెప్పి పొడుస్తూ ఉండేదని, ఆయన్ని ఆపరేషను చేయించుకోవద్దని ఒట్టు వేయించుకుని మరి కన్నాది వాళ్ళ అమ్మకి ఏదో కాన్పులో మగపిల్లవాడు పుట్టాడట అందుకని ఇపుడేమయింది చెప్పు? డాక్టర్లు మాత్రం ఏం చెయ్యగలరు? ఇపుడు ఎవరికి నష్టం ఆవిడ పోయింది బాగానే ఉంది ఆయన, పిల్లలు ఎలా తట్టుకుంటారు?రోజుల గుడ్డు. రుక్మిణి అక్కయ్య ఇద్దరు పిల్లలని తనతో తీసుకెళ్ళింది రెండు రోజులుంచుకుంటానని, వాళ్ళ పిల్లలతో కలిసి కాస్త మరుస్తారని." నిట్టూరుస్తూ చీర చుట్టబెట్టుకుని వచ్చింది సావిత్రి.

ఏమన్నా ఎంగిలి పడతావుటే"

'లేదమ్మమ్మా. తినాలని లేదు. కొంచెం వేడిగా కాఫీ కలుపు. నువ్వేమన్నా తిన్నావా?"

"ఏదీ, నీ కోసం చూస్తుంటే ఆ పిల్లెవరో వచ్చి ఈ కబురు చెప్పింది. నాకు మాత్రం ఏం ముద్ద దిగుతుంది చెప్పు? మరి తెలిసిన మనిషాయె '

అయితే నువ్వు కూడా కొంచెం కాఫీ తాగు నాతో టి ఫర్వాలేదు." అని మంచం మీద కూచుంది సావిత్రి కాఫీ అందించి "నన్నొక్కసారి వెళ్ళి పలకరించి రమ్మంటావేమిటి?" అంది.

'వెళ్ళగలవా? ఈ వాతావరణం చూసి తట్టుకోగలవా?"

'పిచ్చితల్లీ ఇంతకన్నా ఎక్కువ దెబ్బలే తింది ఈ అమ్మమ్మ వూళ్ళో వాళ్ళ కష్టాలకి తట్టుకోలేనటే. తలుపు జార వేసుకో తొందరగానే వచ్చేస్తాను వెళ్ళకపోతే బాగుండదు మరి అని వెళ్ళిపోయింది

సావిత్రి కాఫీ గ్లాసు కింద పెట్టి, తలకు చుట్టిన తువ్వాలు దులిపి, ఫాను వేసుకుని మంచం మీద వాలింది. కళ్ళ ముందు ఆ తల్లిలేని పిల్లలు కదులుతున్నారు. "తనూ అంతే. కాకపోతే వాళ్ళకి తండ్రి ఉన్నాడు. తనకి ఉండి, లేనట్టే అయ్యాడు. ఇన్నేళ్ళు ఒంటరిగా ఈ జీవితం ఎలా గడుపు కొస్తొందో? యాంత్రికంగా బతికేస్తోంది. ఒక్కొక్క సారి ఏడుపొస్తుంది. ఒక్కొక్కసారి రాయిలా

అయిపోతుంది అసలైన జీవితం అయ్యేపోయింది కాని ఏ ఒక్క క్షణమూ గుర్తు ఉంచుకో దగ్గది లేదు ఎపుడూ అన్నీ మర్చిపోవాలనే ప్రయత్నం ఈ అమ్మమ్మ ఆసరా కూడా లేకపోతే నోరు విప్పి మాట్లాడుకుందుకు కూడా ఎవరూ ఉండరు ఎందుకు తనలాంటి వాళ్ళు పుడతారో?" నిట్టూరుస్తూ పక్కకు తిరిగి పడుకుంది "అమ్మమ్మ వచ్చిందంటే తడి తలతో పడుకున్నావని తిడుతుంది" అనుకుంది

తండ్రిని, పుట్టిన మూడేళ్ళకే పోగొట్టుకుంది సావిత్రి తల్లి నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లల తర్వాత ఎనిమిదో సంతానం ఎవరి ఆదరణా, ఆలనా లేకుండా గాలికి, ధూళికి పెరిగింది ఎదురింటి కుర్రాడు ఆడిన ప్రేమ మాటలు ఆ పరిస్థితుల్లో నచ్చి, చెప్పా పెట్టకుండా వెళ్ళిపోయింది ఆ తర్వాత మూడేళ్ళకి మీ కూతురు రెండో సారి పురుటిలో చచ్చిపోయిందంటూ రెండేళ్ళ సావిత్రిని అమ్మమ్మ మొహాన కొట్టి అతను వెళ్ళిపోయాడు పెళ్ళి చేసుకున్నారో లేదో కూడా తెలియదు కొడుకులు కాళ్ళా వేళ్ళాపడి, కోడళ్ళ చీత్కారాలు భరిస్తూ కొంగున దాచి పెంచుకొచ్చింది ముసలావిడ. వచ్చేపోయే కూతుళ్ళు, పురుళ్ళు, అల్లుళ్ళ అలకలు –అదంతా ఒక నరకం అసలైన మధ్యతరగతి కుటుంబం. ఆ పరిస్థితుల్లో మనవరాలిని మెట్రిక్ దాకా ఎలా చదివించిందో ఆవిడకే తెలియదు. వయసొస్తుంటే, పెళ్ళయి పోయిన, చిన్నకొడుకు



రౌడి చూపుల్నుంచి మనవరాలిని ఎలా కాపాడాలో అర్థం కాలేదుఆవిడకి పెళ్ళి గిళ్ళి చేసే నాధుడెవరూ లేరు దేవుడిలా ఆవిడకి తెలిసిన దూరపు బంధువు ఒకావిడ, తను పని చేసే స్కూల్లో ఉద్యోగం వేయించి నా పిల్లలతో పాటుచూసుకుంటానని అంటే గుండె రాయి చేసుకుని ఆవిడతో వాళ్ళ వూరు పంపించేసింది తన పిల్లలతో చూసుకుంటూ, తనున్న యింట్లోనే ఒక గది సావిత్రికి ఇప్పించి తల్లిలా చూసుకుంది ఆవిడ. ఆవిడ కూతురే రుక్మిణి ఇప్పటికి సావిత్రిని తోడబుట్టిన దానిలా చూసుకుంటుంది. తల్లి పోయినా అదే స్కూల్లో టీచరుగా పని చేస్తూ, భర్తతో పిల్లలతో ఉంటుంది ఈ మధ్యనే ముసలావిడ మనవరాలితో ఉండిపోదామని వచ్చింది.

* * * *

నెలలు గడిచి పోతున్నాయి. పాత జ్ఞాపకాలు మరుగున పడుతున్నాయి మధ్య మధ్యలో ఎప్పుడయినా వెళ్ళి ప్రభాకరంగారి పిల్లల్ని చూసి వస్తుంటారు ఆయన తల్లే ఉంది ఇంట్లో అసలే నెమ్మదయిన ప్రభాకరంగారు ఈ దెబ్బతో మరింత స్తబ్బుగా అయిపోయారు. సావిత్రి, రుక్మిణి, ప్రభాకరంగారు కూడా చాలా రోజుల్నుంచి ఆ స్కూల్లో పనిచేస్తూ ఉండడంతో ఒకరితో ఒకరికి పరిచయం ఎక్కువ. స్కూలుకి సంబంధించిన అన్ని విషయాల్లో కూడా ముగ్గురూ ఎప్పుడూ ముందరే ఉండేవారు ఆయన భార్యతో కూడా వీళ్ళిద్దరికి చనువు ఉండేది వెళ్ళినప్పుడల్లా వీళ్ళిద్దరికి ఆవిడ లేని లోటు ఆ యింట్లో,ఆ పిల్లల మొహాల్లో కనిపిస్తూ ఉండేది

'సాయంత్రం కలిసి మా యింటికి వెళ్దాం నీతో పనుంది అంది రుక్మిణి ఒకరోజు స్కూల్లో

అలాగే' అంది సావిత్రి ఏదన్నా పనున్నా, ఏమీ తోచకపోయినా అలా వాళ్ళ ఇంటికి వెళ్ళడం సావిత్రికి అలవాటే "ఏం పని ఉంది అక్కయ్యా?" అంది నడుస్తూ స్కూలు వదిలాక.

ఇంటికి పద రోడ్డు మీద చెప్పేది కాదు.' అంది. ఇంటికెళ్ళే దాకా ఏం మాట్లాడలేదు. పిల్లలు అప్పుడే తలుపు తాళం తీసి బాత్‌రూములో దూరారు మొహం కడుక్కుని కాఫీ పెట్టి ముందు గదిలోకి దారి తీసింది రుక్మిణి.

ప్రభాకరంగారు మళ్ళీ పెళ్ళి చేసుకుంటారట" అంది నెమ్మదిగా రుక్మిణి.

సావిత్రి తలెత్తి చూసింది ఎప్పుడో ఇలాంటి మాట వినాల్సి వస్తుందనే అనుకుంది. నలుగురు పిల్లల్ని ఒంటరిగా ఎన్నాళ్ళని పెంచుతారు?

నిన్న రాత్రి మా యింటికి వచ్చి మీ బావగారితో మాట్లాడుతూ కూర్చున్నారు వాళ్ళ అమ్మగారు గొడవ చేస్తోందట పిల్లల్ని చూడలేకపోతున్నానని. ఏడాదింకా అవలేదు గానీ ఇంట్లో జరగడం కష్టంగా ఉంది పని మనుషులు వల్ల ఎన్నాళ్ళని అవుతుంది అన్నారు ఆవిడకి హడావుడిగా చెయ్యడం అలవాటు

# సావిత్రి పెళ్ళి ఆగిపోయింది

లేదు పిల్లల్ని సముదాయించ లేకపోతోంది. చాలా మొహమాట పడుతూ చెప్పారు. అవతల వాళ్ళ వైపు చాలా మంది పిల్లలు. వాళ్ళమ్మ పోయిందని పిల్లల్ని చెట్టుకి, పుట్టకి ఒకళ్ళుగా వేరు చెయ్యడం ఆయనకి ఇష్టం లేదు. చాలా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చారు ఆయన." అని ఆగింది రుక్మిణి సావిత్రి ఏం మాట్లాడలేదు

"రాత్రి, పొద్దున మీ బావగారు, నేను దీని గురించే ఆలోచించాం. నీతో చెప్పి ఏ విషయమూ కదుపుదామని." మళ్ళీ ఆగి సావిత్రి మొహంలోకి చూసింది రుక్మిణి. ఏదో అర్థమయ్యీ అర్థమవనట్టుగా ఉంది సావిత్రికి "నీ గురించి అడగమంటావా ప్రభాకరంగారిని" నెమ్మదిగా అంది రుక్మిణి. సావిత్రి తల వంచుకుని కప్పులోకి చూస్తూ ఉండిపోయింది

ఇదివరకు కూడా రుక్మిణి సావిత్రి పెళ్ళి చేద్దామని చాలా ప్రయత్నించింది. ఏమీ కుదరలేదు. మేనమామలు మాట సహాయానికి కూడా రాలేదు వయసు పెరుగుతున్న కొద్దీ ఇంక తన ఈడుకి సరిపడే పెళ్ళికొడుకు ఉండడని సావిత్రికి అర్థమయిపోయింది ఇంకా ఈ మధ్య ఆ సంగతే మర్చిపోయింది మళ్ళీ ఇన్నాళ్ళకి ఇదొక కొత్త ప్రతిపాదన

ఆ పిల్లల్ని సంబాళించుకోగల శక్తి, ఓపిక నీకున్నాయి సావిత్రీ. అదిగాక ఒంటరిగా నువ్వు చాలా అలసిపోయావు నీకూ ఒక ఆధారం అవసరం. మీరిద్దరు ఒకళ్ళని ఒకళ్ళు బాగా తెలిసున్న వాళ్ళు కలిసి బతకడం అంత కష్టం కాదు. నువ్వు ఉద్యోగం మానేసి హాయిగా ఇంట్లో కూచుని ట్యూషన్లు చెప్పుకోవచ్చు నిన్ను కనుక్కుని మీ బావగారు ప్రభాకరంగారితో మాట్లాడతానన్నారు'

కొంచెం సేపు ఏం మాట్లాడలేదు సావిత్రి కాస్సేపయ్యాక "నీ యిష్టం అక్కయ్యా" అంది. సావిత్రి మనస్సు అర్థం చేసుకుంది రుక్మిణి అంతకన్నా వేరే అడిగే అవసరం లేదు "పద. మీ అమ్మమ్మతో కూడా చెప్దాం" అని లేచింది

సంగతి విని ముసలావిడ రుక్మిణి కాళ్ళు పట్టుకున్నంత పని చేసింది "తల్లీ! నీదెంత మంచి మనసమ్మా. ఈ పని చేస్తివా నేను నిశ్చింతగా పోతాను నా తర్వాత దీని గతి ఏమిటా అని రోజూ బెంగే. ఆ పిల్లల్ని ఓపిగ్గా చూసుకుంటుంది. తల్లి లేని బాధ దానికి తెలుసు. నువ్వు, మీ ఆయనా తల్లి తోడుగా దాన్ని చూసుకోవాలమ్మా!" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది

"ఇపుడే ఇంకా ఎవరితో అనకండి. అన్ని విషయాలూ తేలే దాకా ఇంకా ఆవిడ పోయి ఎన్నాళ్ళో అవలేదు గదా ఆయనా చిన్నతన పడుతున్నారు " అని వెళ్ళిపోయింది రుక్మిణి

సావిత్రికి అయోమయంగా ఉంది. 'ఈ జీవితం ఇంకా ఇలా ఒంటరిగా గడిపెయ్యడమే అని ఒక విధంగా అలవాటు చేసుకొంది అనుకోకుండా ఇపుడు కెరటంలా వచ్చిన ఈ పరిస్థితికి ఏం అనుకోవాలో అర్థం కావడం లేదు ఆవిడ పోతే అది తన పాలిట అదృష్టం అవుతుందా? ఇదంతా నిజమేనా?' ఆ ఆలోచనే ఎంతో అద్భుతంగా అనిపించి ఉక్కిరిబిక్కిరి అయింది సావిత్రి.

మర్నాడు పొద్దున్న స్నానానికి వెడుతుంటే, పెరటి వైపు భాగంలో అద్దెకుంటున్న శ్యామల దగ్గరకొచ్చి 'ఆ చీర తాలూకు డబ్బు మధ్యాహ్నం బామ్మగారి చేతికి ఇస్తాను అక్కయ్యా!" అంది "అలాగేలే" అని నవ్వి, "అపుడే పూజ, సాన్నం అన్నీ అయిపోయాయేమిటి?" అంది "ఆ ( వంట కూడా అయినట్టే అందరికీ హడావుడి కదా. డబ్బు ఇవ్వడం ఆలస్యం అయిందని ఏమీ అనుకోవద్దన్నారు ఆయన " అంది

"చాల్లే. అలా అనుకునేదాన్నయితే ఇవ్వనే ఇవ్వను" అని శ్యామల భుజం తట్టింది. కృతజ్ఞతగా చూసి వెళ్ళిపోయింది శ్యామల.

మధ్యతరగతి కుటుంబాలకి శ్యామలది ఒక నిదర్శనం. చిన్నపిల్ల పాపం ఇంటికి పెద్దకోడలు ఆడబడుచులు, మఱదులు, అత్తగారు అలా మునిగి తేలుతూ ఉంటారు అందరూ వాయిదాల పద్ధతి మీద చీర తీసుకుంది పాపం తమ స్కూల్లోనే ఒక టీచరు దగ్గర్నుంచి రెండు వాయిదాల తర్వాతఇబ్బంది పడిపోయారు. చీర తిరిగి తీసేసుకోమంది. తనకే జాలి వేసి మిగిలిన డబ్బు కట్టేసి ఎప్పుడు వీలయితే ' అప్పుడు తీర్చమంది. తన భర్త సంపాదనతో చీర కొనుక్కునే స్వతంత్రం కూడా లేదు పాపం. అంత ఖరీదు పెట్టి కొన్నాదంటే అత్తగారు వూరుకోరు ఆ మధ్య వాళ్ళ అన్నగారు చూడటానికి వస్తే, ఆయన ఇచ్చిన డబ్బుతో కొనుక్కున్నానని అబద్ధం చెప్పింది ఇలాంటి సంసారాలన్నీ చూస్తుంటే తనకి పెళ్ళి కాకపోవడం అంత పెద్ద ప్రమాదమని అనిపించలేదు ఇన్నాళ్ళు కానీ వయసు మీద పడుతుంటే ఈ ఒంటరితనం భయ పెడుతోంది కొట్టుకుంటూ, తిట్టుకుంటూ అయినా బతకడానికి తన వాళ్ళంటూ ఒక మనిషంటూ ఉండాలి. తనదంటూ ఒక సంసారం ఉండాలి. ఈ నిజం గ్రహించాక ముందు జీవితం ఎలా గడపడమా అన్న బాధ మరింత ఎక్కువయింది.

ఆ తర్వాత రోజుల్లో రుక్మిణి వాళ్ళు ఏం ప్రయత్నాలు చేస్తున్నారో సావిత్రికి అంతగా తెలియలేదు స్కూల్లో ప్రభాకరంగారు కూడా మామూలుగానే ప్రవర్తిస్తున్నారు తనేమన్నా చిన్నపిల్లా ఆత్రుతగా ఆరాలు తీయడానికి?ఒకరోజు స్కూలు నుంచి సావిత్రి ఇంటికి వచ్చి, "వాళ్ళ అమ్మగారు కూడా ఒప్పుకున్నట్టే కనబడ్డారు ఎలాగయినా ఆ పిల్లల్ని ఎవళ్ళకయినా అప్పగించాలని ఉంది ఆవిడకి. బాగా పాడయిపోయిందిలే మనిషి వచ్చేనెల్లో గుడిలో క్లుప్తంగా జరిపించమన్నారు ఆయన. నువు ఎవరికన్నా రాస్తావా?" అంది రుక్మిణి సావిత్రితో

"నేనా? అయ్యాక అంతగా అయితే రాయచ్చు లేద్దూ. అంత బింగ పెట్టుకునే వాళ్ళు ఎవరూ లేరు. అమ్మమ్మ ఇక్కడే ఉంది. పిల్లలు ఎలా వున్నారు! అసలు నేనీ మధ్య అటు వెళ్ళనే లేదు."

"బాగానే ఉన్నారు. పిల్లాడు నుంచని అన్నీ పట్టుకుంటున్నాడు. ఆ పెద్ద పిల్లలే పెంచేస్తున్నారు వాడిని. పెద్దదానికి పదకొండు నిండినట్టున్నాయి. పెద్ద మనిషి అయిపోతుందేమో ఇంకా అవన్నీ నేనొక్కదాన్ని ఎక్కడ పడగలను అంటుంది ఆవిడ. అవును గానీ, నువ్వు ఆయనతో ఏమన్నా మాట్లాడతావేమిటి? మా ఇంట్లో కలుసుకోవచ్చు."

"ఏముంది అక్కయ్యా మాట్లాడడానికి. తెలియనిదంటూ ఏమీ లేదు ఇద్దరికీ. ఆయనకెంత చిన్నతనంగా ఉందో, ఈ వయసులో పెళ్ళంటే నాకూ అంత చిన్నతనంగానూ ఉంది. చిన్నపిల్లలమా ఏమన్ననా? ఆయనేమన్నా మాట్లాడతానంటే నాకేమి అభ్యంతరం లేదు."

అంతలా మాటలకి తడుముకోడం ఎపుడూ చూడలేదు సావిత్రి. అయినా మామూలుగా,

"ఆ ( పూర్కొనే. భోజనం చేసి అలా పడుకున్నాను. ఏమిటి సంగతి? ఇలా ఎండలో వచ్చావు?" అంది. ముసలావిడ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు పట్టుకొచ్చింది. ఫాను కొంచెం పెంచింది సావిత్రి. మంచినీళ్ల గ్లాసు కిందబెట్టి, "పొద్దున ప్రభాకరంగారు వచ్చారు మా యింటికి" అంది రుక్మిణి. తలెత్తి చూసింది సావిత్రి గబుక్కున

'మామూలుగా లేదు అక్కయ్య. ఏదో ఉంది అనుకుంది.

'నిన్న పొద్దున వాళ్ల అత్తగారు వచ్చారట పూరుఘుంచి. ఈయన మళ్ళీ పెళ్ళి చేసుకుంటారని తెలిసి." అని ఆగి మళ్ళీ "వచ్చిన దగ్గర్నుంచి 'మాతో చెప్పా పెట్టకుండా అన్నీ ఏర్పాట్లు చేస్సుకుంటున్నారా? పోయింది నా కూతురు ఉన్నది దాని పిల్లలు. మాతో చెప్పద్దా" అంటూ చాలా గొడవ చేశారట" అని ఆగిపోయింది రుక్మిణి.






"నిజమే కదా మరి ఆ మాత్రం బాధ అనిపించదూ కూతురు పోయి ఎన్నాళ్లో అవలేదు అల్లుడు మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నాడంటే బాధగా ఉండదూ " అనుకుంది సావిత్రి.

తల వంచుకుని, కళ్లలోకి చూసి చెప్పలేనట్టుగా మళ్ళీ మొదలెట్టింది రుక్మిణి. "వస్తూ, వస్తూ తనతోటే పెళ్ళి కావల్సిన కూతుర్ని కూడా తీసుకొచ్చిందట. 20 ఏళ్ళు ఉంటాయట ఆయనే అన్నారు. మళ్ళీ పెళ్ళి చేసుకుంటే, తన కూతుర్నే చేసుకోవాలనీ, దాని అక్క పిల్లల్ని అదే చూసుకుంటుంది కానీ వేరే వాళ్లకి ఎందుకి అప్పచెప్పుతాం అని గోల పెట్టారట."

అప్పటికి అర్థం అయింది సావిత్రికి రుక్మిణి ఎందుకు అలా ఉందో? గొంతు తగ్గించి మళ్ళీ చెప్పింది రుక్మిణి. "ఏడాది అయినా కాలేదు అపుడే అడిగితే ఏం బాగుంటుందని నేను పూరుకున్నాను గానీ ఇంట్లో పిల్లని పెట్టుకుని ఎవరికో ఈ సంసారం అప్పచెప్పుతానా. రక్త సంబంధం కొద్దీ ఆ అమ్మాయి అయితే పిల్లలని బాగా చూసుకుంటుంది. పూళ్లో వాళ్లకి ఏం పట్టింది అని అందిట ఆవిడ."

"అర్థం అయింది అక్కయ్యా. ఇంక చెప్పకు. ఎంత బాధ పడుతూ ఇది చెప్పడానికి వచ్చావో నేను గ్రహించగలను. నన్నేదో ఉద్ధరించబోయి మీరిద్దరూ అనవసరంగా మధన పడుతున్నారు." అంటుంటే రుక్మిణి సావిత్రి రెండు చేతులూ పట్టుకుని, "నిజంగా నేను సంతోషించాను సావిత్రి. ఇప్పటికయినా నీ జీవితం ఒక దారిన పడుతుందని ఇదివరకు ఏమి కలిసి రాలేదు. తప్పకుండా ఈ సారి అయి తీరుతుంది అనుకున్నాను. ఆవిడ తన కూతురు నిచ్చి ఆ పెళ్ళేదో కానిచ్చే దాకా కదిలేటట్టు లేదు. ఆయన మాటల్ని బట్టి. అయినా గట్టిగా నిలబడి నిన్నే చేసుకుంటానని అంటే ఎవరేం చేస్తారు?:. వీళ్ల అమ్మగారు కూడా అదే తిరిగిపోయినట్టుంది. అసలు అంత చిన్న పిల్లని ఇస్తారని వీళ్ళు అనుకొని ఉండరు లేకపోతే ఎపుడో ఆ పిల్లని చేసుకుని ఉందురు. అందుకని కూడా సంబరంగా ఉన్నట్టుంది వీళ్ళకి. ఆయన వచ్చి ఇదంతా చెప్తుంటే మీ బావగారికి చాలా అసహ్యమేసిందనుకో. ఈయనా అందరిలాంటి మనిషే అనుకుంటే అసలు ఈ ప్రస్తావనే తీసుకుని రాకపోదుము. ఇటువంటి వాళ్ళు కూడా చిన్నపిల్లల కొసమే ఎగబడుతుంటే నీలాంటి వాళ్ల బతుకులు బాగు పడటం అంటూ ఉండదా?" ఇంకా ఏదో చెప్పబోతుంటే సావిత్రి మధ్యలోనే అందుకుంది

'పూరుకో అక్కయ్యా! ఇచ్చేవాళ్ళుంటే పుచ్చుకునే వాడికేం నొప్పి? అయినా పూరికినే వస్తుంటే నువ్వు మాత్రం పాత వస్తువు తీసుకుంటావా, కొత్తది తీసుకుంటావా? ఇది అంతే ఎందుకు పూరికినే ఆయన్ని అనడం?"

-"ఎందుకనకూడదే? అన్నీ నిశ్చయం చేసుకుని అతను చేసుకుంటానని ఒప్పుకున్నాక ఆవిడ ఏమిటి మధ్యలో? ఆడపిల్లలున్నారు గదాని వరసబెట్టి

"ఆయన్ని అడిగాను. నీలాగే ఏమి అక్కర లేదన్నారు. ఇద్దరూ కూడా నామీదే వదిలేశారు. సరే. నేనూ, మీ బావగారు చూసుకుంటాం అన్నీ. మీ అమ్మమ్మ గానీ ఆవిడతో మాట్లాడుతుందా?"

"నయమే. అమ్మమ్మకి అసలు మాట తీరు తెలియదు. ఇన్నేళ్లలో ఎపుడన్నా మాట్లాడనిచ్చారా తనని. అక్కర్లేదు ఏదో అవకతవకలు మాట్లాడుతుంది." నవ్వింది సావిత్రి

* * * *

ఆదివారం మధ్యాహ్నం ఎండగా ఉందని తలుపులు దగ్గరగా వేసుకుని నడుం వాల్చింది సావిత్రి. నిద్ర పట్టేసింది. తలుపు తట్టినట్టయితే గబుక్కున లేచి తీసింది. ఎదురుగా రుక్మిణి. ఎండలో వచ్చిందేమో చెమటలు కారుతున్నాయి

"ఇంత ఎండలో వచ్చావేమిటి?" అంటూ లోపలికి దారి తీసింది. అలికిడికి కాబోలు ముసలావిడ లేచి వచ్చింది కుర్చీలో కూర్చుంటూ "పడుకున్నావా?" అంది రుక్మిణి. ఏం మాట్లాడాలో తెలియనట్టు,







# సావిత్రి పెళ్లి ఆగిపోయింది

ఎవరో ఒకర్ని కట్టబెట్టెయ్యడమే? నిజంగా మనవలంటే అంత ఆపేక్ష ఉన్నదయితే ఒక్క పిల్లనన్నా తీసుకెళ్లిందా? వాళ్లకే జరుగుబాటు లేదు. ఏదో విధంగా దొరికిందే సందు గదాని కానీ ఖర్చు లేకుండా ఆడపిల్లని వదిలించేసుకుందామని పైగా విధవ కబుర్లు రక్తసంబంధమంటూ. వయసూ వాతా చూడకుండా "ఉక్రోషంతో ముసలావిడ ఏం మాట్లాడుతుందో కూడా ఆవిడకి తెలియడం లేదు." పాపం అమ్మమ్మ తట్టుకోలేకపోతోంది" అనుకుంది సావిత్రి.

"వూరుకో అమ్మమ్మా. ఆడపిల్లల్ని పెంచడంలో ఉన్న కష్టం నీకన్నా ఎవరికి తెలుసు? నువ్వు కూడాఅలాగే మాట్లాడతావా? ఎందుకు ఇంకొకళ్లని ఆడిపోసుకోడం పెద్ద పెద్ద సంసారాల కథలన్నీ ఇలాగే ఉంటాయి. నేను లేనూ ఎదురుగా నిదర్శనం? చెట్టంత కూతురు పోయి ఏడాది అవలేదు. ఆ కడుపు శోకంతోనే ఇంకొక పిల్లని వదిలించుకునే అవకాశం వచ్చిందని ఆనందించే దౌర్భాగ్యం మన ఆడపిల్లల తల్లిదండ్రులది. వాళ్లనేమి అనకమ్మామ్మా. ఆరుగురు ఆడపిల్లలని ఒక దారికి చేర్చి, తర్వాత మగపిల్లలకి ఒక ఆధారం చూపించాలి వాళ్లు. అంతకన్నా వాళ్లు ఏం చెయ్యగలరు? ఎంత అన్యాయమైన పరిస్థితులు కాకపోతే ఆ తల్లి అంత చిన్న పిల్లని నలుగురు పిల్లల తండ్రికి ఇస్తుందో ఆవిడ తరపున ఆలోచించు. 20 ఏళ్ల పిల్ల ఆయనతో ఏం జీవితం అనుభవిస్తుంది చెప్పు?ఒపికుంటే ఆ పిల్లని చూసి జాలిపడు పరిస్థితులకు లొంగిపోయి ఆ పిల్ల జీవితంలో ఎంత పోగొట్టుకుంటుందో ఆలోచించు" విషయం విన్న సావిత్రి ఎంత గోల పెడుతుందో పట్టుకోడం కష్టమయిపోతుందేమో అనుకున్న రుక్మిణి, సావిత్రి అంత నెమ్మదిగా మాట్లాడుతుంటే 'పిచ్చి గానీ ఎక్కలేదు గదా' అని భయపడింది

"సావిత్రీ, నీకేమి అవలేదు కదా" అంది రెండు చేతులూ పట్టుకుని

పేలవంగా నవ్వింది సావిత్రి. "నాకేమి అవలేదు అక్కయ్యా. నేనేమి అయిపోను. నువ్వేదో తప్పుచేశానని అనుకోకు. నిద్దట్లో నాకు ఒక్కోసారి మంచి కలలు వస్తాయి. అలాంటి కలలోంచే లేచాననుకుంటాను. ఎప్పుడూ దేనికోసం ఇంత ఆతురతగా ఎదురు చూడలేదు నేను. అలాంటిది కొన్ని రోజులు నాకూ అలాంటి ఆనందం కలిగించావు. అదే చాలు నాకూ పోటీ వున్నారంటే చాలా బాగుంది. మనం ఛూద్దం లేదూ, మెట్రిక్ ఉద్యోగానికి ఎం. ఏ. వాళ్లు వస్తున్నారు వాళ్లనే తీసుకుంటున్నారు అన్ని చోట్లా అలాగే ఉన్నాయి పరిస్థితులు. నాకంటే ఆ అమ్మాయికి అర్హతలెక్కువ గదా మరి. వయసులో ఉంది. మోడులాంటి నాతో జీవితం ఏం బాగుంటుంది చెప్పు. అందులోనూ ఒకసారి భార్య పోయి డీలాపడిపోయిన మనిషికి చిన్న పిల్లయితే కాస్త సరదాగా వుంటుంది బాధపడకు మరి. ప్రభాకరంగారితో చెప్పు. నేనేమి అనుకోడంలేదని. ఈ విషయం గురించి మేమిద్దరం ఇంతవరకూ మాట్లాడుకోలేదు ఇపుడూ అంతే నా అంతట నేను ఏమీ అనను దీన్లో తప్పెవరిది అంటే అది మన మధ్యతరగతి మనస్తత్వాలదే ఏదో సామ్రాజ్యాలు పోతున్నట్టు, తమ తర్వాత వారసుడు లేకపోతే అరాచకమయిపోతున్నట్టు మగపిల్లవాడు కావాలంటూ ఈ ఆడపిల్లని కని సంతల్లో వేలం వేసేస్తున్నారు ఎవడు తక్కువ పాడితే వాడితో ఎలాంటి వాడయినా సరే పోవాల్సిందే" ఆవేశంగా మాట్లాడి, ఆగిపోయింది సావిత్రి రుక్మిణి కొంగుతో కళ్లు తుడుచుకొంటూ,

"వస్తాను బామ్మగారూ సావిత్రిని చూసుకోండి పొద్దున ఆయన ఈ మాట చెప్పిన దగ్గర్నుంచీ నాకు మతిలేదు అనవసరంగా ఈ గొడవలోకి లాగాను నేను. ఏదో నీ మానాన నువు బతుకుతుంటే వస్తాను సావిత్రీ నేనింక ఇక్కడ ఉండలేను" అని గబుక్కున వెళ్లిపోయింది ముసలావిడ లోపలికి వెళ్లిపోయింది గొణుక్కుంటూ

నా గుండె ఈ దెబ్బతో రాయయిపోయింది నాకింతే రాసి ఉంది కాబోలు. అయినా అక్కయ్య అన్నట్టు, ఈ రొంపిలోకి దిగకుండా ఉంటే ఈ మనస్తాపం ఉండేదికాదు. తగుదునమ్మా అంటూ పెళ్లికి తయారయింది. దేనికయినా అర్హత ఉండద్దూ' అని తనకి తను నచ్చ చెప్పుకుంటూ మోకాళ్ల మీద తలదించుకుని కూర్చుంది. ఎంతసేపు కూర్చుందో తెలియదు. పెరటి వైపు నుంచి కాళ్ల పట్టీలు చప్పుడు వినిపించింది. శ్యామలే కాళ్లకి పెట్టుకుంటుంది. అప్రయత్నంగానే కళ్లు తుడుచుకుంది

'ఆశ్చర్యం. తను ఏడుస్తుందా? తనెంతో మొద్దుబారి పోయింది, రాయయిపోయింది అనుకుంటుందే ఇంకా కన్నీళ్లు ఉన్నయ్యా? ఇంకా తన మనసుఇంత చలించిపోతోందా? జీవితమంటే ఇంత తీపి ఉంటుందా? ఎంత చంపుకున్నా కోరికలు చావవు కాబోలు. తనలాంటి వాళ్లు చావకుండా బ్రతికెయ్యడానికి కారణం అదేనా?" అనుకుంటూ తలెత్తింది

శ్యామల గబుక్కున వచ్చి పక్కన కూచుంది. 'అక్కయ్యా! నీకు పెళ్లిట కదా. మా ఆడబడుచుకి ఎవరో చెప్పారట మీ స్కూలువాళ్లు."

'అబ్బో!' ఎంతో జాగ్రత్తగా వుంచినా, అపుడే ఈ విషయం ప్రచారంలోకి వచ్చేసింది. అయినా పాపం చాలా పాత వార్త మోసుకొచ్చింది.ఆ పెరట్లో కూపస్థమండూకంలా ఏ విషయాలూ తెలియవు శ్యామలకి. ఇట్నుంచి 'తాజా సమాచారం అందిద్దాం' అని కన్నీళ్ల మధ్య నవ్వుతూ "అవును శ్యామలా. కుదిరింది గాని - ఇదిగో ఇపుడే ఆగిపోయింది" అని ఆగలేక మోకాళ్ల మధ్య తలదూర్చుకుని బావురుమంది సావిత్రి. అంతవరకూ దాచుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది. రాయి అయిపోయిందనుకున్న గుండె బద్దలయింది

ఏడుపు విని గదిలోకి వచ్చిన ముసలావిడ మనవరాళ్ని చూసి ఏమీ అనలేక, కడుపులో దాచుకుంటే మరి బాధ ఆ బాధేదో బయటికి పోతేనే మంచిది.' అని నించున్న చోటే చతికిలపడింది. విషయం తెలియని శ్యామల బిత్తరపోయి సావిత్రిని గబుక్కున పొదివి పట్టుకుంది □

చిన్నబుచ్చుకున్నట్టు కూర్చున్నాడు విశ్వం

అతని మొహం చూస్తుంటే జాలేసింది చౌదరికి మరుగునపడ్డ ప్రేమాభిమానాలు తిరిగి తలెత్తాయి

విశ్వం! అమ్మాయి మనసు ఏం బాగాలేదు! నువ్వేం బాధపడకు! సంజాయిషీగా అన్నాడు

ఇందులో అనుకోవడానికేం వుంది మామయ్యా? ముభావంగానే అన్నాడు విశ్వం

ఎలా వున్నావ్? హాస్పిటల్ బావుందా? ఏదో అడగాలన్నట్టు అడిగాడు చౌదరి

బానే వుంది మామయ్యా!

ఎంత పిచ్చివారు నాన్నా పక్కున నవ్వింది మమత

ఏవిటమ్మా?

చిన్నప్పట్నుంచి అనేక విధాల మంచి చెడ్డలు చూసి కన్నకొడుకుకన్నా ఎక్కువగా చూసుకున్న మిమ్మల్ని కాదని మనకి శత్రువైన ఆ రాయుడిగారింట చేరి మీ పదవిని పరువుని ఏకకాలంలో సమాధి చేసిన ఈ పెద్దమనిషి క్షేమ సమాచారాలడుగుతున్నారా?

చిన్నతనం నుంచి ప్రేమించినట్టు నటించి, మనసారా ఆరాధిస్తున్న నన్ను కాదని నాకన్నా చదువులో అధికురాలైన ఆ కల్పనకి చేరువైన అతగాడి హాస్పిటల్ ఏమైతే మనకెందుకు నాన్నా!

ఏదో నలుగురూ నాలుగు రకాలుగా అంటారని మొహం చూపించడానికి వచ్చాడే తప్ప, మీ మీదా, నా మీదా ప్రేమతో మాత్రం కాదు నాన్నా ఈ పెద్దమనిషి వచ్చింది!" కఠినంగా అంది మమత.

విశ్వం ముఖం పాలిపోయింది

మమతా! చాలా మో రంగా మాట్లాడుతున్నావ్!" అన్నాడు మెల్లగా

ఏం? నేనన్న దాంట్లో అబద్ధం ఏమైనా వుందా? సారీ! మరో సంగతి నీకు చెప్పనేలేదు!

నువ్వు చేసిన అవమానానికి నాన్న ఈ లోకాన్నించి ఏనాడో తప్పుకోవాలని చూశారు ఏ దేవుడో నాయందుండి ఆయన్ని కాపాడుకోగలిగాను! తీక్షణంగా అంది

జరిగిపోయిందాన్ని గురించి ఇప్పుడు తవ్వుకోవడం ఎందుకమ్మా!నలుగురూ వచ్చి చూసినట్టే విశ్వంకూడా వచ్చి చూశాడనుకో! కాస్త మందలింపుగా అన్నాడు చౌదరి

అలాగే! చూశాడుగా? ఇంక వెళ్ళమను! సీరియస్‌గా అనేసి మరో వైపు తిరిగి పడుకుంది మమత

విశ్వం మనసు బాధతో మూలిగింది

మమతా! అన్నాడు అనునయ స్వరంతో

మమత పలకలేదు

నా మాట ఒక్కటి విను !

విన్ను! అరిచింది మమత

ప్లీజ్! ఒక్క క్షణం నా మాట విని ఆ తరువాత నీ ఇష్టం వచ్చినట్టు తిట్టు!...

"డాక్టర్!. అయ్ వాంట్ రెస్ట్! ప్లీజ్! లీవ్ మి అలోన్!" టక్కున రెండు చేతులూ చప్పుడయ్యేలా జోడించి అంది మమత.

కందిపోయిన మొహంతో లేచాడు విశ్వం.

(ఇంకా వుంది)

తాము చిత్రించిన అయ్యదేవర కాళేశ్వరరావు తైలవర్ణ చిత్రంతో శ్రీ సోమయాజి

# మరుగున పడ్డ కళాకారుడు

ఆ రోజు అక్టోబర్ 7వ తేది విజయవాడలోని శ్రీ కన్యకాపరమేశ్వరి సత్రంలో సర్దార్ బయన వీరరామచరావుగారి ఆధ్వర్యంలో కాంగ్రెసు శత జయంతి వుత్సవాలు పూజ్య బాపూజి 116వ జయంతి వుత్సవం వైభవంగా జరుపుకుంటూ ఆ రోజు 101 మంది వివిధ రంగాలలోని ప్రముఖ కళాకారులను సన్మానించారు ఆ సభకు అధ్యక్షత వహించే భాగ్యం నాకు కలిగింది ఆ 101 మందిలో శ్రీ అత్మూరి జ్ఞానేంద్రమోహన్ సోమయాజి వొకరు

శ్రీ సోమయాజి తండ్రిగారు కీ శే ఆత్మూరి రమమోహన్‌రాయ్ ఆంధ్ర రవివర్మ బిరుదాంకితులు మహారాజ పోషకులు సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ రాయ్‌గారు గాంధీనగరంలో 1914వ సంవత్సరంలో రామమోహనరాయ్ స్టుడియోను వారి స్వంత భవనంలో స్థాపించారు శ్రీ సోమయాజి శ్రీ రాయ్ గారి ద్వితీయ పుత్రుడు తండ్రి వద్దనే కాకుండా మద్రాసులోని ది స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ లో చాలాకాలం చిత్రలేఖనం అభ్యసించారు తైలవర్ణ చిత్ర రచనలో ఆయన అందె వేసిన చెయి ఆయన వేసిన కీ శే అయ్యదేవర కాళేశ్వరరావు గారి తైలవర్ణ చిత్రపటం హైదరాబాదు అసెంబ్లీ హాలులో అనాటి స్పీకరు శ్రీ బి వి సుబ్బారెడ్డి గారిచే ఆవిష్కరించబడింది ఆ సందర్భంగా శ్రీ సోమయాజి గార్ని సత్కరించారు ఆయన ఆ విధంగా యెన్నో తైలవర్ణ చిత్రాలను రూపొందించి విశేష ఖ్యాతి గడించారు ఆయనే స్టుడియో అధినేతగా వుండేవారు

శ్రీ సోమయాజి చిత్రలేఖనంలో నే కాక ఛాయాచిత్ర కళలో కూడా సిద్ధహస్తులు సుప్రసిద్ధ నాటక కళాకారులకు సంగీత విద్వాంసులకు ఎన్ని కళాకారులకు ఆర్టిస్టిక్‌గా ఛాయా చిత్రాలు తీసి మెప్పు పొందారు వీరి వద్ద ఛాయా చిత్ర కళలో తర్ఫీదు పొందిన కళాకారులు యీనాడు ఎవిరంగంలో ప్రముఖ స్థానంలో వున్నారు ప్రఖ్యాత ఛాయా చిత్రకారులు శ్రీ వీరన్న వీరి శిష్యులే!

శ్రీ సోమయాజి సంగీతప్రియులు హిందుస్థాని సంగీతం నేర్చుకున్నారు హార్మోనియంలో సిద్ధహస్తులు వీరి అభిప్రాయానుసారం వీరి స్టుడియోలోనే 1945లో కొందరు మిత్రులు కలసి హిందూస్థాన్ సంగీత మండలి స్థాపించారు వీరికి సహకరించిన వారిలో ముఖ్యులు మాజీ నాటక అకాడమి ఉపాధ్యక్షులు కళాప్రియులు శ్రీ సుంకర కనకారావు ఒక దశాబ్దంపాటు యీ సంస్థ అనేకమంది సంగీత విద్వాంసులను ఆహ్వానించి వారి కచేరిలను యేర్పాటు చేసింది శ్రీయుతులు వినాయకరావుపట్వర్ధన్ రేనెడే నారాయణరావువ్యాస్

శ్రీ సోమయాజి అనేకమంది ప్రముఖ సంగీత విద్వాంసుల సరసన హార్మోనియం వాయించి ఆటు విద్వాంసుల చేత యిటు శ్రోతల చేత శబాష్ అనిపించుకున్నారు వీరి స్టుడియోలో అహోరాత్రులు సంగీత కార్యక్రమాలు జరుగుతూ వుండేవి మినీ కచేరిలు భజనలతో స్టుడియో మారుమ్రోగేది

శ్రీ సోమయాజి సాహిత్యప్రియుడు నవీన భావ సంభరితంగా నాటకాలు రచించి ప్రదర్శింపచేశారు ఆ రాత్రి స్మశానం 15000 క్యాష్ నన్ను పెంచిన నాలుగు చేతులు వీరికి మంచి పేరు తెచ్చాయి వీటిలో కొన్నింటిలో నటించే భాగ్యం నాకు కూడా కలిగింది నాటకం రిహార్సల్సు స్టుడియోలోనే జరిగేవి డాక్టర్ ఎ వి ఆచార్ వీరికి నాటకాలలో సహకరిస్తూ వుండేవారు వీరి రచనల్లో కళా దృష్టితో పాటు సంఘ సంస్కరణ దృష్టి కూడా గోచరిస్తుంది అనాది నుంచి ఆత్మూరి వారి వంశం ఆధ్యాత్మిక చింతనకు పెట్టింది పేరు ప్రతి శనివారం భజనలు స్టుడియోలో జరిగేవి ఆ సుందర సుప్రసిద్ధ స్టుడియో యీనాడు లేదు అన్యాక్రాంతమై భోజన హొటలుగా మారింది రూపురేఖలు మారిపోయాయ్!

శ్రీ సోమయాజికి 72 సంవత్సరాలు నిండినా యింకా తానేదో సాధించాలని తపనపడే కళాతపస్వి సంఘసేవాపరుడు నిరాడంబరుడు స్నేహశీలి అన్నిటికన్నా మించిన ఆర్ద్ర హృదయుడు బాబాయ్ అని ఆప్యాయంగా పిలుచుకునే నా ఆత్మీయుడు

శ్రీ సోమయాజి 1938లో మద్రాసు ప్రెసిడెన్సీలో అత్యుత్తమ కళాఖండంగా యెంపికయ్యిన తమ బెర్నార్డ్‌షా తైల చిత్రాన్ని నా అనుకరణ ప్రదర్శనకు అభినందన సూచనకంగా బహూకరించడం నా అదృష్టం

—నేరెళ్ళ లక్ష్మణరావు

మార్గం....ఏమిటది?...ఓ ఏడుకొండల వాడా, వెంకటరమణా నీదే భారం...నీవే దిక్కు..."

స్కెచ్ చదవడం పూర్తి అయింది. శ్యామం మనసు మరింత చికాకు పడిపోయింది. కళ్ళు చిట్లించి ఓ సారి ఆ స్కెచ్ వంక చూచి, వెంటనే దాన్ని ముక్కలుగా చించి వేసి ప్రక్కనున్న బుట్టలో పడేశాడు.

ఇంతలో వర్ధనమ్మగారు వచ్చింది.

'అబ్బాయ్! ఎప్పుడూ చదువు సంధ్యలు, రాతకోతలే తప్ప ఇంటి విషయాలు పట్టించుకునేది లేదా...' అన్నది ఏవో జరూరు పనులున్నట్టుగా.

శ్యామం విసుగ్గా సమాధానం చెప్పాడు...'ఇప్పుడు నన్నేం చేయమంటావో చెప్పు.'

'ఏం చెప్పేదిరా. నిన్ను, కుటుంబాన్ని ఉద్ధరించుకుంటే చాలు.'

'ఇప్పుడు మనకేం వచ్చింది. నేనేం ఉద్ధరించుకోవాలి.'

'అంతేనా మరి, నువ్వొక ఇంటివాడివైతే నా బాధ్యత తీరిపోతుంది. కోడలు పిల్ల మీద భారం వేసి కృష్ణా, రామా అంటూ ఓ మూల కాలక్షేపం చేద్దామని నా ఆశ.'

'అదేనా సంగతి. అయితే ఆ భారమేదో నేను చూచుకుంటాను గాని నీవేమీ దిగులపడకు.'

'నువ్వలా అనగానే సరిపోతుందటరా...అన్నట్టు నా మతిమండ. ఆ కామయ్యగారు వస్తానని కబురు పెట్టారు కదూ. మరచేపోయాను.'

'ఎందుకో.'

'ఎందుకేమిటి. నీ విషయమే. పెళ్లి విషయం మాట్లాడటానికి. ఆయన తమ్ముడి కూతురు కోసం సంబంధాలు వెతుకుతున్నారట. 30 వేల బాల తొడుగు, యాభయి వేల కట్నం, ఇతర లాంఛనాలు అన్ని కలిపి లక్షకు పైగా ముట్ట చెబుతారట.'

'అమ్మా! ఇక అంతటితో ఆగుతావా మరి. నా మాట కూడా విను '

'ఏమిటిరా నువు చెప్పేది. పెళ్లి లేకుండా ఇలా బ్రహ్మచారిగా వుండిపోదలచావా ఏం...?'

'ఆ మాట అనడంలా...కాని ఇంత డబ్బు వారు ఎందుకు ఇవ్వదలచారో గ్రహించావా...మనకున్న ఆస్తిపాస్తులు చూచి గాని, నన్ను చూచి కాదు.'

'ఏమిటో , నీ వెర్రి నీది, నా పిచ్చి నాది.'

'వెర్రికాదే..వున్న మాటే చెబుతున్నా. నా పెళ్లి గురించి నేనిప్పుడు అర్థంటుగా ఆలోచించడం లేదు. నాకు బుద్ధి పుట్టినప్పుడెప్పుడో చేసుకుంటాను. ఆ కామయ్య గారొస్తే మాత్రం, పెళ్లి విషయంలో నేనింకా ఒక నిర్ణయానికి రాలేదని చెప్పి పంపించు. సరేనా..' అని చెప్పి వెంటనే బయటకు వెళ్లిపోయాడు.

ఓ గంట తర్వాత తిరిగి వచ్చాడు. ఈ సారి నేరుగా ఇంట్లోకి వెళ్లాడు. తల్లి వంట పని చూచుకుంటోంది కొడుకు రాకను గమనించినా పట్టించుకోనట్టు వూరుకుంది తల్లి మనసు నొచ్చుకున్న విషయం గ్రహించాడు.

'అమ్మా!' పిలిచాడు శ్యామం. తల్లి పలకలేదు. కొన్ని క్షణాలాగి మళ్లీ పిలిచాడు. ఈసారి చూచింది పెదవి మాత్రం విప్పలేదు. కొద్ది సేపు మాటలు లేవు కాని ఒక్కసారిగా అన్నదిలా –'ఏరా, నువ్వు నా మాట వింటావా, వినవా...' అని.

'సరే వింటాను. ఏమిటో చెప్పు '

'అయితే విను ఆ సరోజ మనింటికి రావడం ఇష్టంలేదు.' తల్లి మాటలకు







కొడుకు నిర్ఘాంతపోయాడు. తాను ఊహించని మాట అది. తన గురించి అమ్మ అపార్థం చేసుకున్నదని భావించాడు. అయినా, అప్పుడిక మాట్లాడించదలచలేదు. వెంటనే, ఆఫీసు రూములోకి వెళ్ళిపోయాడు.

## 9

మేడ మీద గదిలో శోభ ఓ కుర్చీలో కూర్చుని పేపరు చూస్తోంది దృష్టి నిలిపి దేన్నీ చదవడం లేదు. అర్థంలేని ఆలోచనలతో సతమతమవుతోంది. పేపరు మడిచి గిరవాటు వేసింది. బెడ్ మీద మేను వాల్చింది. శ్యామం అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. పొరపాటు ఎవరిదో, ఎందుకిలాంటి పరిణామాలు వచ్చాయో ఆమెకు బోధపడటంలేదు.

ఉత్తరం అందలేదన్న మాట నిజమేనా. చదువు, సంస్కారం గల వ్యక్తి అబద్ధం చెబుతాడా. 'ప్రిజుడీస్' అన్నమాటకు శ్యామం మనసు ఎంతగా నొచ్చుకుందో. నా తండ్రి గారన్న మాటలకు నేనెలా బాధ్యురాలనవుతాను. అందుకేగా క్షమాపణ చెప్పడానికి వెళ్ళాను. అంతకుముందే లేఖ కూడా రాశానుగా. తనకు అవమానం జరిగిందన్న బాధతో, ప్రతీకారంగా నా ఉత్తరం అందలేదని చెప్పాడేమో!?..ఏమిటి తర్జన భర్జన. మొదటగా, తెలిసీ తెలియని స్థితిలో మనసు పారేసుకునేది అమ్మాయిలేనంటారు. కాని నేనలా చేయలేదు. నా ఆస్తిని, అంతస్థును అన్నీ మరచిపోయి శ్యామాన్ని ఆరాధించాను. అతనిలో గల మంచికీ, మమతకు నా మనసు లొంగిపోయింది. అందచందాలు, పైపై మెరుగులు చూచి అమ్మాయిలు ఆకర్షించబడతారని సహజంగా అనుకుంటారు. కాని వాస్తవం వేరుగా వుంటుంది. ఆకర్షణకు అందచందాలు, వయస్సు మాత్రమే కొలబద్దలు కాదేమో! నిజానికి, ఎంత తరచి ఆలోచించినా యువతీ, యువకులు పరస్పరం ఆకర్షించబడేందుకు, అందచందాలే గాక, అంతకు మించిన బలీయమైన కారణాలేవో వుంటాయని; ఆ కారణాలు 'ఇవి' అని నిర్ధారించి చెప్పలేమని భావించవచ్చునేమో! అంతటితో ఆలోచనలకు బ్రేకు పడింది. మళ్ళీ ఆమె కనుల ఎదుట శ్యామం రూపం ప్రత్యక్షమైంది...'నిన్ను బాధ పెట్టానా.. శోభా...నన్ను క్షమించవూ...' అని దీనంగా ప్రాధేయపడుతున్నట్లుంది ఆ రూపం.. శోభ హృదయం వెన్నలా కరిగిపోయింది. 'శ్యామ్ నువు అబద్ధం చెబుతావంటే నేను నమ్మలేను. అసలా లేఖ పోస్ట్‌బాక్స్‌లో పడినట్లేనా!?' ఈ అనుమానం జనించిన వెంటనే కాలింగ్ బజర్ ప్రెస్ చేసింది. కొద్ది నిముషాల్లో పని మనిషి వచ్చింది.

'ఏమే, నేనారోజున ఉత్తరమిచ్చి పోస్టు చేయమన్నాను. అలా చేశావా?'

అనుకోని ప్రశ్న వినగానే పనిమనిషి ముఖంలో భయం, ఆందోళన ముప్పిరిగొన్నాయి. సమాధానం చెప్పకుండా తల వంచి నిలబడింది.

శోభలో అనుమానం మరింతగా పెరిగింది. స్వరాన్ని పెంచి మళ్ళీ గద్దించి అడిగింది.

వణుకు పుట్టుకొచ్చిన పనిమనిషి చెప్పడం ప్రారంభించింది...

'మీరు ఆ రోజు టేబిల్ మీద తల వాల్చి పడుకుండిపోయారమ్మా, నేనొచ్చి చూసి మిమ్మల్ని తట్టి పిలిచాను. కళ్ళు తెరిచారేగాని, సరిగా మాట్లాడలేకపోయారు: గది తుడిచి శుభ్రం చేస్తుండగా మీరే లేచారు. ఉత్తరం మడిచి కవరులో పెట్టి నా చేతికిచ్చారు. లేచి వెళ్ళి మంచం మీద పడుకున్నారు. ఆ ఉత్తరం తీసుకుని కిందకెళ్ళాను. అయ్యగారు ఎదురుపడి నా చేతిలో ఉత్తరం ఏమిటని అడిగి, ఎంటనే తీసుకున్నారు. ఎవరిచ్చారని అడిగారు. మీ పేరు చెప్పాను. నీ పని చూసుకో పో. అని నన్ను పంపేశారు. ఆ తర్వాత ఏంజరిగిందో నాకు తెలియదమ్మా...' అని ఇంకా ఏదో చెప్పబోతుంటే, గది గుమ్మంలో మాధవరావు గారి గభీరమైన మూర్తి కనబడింది. శోభ, పనిమనిషి నిశ్చేష్టులై నిలబడిపోయారు.

మాధవరావు గారు గదిలోకి అడుగు పెడుతూ, 'ఆ తర్వాత ఏమైనది దానికేం తెలుసు, నేను చెబుతాను.' అని...పని మనిషి వైపు చూస్తూ, 'నీవు క్రిందికి పోవే' అని ఆదేశించారు. ఆమె గదిలో నుంచి వెళ్ళిపోయింది. శోభ కూడా వెళ్ళబోయింది. తండ్రి గద్దించినట్లు పిలిచారు 'శోభా! అని. కూతురు ఆగింది.

'శోభా! నీ ధోరణి మారలేదని అర్థమవుతోంది. నీ వనుకునే ప్రేమ అనేది ఒక పిచ్చి వంటిది. అది మనసును పిండి పిప్పి చేస్తుంది. ఆలోచనలను పెడదారి పట్టిస్తుంది. అందుకే ప్రేమ అనేదాన్ని గుడ్డితనంతో పోల్చారు. కన్నబిడ్డ క్షేమం కోరే, ఏ తండ్రి అయినా చెప్పేది ఇదే. నీ విషయం గ్రహించకపోతే నీతో పాటు, నన్ను కూడా బాధ పెట్టినదానవవుతావు. ఒక్కగానొక్క కూతురివి. నీవు సంతోషంగా వుంటేనే, నాకు ఆనందం. ఈ సిరిసంపదలన్నీ నీ కోసమే తల్లీ. నా మాట విను. ఒక అనామకుడి కోసం, మనం, మన గౌరవప్రతిష్ఠలు కోల్పోలేం...

'అనామకుడు' అన్న మాట చెవిని పడగానే, ఎవరో తన గుండెలో శూలం పెట్టి పొడిచినంతగా బాధ పడింది. కళ్ళు అంతింతలుగా చేసుకుంది. గుండెలో చెలరేగిన తుఫానుకు ఒడలంతా కంపించిపోయింది. అదే ఎడతెరిపి లేని ఆయాసంగా మారింది. తీవ్రమైన ఉచ్ఛ్వాస నిస్వాసాలు, తీక్షమైన చూపులు,. మనోవ్యధ మిళితమై బుసలు కొడుతున్నట్లున్నాయి. కంపనను, బాధను, ఆయాసాన్ని అణచి పెట్టుకోవాలన్న ప్రయత్నంతో రెండు చేతుల అరచేతులు ఏకమై పెనవేసుకుపోయి గట్టిగా బిగుసుకున్నాయి. అదే సమయంలో కనురెప్పలు కూడా గట్టిగా మూతలుపడ్డాయి. ఆ ప్రకంపన పెదవుల మధ్య నుండి...'ఆయన అనామకుడు కాదు నాన్నా...కానేకాదు...' అన్న మాటలు వెలువడ్డాయి. ఆ శబ్దతరంగాలు ఆరోహణ క్రమం నుంచి, అవరోహణలోకి మారి, అవే, ఆ గదిలో ప్రతిధ్వనించాయి.

కూతురు ధోరణి ఇంకా మారలేదని గ్రహించిన తండ్రిలో ఆవేశం జనించింది.

'శోభా! నేనెంతో నిగ్రహంతో, మంచితనంతో చెబుతున్నాను. నీ మొండి ధోరణి మాత్రం మారడం లేదు. నా గౌరవాన్ని, ఈ వంశ గౌరవాన్ని

# అంతరాలు - ఆంతర్యాలు

నిలబెట్టుకోనడం ఎలాగో నాకు తెలుసు. అందుకే ఆ ఉత్తరాన్ని అనాడే చించి ముక్కలు, ముక్కలు చేసి తగులబెట్టాను. నా వంశ ప్రతిష్ఠను మంటగలపాలనుకుంటున్న ఆ శ్యామం, నా ముందు, నా సిరిసంపదలు, పలుకుబడి ముందు అల్పుకుడని తెలుసుకో. తలుచుకుంటే నేను ఏమైనా చేయగలను...' ఆవేశం పట్టలేక పెద్దగా అరుస్తూ అన్నారు నాయుడుగారు.

'నాన్నా, ఆయన్ని మీరేమీ చేయవద్దు. నేనిక ఏ ఉత్తరం రాయను. నేనే మరచిపోతాను. నా మాట నమ్మండి...నన్ను నమ్మండి నాన్నా...'

తండ్రి ఆవేశం తగ్గలేదు.

'అంతేకాదు శోభా! నీకు పెళ్ళి సంబంధాలు కూడా చూస్తున్నాను. మన వంశ గౌరవాన్ని నిలబెట్టగల వాడినే వరుడుగా తీసుకొస్తాను...నీ ధోరణి ఇప్పటికీ మారకపోతే, మీ అత్తయ్య వాళ్ళింటికి హైదరాబాద్ పంపించేస్తాను...' అని చెప్పి విసురుగా ఆ గదిలో నుంచి వెళ్ళిపోయారు.

శోభ హృదయం విలవిలలాడిపోయింది. గది తలుపులు మూసివేసి మంచం మీద వాలిపోయింది. కన్నీటి ధారలను ఆపుకోలేకపోతోంది. శ్యామం నిర్మల వదనం ఆమె కనుల ముందు కనబడింది. చిరునవ్వు చూపుతోంది. ఆ నవ్వులో ఎన్నెన్ని భావాలు గర్భితమై వున్నాయో!?

'నిన్ను అపార్థం చేసుకున్నానని వెక్కిరిస్తూ నవ్వుతున్నావా శ్యామ్. నిన్ను, చేజేతులా దూరం చేసుకుంటున్నానని నవ్వుతున్నావా శ్యామ్. స్వయంకృతాపరాధానికి తగిన ఫలితం అనుభవిస్తున్నానని హేళనగా నవ్వుతున్నావు కదూ...నన్ను నమ్మవా..నమ్మలేవా..నిన్ను మనసారా ప్రేమించానని ఎలా చెప్పేది. నాలో నేను కుమిలిపోతున్న సంగతి నీకెలా చెప్పేది...నా హృదయం కుమిలిపోవడమే కాదు, నేను కూడా కృశించి పోతున్నాను శ్యామ్.. క్షమించమని మళ్ళీ , మళ్ళీ ప్రాధేయపడేందుకు, వేయిసార్లు వేడుకునేందుకు నీ దగ్గరకు రాలేకపోతున్నాను...ప్రాణం లేని సిరిసంపదలు ప్రాణం పోసుకుని నాకు సంకెళ్ళు వేశాయి. ఈ సంకెళ్ళు త్రెంచుకునే స్థితిలో లేను...నిన్ను మరచిపోతానని మానాన్న గారితో చెప్పిన మాటలు నీకు వినిపించాయా...లేదు...అలా ఎన్నటికీ జరగదు...నా మనసుకి ఎవరూ సంకెళ్ళు వేయలేరుగా.. అందుకే నా మనసులో నీ రూపాన్ని పదిలంగా దాచుకున్నాను. శ్యామ్, శ్యామ్...' అనుకుంటూ మెత్తని దిండులో తల దూర్చి ఒత్తుకుంది. కళ్ళు మూతలు పడ్డాయి. ఒడలు వేడెక్కిపోయింది. ముచ్చెమటలు పోశాయి. ఆ మెత్తని దిండుపై కన్నీటి చారికల చెక్కిళ్ళు, ప్రేమామృతం నింపుకున్న పెదవులు తమకంతో దోగాడాయి. ఆ ఆవేదనా భారంలో నే మత్తు. ఆ మత్తులో నిద్ర ముంచుకొచ్చాయి.

* * * * *

సుమారు వారం రోజుల తర్వాత సరోజ, శ్యామం ఇంటికి బయలుదేరింది. సమయం ఉదయం పదిగంటలు. ఎండ వేడి పెరిగింది. చేతిరుమాలుతో చెమటలు తుడుచుకుంటూ, త్వరగా నడచి వెడుతోంది. చేతిలో శ్యామం ఇచ్చిన నవల వుంది.

సుబ్బారావుగారి ఇంటిని తనఖా పెట్టుకున్న పరంధామయ్య సరోజను చూచాడు. సరోజ ఆయనకు చిన్ననాటి నుంచి తెలుసు.

'అమ్మాయ్, సరోజా! ఈ ఎండలో ఎక్కడికి బయలుదేరావు?'

"శ్యామం గారింటికండి." ఇలా చెప్పి క్షణం తర్వాత ఎందుకో తత్తరపడింది.

పరంధామయ్య సరోజ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ, "శ్యామంగారంటే, ఆ పత్రికాయనేనా." అని అడిగాడు.

"అవునండి...." అని ఏదో భయంగా చూస్తూ ముందుకు అడుగులు వేయడానికి ఉపక్రమించింది.

"శ్యామంగారు నీకు స్నేహితుడా?" పరంధామయ్య వదలిపెట్టలేదు. ఈ ప్రశ్న సరోజలో గగుర్పాటును జనింప జేసింది. ఆయన కళ్ళల్లోకి సూటిగా చూడలేకపోయింది. అయినా చెప్పింది.... "కాదు.... మా నాన్నగారు, ఆయన మిత్రులు.... వస్తానండి...."-అని ఇక అక్కడ ఆగకుండా చరచర వెళ్ళిపోయింది.

శ్యామం ఇల్లు చేరుకుని, గేటు తెరచుకుని ప్రవేశించింది. తల వంచుకుని ఆఫీసు గది వైపు వెడుతోంటే, వర్ధనమ్మగారు చూచి పిలిచింది. సరోజ ఆ పిలుపు విని, తల యెత్తి చూచింది. ఇంటి గుమ్మం వరకు వెళ్ళి, నమస్కరించి అక్కడే నిలబడింది.

"రా అమ్మాయ్! నిలబడ్డావే.... లో పలికి రా."

సరోజ చెప్పులు విడిచి లోపలికి అడుగు పెట్టింది.

"సరోజా, మా ఇల్లు చూడలేదనుకుంటాను. రా లోపలి కెడదాము." అంటూ దారి తీసింది వర్ధనమ్మ.

సరోజ వదనంలో సంతోషం వెల్లివిరిసింది.

"ఏమండీ! మీ ఇల్లింత చక్కగాను, తీరుగాను వుందో." సరోజ అమాయకంగా వ్యాఖ్యానించింది.

"ఎక్కడ వస్తువు అక్కడ వుండకపోతే నాకు నిద్ర పట్టదమ్మా...." అంటూ అన్ని గదులూ చూపించింది. ఇద్దరూ ముందు గదిలో కొచ్చి కూర్చున్నారు.

"మీ అబ్బాయిగారు లేరా?"

"వున్నాడు గదా ఆఫీసు గదిలో. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే వుంటాడు."

సరోజ వెడతానని చెప్పలేక పోయింది. వెళ్ళమని వర్ధనమ్మగారు కూడా అనలేదు. వారిద్దరి మధ్య కుటుంబ విషయాలు చాలా నడిచాయి. పావుగంట కాలం నడిచింది.

"అమ్మాయ్! నీవిక చదువుకు స్వస్తి చెప్పినట్లేనా?"

"అవునండి...."

"మరి ఏం చేసేట్టు?"

"ప్రస్తుతానికి ఏమీ లేదు."

"పోనీ, సంబంధాలైనా చూస్తున్నారా?"

"చూస్తున్నారండి, ఏదీ సెటిల్ కావడం లేదు. అంతా డబ్బుతో పనిగదా!"

"అన్నిటికీ డబ్బేనమ్మా మూలం. మనిషి గౌరవ ప్రతిష్ఠలు కూడా డబ్బు మీదనే ఆధారపడి వున్నాయి. అదలా వుంచు. మా కాలంలో అయితే ఈడొచ్చిన ఆడపిల్ల గుమ్మం కదిలేదా. ఎవరైనా వచ్చి పేరంటానికో, మరేదైనా శుభ కార్యానికో పిలిస్తే తప్ప ఇల్లు వదలివెళ్ళే ప్రసక్తే లేదు."

వర్ధనమ్మగారి ఆంతర్యం సరోజకు అర్థం కాలేదు.

"మీరు, మరీ పాతకాలం మాటలు చెబుతున్నారండి."

"మీకు అలాగే వుంటుంది మరి. మనలో మంచివున్నా లోకం గుర్తించదు. ఇది అసలే కలికాలం...." ఈ మాటలు సరోజ కింకా అర్థం కాలేదు.

"మీరు పెద్దవారు గనక, లోకం తీరు తెలుసు గనుక అనుభవంతో చెబుతున్నారు. కాదనడం లేదు. కాని మనం, మనకోసం బ్రతుకుతున్నామేగాని ఇతరుల కోసం కాదుగా.... అంతేనా.... లోకులు కాకులన్న సామెత వూరికే వచ్చిందా."

"అమ్మో, ఏమిటో ననుకున్నా. మాటకారివే.... ఆఁ.... ఆ కట్టుకునే వాడెవడో గాని నీ కొంగు పట్టుకు తిరగాల్సిందే...." అంది వర్ధనమ్మ నవ్వుతూ.

"మీకు తెలియకుండానే నా పెళ్ళి జరగదు లెండి...." ఈ మాటలనగానే వర్ధనమ్మగారి కళ్ళల్లోకి సూటిగా చూచింది సరోజ. కాని ఆమె మాత్రం సరోజను చూడలేదు.

"ప్రొద్దుటెప్పుడో గుక్కెడు కాఫీ తాగాను. అప్పుడే కడుపు నకనకలాడుతోంది. ఏమిటో ఈ ప్రాణం...." అంటూ ఇంకా ఏమో అనబోతోంటే, సరోజ అడ్డువచ్చి –

"అయితే వంట చేశారా?" అని అడిగింది.

"అయిందమ్మా, ఏది తప్పినా అది తప్పదుగా!"

"అయితే నేను వడ్డిస్తానండి," అని చిరునవ్వుతో అంది.

"పోనిలెండి! యిన్నాళ్ళు బతగ్గా లేండి! యింకో వారం రోజులు బతక్కపోం! ఆ వెంకటేశ్వరస్వామి దయవల్ల మీరింటికి క్షేమంగా వచ్చారు! అదే చాలు! లేవండి! కాస్తంతయినా తిందురుగాని" అంటూ అమాయకంగా లోనకు వెళ్తూన్న భార్య వైపు చూస్తూ, తను యింటిలో లేకపోతే అన్నమే తినని తన భార్య నైజం గుర్తుకొచ్చి, తనకి తినాలని లేకపోయినా సుగుణమ్మగారి వెనకాలే లోనకి నడవక తప్పలేదు యాజులు గారికి.

★ ★ ★ ★ ★

సరిగ్గా! నాల్గోరోజా వుదయం పూజ ముగించుకొని యింటి వసారాలో కూర్చున్న యాజులు గారి చేతిలో ఓ మనియార్డరూ, రిజిష్టర్డు పార్శిలూ అందించాడు అప్పుడే వాళ్ళ యింటి ముందు సైకిలు దిగిన పోస్ట్‌మేన్. ఆ మనియార్డరుతో తన పెన్షను మొత్తమంతా వచ్చేసరికి మరింత ఆశ్చర్యంతో సెండరు అడ్రస్సు చూస్తే, ఏదో కొత్త పేరు కన్పించింది. యాజులు గారు తేరుకునే లోగానే ఎమ్. వో. ఫారం మీద, రిజిష్టర్డు రశీదుల పైనా సంతకాలు పెట్టించుకుని "వస్తా! సార్!" అంటూ సైకిలెక్కిపోయేడు పోస్టుమేన్.

"పోస్ట్‌మేన్" కేకతో వంటింట్లో నుంచి వచ్చిన భార్య చేతిలో డబ్బు పెడ్తూ –"సుగుణా! నేను చెప్పలా! మన పెన్షను పంపించారు!" అన్నారు



ఇటీవల ఢిల్లీలో జరిగిన అఖిల భారత మేజిక్ పోటీలలో ప్రథమ బహుమతి పొందిన శ్రీ స. హెచ్. కృష్ణమూర్తి, హైదరాబాద్‌లోని స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియాలో పనిచేస్తున్న ఈయన గతంలో 500 కి పైగా ఇంద్రజాల ప్రదర్శనలని ఇచ్చి పలువురి ప్రశంసలని అందుకున్నారు.

యాజులు మేష్టారుగారు తన ఆశ్చర్యాన్ని అణచిపెట్టుకుంటూ.

"నాకు తెల్సండి! అన్నింటికీ ఆ స్వామే వున్నాడు!" అంటూ లోనకి హడావుడిగా వెళ్ళింది సుగుణమ్మ ఆ పంగనామాల దేముడికి దండం పెట్టటానికి.

ఆత్రం పట్టలేక, పార్శిలు విప్పిన యాజులుగారి చేతుల్లోకి పట్నంలో తను పోగొట్టుకున్న పెన్షను రికార్డూ తన భార్యకు కొన్ని మందులూ చెక్కు చెదరకుండా జాగ్రత్తగా పేకింగు చేసి మరి పంపించారు ఎవరో పుణ్యాత్ములు. వాటితో బాటు తన పేర ఓ కవరు కూడా వుండటం చూచి మరింత షాక్ తిన్నారు యాజులు మేష్టారు.

తన పేరున్న ఆ వుత్తరం విప్పి చదువుతూన్న యాజులగారి ముఖం వివర్ణమై చేతులు వణకసాగినై...

"నా ప్రియమైన నాన్నగారికి, అమ్మకూ నా హృదయ పూర్వక నమస్కారములు–

నేను మిమ్మల్ని అలా పిలవటానికి తగనేమో! అయినా మీ దురదృష్టాన్న మీ కడుపున పుట్టిన వాణ్ని. ఆనాడే! నేను మీ మాట వినుంటే, యీరోజు సమాజంలో అందరిలానే నేనూ తలెత్తుకుని తిరిగేవాణ్ని. కాని! నా బుద్ధి వక్రించింది. చదువు సంధ్యలకు బదులు, జులాయిఆటలు వంటపట్టినాయ్. ఆ రోజు పరీక్షల్లో కాపీ కొట్టూ పట్టుబడ్డాక, మీకు నా ముఖం చూపించలేక పట్నం వెళ్ళి రైలెక్కేసినా! ఆ రైల్లో టికెట్‌లేని నన్ను కొట్టి, ఓ అడవి లాంటి స్టేషన్లో అర్ధరాత్రి దింపేశాడు టి. సి.

దాంతో! నా కష్టాలు ప్రారంభమయినై. అలా!

పొరపాటు ఇప్పుడు చేస్తున్నావు. తెలిసో, తెలియకో చేసే పనుల వల్ల చాలా ప్రమాదం వస్తుంది."

"ఏవిఁటో అంతా అడవిగోడుగా వుంది."

"నీకలానే వుంటుంది. గొలుసు వేసినప్పుడు ఆ అమ్మాయి ముఖం చూచావా."

"చూశాను. ఏఁ.... ఆ అమ్మాయి శ్రీ మహాలక్ష్మిలా వుంది. గొలుసు వేదామనిపించింది. వేశాను. తప్పా.... పాపం. ఆడపిల్లలకి నగలంటే ఎంత మోజో నీకేం తెలుసు !?"

"అంతవరకే నీకు తెలిసింది. ఇదివరకు శోభ వస్తే కూడా ఇలాగే అన్నావు. ఇప్పుడేమో ఇదీ వరుస.... సరోజ ముఖాన్ని ఇదివరకెప్పుడూ నేనిలా చూడలేదు."

"ఎలా వుందేమిటి?"

"ఎలావుందో నీకేం తెలుసు.... లేనిపోని ఆశలు పెంచడం మంచిది కాదు, నేనింతకంటే ఏమీ చెప్పలేను...." అని అక్కడ ఆగకుండా వెళ్ళిపోయాడు తన ఆఫీసు గదిలోకి శ్యామం. వర్ధనమ్మకు కొడుకు మాటలు బోధపడలేదు. ఏదైనా విషయం వస్తే అదేదో తేలేవరకు వూరుకోదు. ఆమె తత్వం అలాంటిది. అక్కడితో ఆగక, కొడుకు వెంబడే ఆఫీసు గదిలోకి వెళ్ళింది.

"సగం, సగం చెప్పి వచ్చేశావేమిటిరా. నేనేమైనా పొరపాటు చేశానేమో చెప్పరాదూ, తెలుసుకుంటాను."

"అవునమ్మా, నేనన్నమాట నిజమే."

"ఏమన్నావు?"

"అసలు, ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు. సరోజ ఇక్కడకు రావడం ఇష్టం లేదని ఎందుకన్నావు?"

"నీవా పెళ్ళి కావలసిన వాడివి. ఆ అమ్మాయా ఈడొచ్చిన పిల్ల. తరచు వచ్చి నిన్ను కలుసుకుంటోంటే బాగుండదని అన్నాను."

"సరే, అంతవరకు బాగానే వుంది. మరివ్వాళవస్తే వడ్డన ఎందుకు చేయించావు? గొల్సు వేసి అందచందాలు ఎందుకు వర్ణించావు?"

"ఆడపిల్ల కాబట్టి అలా చేశాను. అయినా, ఆ అమ్మాయి ఎందుకోగాని నాకు నచ్చిందిరా. కలవాళ్ళయినా కాకపోయినా, మన వాళ్ళయితే ఈ పాటికి...."

"కోడలుగా చేసుకునే దానివి. అవునా?"

"నా మనస్సులో మాట గ్రహించావన్న మాట."

"ప్రయోజన మేముంది.... అయితే సరోజను పెళ్ళి చేసుకోమంటావా?"

"అదెలా కుదురుతుందిరా. వాళ్ళ కులం వేరుకదా....?"

"నీకు కులం కావాలా, అమ్మాయిలోని మంచితనం కావాలా?"

"రెండూ కావాలి."

"ఉహూఁ.... ఇంకేం కావాలేమిటి.... కట్నం.... నగలు....?"

తల్లికి కోపం వచ్చింది.

"ఏమిటిరా, పెద్ద.... హేళనగా మాట్లాడుతున్నావు. నేను మూర్ఖురాలి ననుకున్నావా. ఏదో ముచ్చటపడి అలా చేస్తే ఏమిటి మరి.... నీ సింగినాధం మాటలు.... నువ్వూను.... అసలు కామయ్యగారి సంబంధం ఎందుకు వద్దన్నావో చెప్పు. వాళ్ళ "బేబి" ఎంత బుద్ధిమంతురాలు. ఎంత అందగత్తె. కాళ్ళ దగ్గర కొచ్చిన సంబంధాన్ని తన్ని పారేస్తారా ఎవరైనా.... అందులోను దగ్గరి వాళ్ళు కూడాను."

"అయిందా నీ పురాణం. ఇక నేను చెప్పేది విను. కట్నం కోసమని పెళ్ళి చేసుకునేది లేదు. కులం ఒకటే అయితే అంతకన్నా చేసుకోను. నాకు ఇష్టం వచ్చినప్పుడు, నాకు నచ్చిన వాళ్ళను, నేను నచ్చిన వాళ్ళను చేసుకుంటాను.... సరా!"

"అవ్వ, అవ్వ..... అంతటి ప్రయోజకుడివైనావన్న మాట. నలుగురికీ చెబుతోంటే వట్టి కబుర్లే ననుకున్నాను. అయితే నీ ధర్మోపన్యాసాలు ఈ ఇంటిని ఇంతవరకు తెచ్చాయన్నమాట!"

శ్యామం వెంటనే ఇలా అన్నాడు –

"కుల, మతాల పేరుతో, డబ్బు, హోదాల పేరుతో అంతరాలు సృష్టించుకోడం కాదు. మన అంతర్యాలు మారాలి. అప్పుడే మనిషి.... మనిషితో పాటు సమాజమూ మారేది."

"ఒరే నాయనా, నీ నీతి బోధలు కట్టిపెట్టు. నా మాట విని బేబిని పెళ్ళి చేసుకో. నా భారం తీరిపోతుంది. మన కుటుంబాన్ని, కుల గౌరవాన్ని అప్రతిష్టపాలు చేయకు."

"నీవు ఏమైనా చెప్పు వింటాను. కాని కులం పేరు మాత్రం ఎత్తకు."

"ఏమో బాబు, నాకిక తెలియదు. నీ యిష్టం.... నీ కెలా మంచిదని తోస్తే అలాగే చెయ్. నాకు బాధ్యత వుంది కాబట్టి తెలిసినదేదో చెప్పాను."

శ్యామం తన పనిలో తల దూర్చాడు. తల్లి ఇంట్లోకి వెళ్ళిపోయింది. వెళ్ళిన కాసేపటికే మళ్ళీ ఏదో ఆలోచన వచ్చింది. అనుకున్నదిలా –

"అవునూ, ఇందాకను వాడేమన్నాడూ.... సరోజను చేసుకుంటానన్నాడా. ఊరికే అన్నాడా? నిజంగానా?.... మనసులో ఏమీ లేకుండానే అన్నాడా ఆ మాట. కొంపదీసి అంతపనీ చేయడు గదా! పైగా నన్నేమన్నాడూ.... కోడలిగా చేసుకోవాలని వుంది కదూ అని.... అవును.... నిజంగానే వాడికి సరోజ మీద మనసుపడింది. నాకు తెలుసు. నగలంటే ముచ్చటకదా అని గొలుసు వేస్తే, ఇక చేసుకున్నట్టేనా.... నేనేం వెర్రిదాన్నా. పెద్దదాన్ని గదా అని, ఆ పిల్ల గౌరవంతో మాట్లాడింది. బిడియపడింది. ఆ వయసులో ఏ పిల్లయినా అలాగే వుంటుంది. అంత మాత్రాన చూసిన పిల్లనల్లా చేసుకుంటామా.... ఏమైనా గాని, మన జాగ్రత్తలో మనం వుండాల్సిందే. ఆ సరోజ ఈసారి వస్తే గనక, ఖచ్చితంగా చెప్పేస్తాను రావద్దని.... ఏమైతే అవనీగాక...."

ఇలా, వర్ధనమ్మగారి ఆలోచనాపరంపరకు అంతు లేకుండా పోయింది. కొడుకుతో కూడా ఈ మాటలే చెప్పదలుచుకుంది. వంట ఇంట్లోకి వెళ్ళి గిన్నెలు ధమధమ లాడించింది.

(ఇంకావుంది)



# నాగుల చవితి

— శేఖర్..

Bathula


















# ఆలయాల నగ



ముక్తేశ్వర ఆలయం

ఒరిస్సా రాజధానియైన భువనేశ్వర్‌కు 'ఆలయాల నగరి' అని పేరు ఇక్కడ గలన్ని దేవాలయాలు భారతదేశంలో మరెక్కడా లేవు నగరం మొత్తంలో లక్షా పాతికవేల మందిరాలున్నాయి దాదాపు అన్నీకూడ శివాలయాలే అందుకనే ఈ నగరాన్ని 'భువనేశ్వర్ అంటారు దాదాపు రోజుకు పాతిక ముప్పయి మందిరాలు దర్శించ కలిగితే, ఇక్కడగల ఆలయాలన్నీ చూడటానికి పన్నెండు సంవత్సరాల కాలం పడుతుంది ఐతిహాసిక, ధార్మిక సాంస్కృతిక, వాస్తు, శిల్ప కళా వైవిధ్యం అన్ని మందిరాలలో వెల్లివిరుస్తూ ఉంటుంది

## లింగరాజ మందిరము

ఇది భువనేశ్వర్‌లోని ప్రధాన మందిరము. చాల పెద్దది కూడా! ఇందులోని మూలవరులను లింగరాజ్, శివ, కృత్తివాస, త్రిభువనేశ్వర అని కీర్తిస్తారు ఆలయ విస్తీర్ణం నాలుగున్నర ఎకరాలుంటుంది ప్రహరీ గోడ పొడవు 520 అ వెడల్పు 465 అ కలిగి ది చ ఆకృతిలో ఉంటుంది ఉత్తర, దక్షిణ, తూర్పు దిశలలో ద్వారాలున్నాయి తూర్పు ద్వారం నుండి యాత్రికులు ప్రవేశిస్తారు ఈ ఆవరణలో మొత్తం 108 ఆలయాలున్నాయి

లింగరాజమందిరం ఎత్తు 147 అ మూలవరులు 2 48 మి వ్యాసార్థము కలిగిన లింగాకృతిలో ఉంటారు క్రింద పానవట్టం స్త్రీ జననాకారంలో ఉంటుంది ఇది శివశక్తుల అభేదత్వానికి సంకేతం ఈ స్వామిని 'స్వయం భూ లింగం' అంటారు పైన లింగాకారం మాత్రమే కనిపించేటట్లు, మిగతా భాగాన్ని వస్త్రంతో కప్పి ఉంచుతారు. ఈ మందిరాంతర్భాగములుగ ఉత్తరం వైపు భగవతి, దక్షిణం గణపతి, పశ్చిమాన కార్తికేయుల ఆలయాలు నిర్మించబడినయి

కేసరి వంశీయుడైన యయాతి ఈ మందిర నిర్మాణం ప్రారంభించినట్లు, అతని మునిమనుమడయిన లలాటేందుకేసరి క్రీ శ 666లో నిర్మాణం పూర్తిగావించినట్లు స్థానికులు చెప్తారు క్రీ శ 792-811 సంవత్సరాల మధ్య కమలకేసరి అను రాజు భోగమండపాన్ని, 875-890ల మధ్య, విజయకేసరి పార్వతి మందిరాన్ని 1099-1104ల మధ్య, శాలిని కేసరిరాణి నాట్యమందిరాన్ని నిర్మించినట్లు కొందరు ఐతిహాసికులు భావిస్తున్నారు ఈ ఆలయం 11వ శతాబ్దంలోని నిర్మాణంగ మరికొందరు ఐతిహాసికుల కథనం

## శిల్పకళా వైవిధ్యం

ఈ మందిర కుడ్యాలపై కమనీయ శిల్పాలెన్నో మల్చబడినాయి పురోగమిస్తున్న సైన్యం షట్పురాణి సమేత చక్రవర్తి, రాజసభ వివిధ



లింగరాజ మందిర కుడ్యముపై శిల్ప కళా విన్యాసము

రీతుల ఆభరణాలు - దర్శకులను అచ్చెరువందిస్తాయి వాద్యబృందాలు, నాట్యశిల్పాలు, యువరాజు బృందము, వేటగాళ్ళు పొలం దున్నే రైతులు, వ్యాపారులు గృహిణులు ఆదిగాగల సమస్త సామాజిక జీవనం ఈ ఆలయ శిల్పాలలో వెల్లివిరుస్తుంది ప్రతి శిల్పంలో ఒక వినూత్న తేజస్సు, ఆనందం ప్రస్ఫుటమౌతాయి ఎక్కడా కూడ బీదరికం అసంతృప్తి, విచారగ్రస్త ముద్రలున్న శిల్పం కానరాదు

## అన్య దేవాలయాలు

పరశురామేశ్వర, శిశిరేశ్వర, బ్రహ్మేశ్వర మహేశ్వర,రాజరాణి, ముక్తేశ్వర, సిద్ధేశ్వర, కేదార-గౌరి, వీర హనుమాన్ మొదలయిన దేవాలయాలు ఒరియా శిల్పకళా ప్రాభవాన్ని చాటుతుంటాయి

వీనిలో ముక్తేశ్వర, సిద్ధేశ్వర మందిరాలు అణువణువు శిల్పకళా విన్యాసంతో అలరారుతుంటాయి ముక్తేశ్వర ఆలయం ఒరియా శిల్పకళకు పరాకాష్ఠ అనవచ్చును కుడ్యములపై

సిద్ధేశ్వర మందిరము



# భువనేశ్వర్



ప్రసిద్ధమైన లింగరాజ మందిరము

పంచతంత్రములోని అనేక గాథలు స్ఫురించేట్టు శిల్పాలు చెక్కబడినవి ఒరియా పండితుడైన విష్ణుశర్మ రచించిన 'కోతి - మొసలి' కథ కళ్ళకు కట్టినట్టుగా శిల్పాలు మల్చబడ్డాయి

. అనేక ఆలయాలతో పాటు భువనేశ్వర్‌లో బిందుసాగర్, దేవిపాదహార్, పాపనాశిని, కేదారగౌరి, బ్రహ్మకుండ్, గోసాగర్ కపిలహ్రదం మొదలయిన పవిత్ర సరోవరాలున్నాయి ఒక్కొ తీర్థానికి ఒక్కొ ప్రత్యేకత ఉంది 'కేదార-గౌరి కుండ్'లో స్నానమాచరించిన స్త్రీలకు సంతానం కలుగుతుందనే ప్రగాఢ విశ్వాసం యిక్కడి ప్రజలలో ఉంది

భువనేశ్వర్ ప్రాచీనకాలం నుండి మధ్య కళింగలో చాల ప్రాముఖ్యం వహించిన నగరం చుట్టుపట్ల లభించిన శిల్పాలు, నాణాలు, తామ్రపత్రాలు, శిలా శాసనాలు, యుద్ధ పరికరాలు, మొదలైన అనేక ప్రాచీన సాంస్కృతిక, ఐతిహాసిక కళాఖండాలు యిక్కడి వస్తుప్రదర్శనశాలలో భద్రపరుచబడి



ఖండగిరి గుహలు

ఉన్నాయి

## ఇతర దర్శనీయ ప్రదేశాలు

భువనేశ్వర్‌కు దక్షిణ దిశలో 'చండాశోకుడు' ధర్మాశోకుడుగ మారి 'బౌద్ధం' స్వీకరించిన పుణ్యస్థలి ధౌలి' ఉన్నది వాయువ్యంగా క్రీ పూ మొదటి శతాబ్దిలో ఆంధ్రుడైన ఖారవేలునిచే నిర్మింపబడిన హిందూ-జైన ధర్మాల సమన్వయ సంకేత క్షేత్రం -'ఉదయగిరి-ఖండగిరి' గుహలున్నాయి. ఉత్తరంగా 12 కి. మి దూరంలో దేశంలో కెల్లా పెద్దదయిన 'నందన కానన్' అనే విఖ్యాతమైన జంతుప్రదర్శనశాల ఉంది అందులో ప్రపంచంలో అరుదుగా కన్పించే రకరకాల పుష్పజాతులు, తెల్లని పులులు, తెల్లని మొసళ్ళు ప్రత్యేక ఆకర్షణ

భువనేశ్వర్‌కు ఆగ్నేయంగ 54 కి మి దూరంలో భారత దేశంలో నే అతి పెద్దదయిన జగన్నాథుని మందిరం ఉంది తూర్పుగ 65 కి. మి దూరంలో విశ్వవిఖ్యాతిగాంచిన కోణార్క సూర్యదేవాలయం సాటిలేని శిల్పకళా విశిష్టతను సంతరించుకుంది

## ఉత్సవములు

ప్రతి సంవత్సరం చైత్రమాసంలో శుద్ధ అష్టమినాడు జరిగే 'లింగరాజ రథయాత్ర' భువనేశ్వర్‌లో చాల ముఖ్యమయినది లక్షలాది యాత్రికులు ఈ యాత్రను విశేషంగా దర్శిస్తారు. శివునకు అత్యంత ప్రియమైన శివరాత్రి పర్వదినం ఈ నగరిలో ఎంతో వైభవంగా జరుపుతారు అన్ని ఆలయాలలో యాత్రికులు చేరి రాత్రి అంతా తమ ప్రక్కన ఘృత జ్యోతిని వెలిగించుకొని జాగరణ చేస్తారు

భువనేశ్వర్‌ను ఒకప్పుడు ఆంధ్రులు పరిపాలించినట్లు ఆధారాలున్నాయి ఇప్పటికీ కూడ భాషా విభేదం తప్పితే భువనేశ్వర్‌లో ఆంధ్రత్వం చాలవరకు కానవస్తుంది

## వసతులు

భువనేశ్వర్ విజయవాడకు 800 కి మి దూరంలో ఉంది బొంబాయి, కలకత్తా, మద్రాసు, హైదరాబాదు, ఢిల్లీ, త్రివేండ్రం మొదలయిన ప్రధాన నగరాలకు రైలు సౌకర్యముంది దేశంలోని అనేక ప్రధాన నగరాలకు విమాన సౌకర్యముంది

ఆధునిక వసతులతో కూడిన అత్యంత సుందరమైన రాష్ట్రప్రభుత్వపు అతిథిగృహంలో యాత్రికులు బసచేయవచ్చును రాజమహల్, పుష్పక్, కళింగ అశోక, కోణార్క, స్వస్తి, అనార్కలి, పూనం మొదలైన హోటళ్ళలో విశ్రాంతి తీసుకోవచ్చును. విజయవాడ నుండి చాల రైలుబండ్లు భువనేశ్వర్ వెళుతుంటాయి 'కోణార్క ఎక్స్‌ప్రెస్' అయితే ఆంధ్ర ప్రాంతం వారికి ప్రయాణం సౌకర్యవంతంగా ఉంటుంది కొంచెం త్వరగ తిరుగగలిగితే, మూడు రోజులలో భువనేశ్వర్, కోణార్క, పూరిలతో సహ దర్శించవచ్చును

**ఫోటోలు, వ్యాసం : కెప్టెన్ షేక్ మౌలాలీ**

ఉదయగిరి గుహలు



# దీపావళి కథలపోటీలో రు.650/- బహుమతి పొందిన కథ
# సుమతి

"ఏయ్ ముసిలోడా! బస్సు ఆపు!" చివరి సీటులో నుంచి కీచుగొంతు ఒకటి అరచింది.

బస్సు అప్పటి కింకా కడప పట్నం సరి హద్దులను దాటలేదు. అప్పటి కది మూడోసారి బస్సును ఆపడం.

కీచుగొంతు వ్యక్తి బస్సు కిటికీలో నుండే రోడ్డు ప్రక్కన అమ్మే పుచ్చకాయలను పావుగంట సేపు బేరం చేసి, ఎట్టకేలకు ఒక్కటి కొని "రేయ్! ముసిలోడా! పోనీయ్ బస్సును!" అని కేక వేశాడు.

ముసలాయన "రైట్", అన్నాడు బస్సు కదిలింది

ఆ బస్సులో ఉన్న వాళ్ళంతా కాలేజి లెక్చరర్లు వాళ్ళంతా కడపలో జరుగుతున్న ఇంటర్మీడియట్ స్పాట్ వాల్యుయేషన్ కోసం ఆంధ్రదేశం నాలుగు చెరగుల నుండీ అక్కడకు వచ్చారు బ్రహ్మంగారి మఠం చూద్దామని అంతా సరదాగా బయలుదేరారు

ఆ ముసలాయనకు అరవై అయిదేళ్ళకు తక్కువ ఉండవు నోట్లో రెండు మూడు పళ్ళ కంటే ఎక్కువ లేవు మాసిపోయిన తెల్లచొక్కా. చినిగి పోయిన లుంగి ధరించి ఉన్నాడు. వినయంగా మాట్లాడుతున్నాడు. చదువు లేకపోయినా సంస్కారం ఉన్న మనిషి లాగా కనబడుతున్నాడు.

"తాతయ్యా! దప్పిక అవుతోంది...నీళ్ళు ..!"

ఒక పదేళ్ళ పిల్ల ఆ ముసలాయన్ను చూచి నెమ్మదిగా అడుగుతోంది.

ఆ పిల్ల పేరు సుమతి. ముసలాయనకు సొంత మనుమరాలు

సుమతి కన్నుల్లో దైన్యమూ, భయమూ కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి.

ముసలాయన కిటికిలో నుంచి బయటకు చూశాడు. దగ్గరలోనే ఒక బావి కనిపించింది "ఓల్డాన్" అని కేక వేశాడు. బస్సు ఆగింది. మనుమరాలి చేతిలోని ప్లాస్టిక్ వాటర్ బాటిల్ తీసుకొని బస్సు దిగిపోయి, నీరు నింపుకొని మరునిమిషంలో తిరిగి వచ్చి ముసలాయన బస్సు బయలుదేర దీశాడు

కాని ఈ కాసేపట్లోనే బస్సులో ఉన్న పెద్ద మనుషులు నానాగోలా చెశారు. ముసలాయన తిరిగి రాగానే అతడిని కాకులు పొడిచినట్లు పొడిచారు.

'ఒరేయ్' ముసలాడా' ఎంత సేపు? ఇట్లా చిటికి మాటికి ఆగుతూ పోతే ఇహ బ్రహ్మంగారి మఠానికి ఎప్పుడు చేరతాం?"

"ఇంకోసారి ఆపావంటే నిన్ను బయటకు నెట్టేసి మేమే వెళ్ళి వస్తాం!"

తలా ఒక విధంగా అంటున్నారు.

ముసలాయన కాసేపు తల వంచుకొని, నెమ్మదిగా తన మనుమరాలి వైపు చూశాడు

సుమతికి ఏడుపొక్కటే తక్కువ.

" చూశావా! నీ వలన ఎన్ని తిట్లు తింటున్నానో! నావెంట రావద్దంటే వినవైతివి....ఇప్పుడు చూడు!" అంటున్నాయి ముసలాయన కనుబొమ్మలు.

'.తాతయ్యా' నన్ను మన్నించు!.. ఏదో...బ్రహ్మంగారి మఠాన్ని ఒక్కసారి చూడాలని వచ్చా!..కానీ ..నా వలన నీకు ఇంత అవమానం జరుగుతుందని అనుకోలేదు' అంటున్నాయి సుమతి కన్నులు

ఈ ముసలోడు నా కొంప ముంచాడురా నాయనా' ఒరేయ్ ముసలాడా' ఎక్కడో తూకానిక కొనుక్కు వచ్చిన తుక్కు బస్సు వేసి మా ప్రాణాలు తీస్తున్నావా?'

సీటు రేకు పట్టుకొని పంచె కొద్దిగా చినగడం వలన ఓ పంతులుగారు పెడబొబ్బలు పెట్టసాగారు.

ముసలాయన ఆయన దగ్గరకు పోయి దండాలు దస్కాలు పెట్టి శాంతింప చేశాడు.

తాతయ్య పడే తిప్పలన్నీ సుమతి తిలకిస్తూనే ఉంది. ఆ పిల్ల చిన్నబుర్రలో తమ యింటి పరిస్థితులు మెదిలాయి.

సుమతి తండ్రి స్కూలు టీచరుగా పని చేసేవాడు. ఓ సారి స్కూలు పిల్లల వెంట విజ్ఞాన యాత్రకు పోయిన సుమతి తండ్రి మరి ఎన్నడూ తిరిగిరాని చోటుకే వెళ్ళిపోయాడు. అలంపురం క్షేత్రం దగ్గర విద్యార్థి ఒకడు తుంగభద్రలో పడగా అతడిని రక్షించడానికి నీటిలోకి దూకి సుమతి తండ్రి ప్రాణాలు కోల్పోయాడు. దీనితో ఆ కుటుంబ భారమంతా సుమతి తాతయ్యే భరించవలసి వచ్చింది. కడప నుండి అడపాదడపా బ్రహ్మంగారి మఠానికి, పుష్పగిరి పీఠానికి బస్సులు వేస్తూ, ముసలాయన సంసారాన్ని గుట్టుగా నెట్టుకొని వస్తున్నాడు.

సుమతికి తాతయ్య వెంట బస్సులో పోయి ఒక్కసారైనా బ్రహ్మంగారి మఠాన్ని చూడాలనే కోరిక చాలా రోజుల నుంచి వుంది.

చివరికి ఇవాళిటికి కుదిరింది.

రెండు రోజుల నుండి అదే పనిగా అడగ్గా అడగ్గా చివరకు తాతయ్య ఒప్పుకున్నాడు.

"ఏయ్! లే ఇక్కడ నుంచి!"

తన ప్రక్కనున్న పెద్దమనిషి గదిమేసరికి సుమతి గజగజ వణుకుతూ లేచి నిలుచుంది.

మాకే స్థలం చాలక చస్తూంటే మళ్ళా నువ్వొక దానవా? అని గొణుగుతూ ఒక బారి దేహం సుమతిని లేపి, రెండు సీట్ల స్థలంలోనూ తానే కాళ్ళు బార్లా చాపి, తల వెనక్కి వాల్చి కూర్చుని కాసేపు కునికిపాట్లు పడి అంతలోనే గురక పెట్ట సాగాడు

ముసలాయన ఈ ఇబ్బంది వస్తుందని మొదటి నుంచి భయపడుతూనే ఉన్నాడు అందుకే తానెప్పుడూ కూర్చోడు పసిపిల్ల గదా ఎవరూ లేపర్లే అనుకున్నాడు

ముసలాయనే సుమతి వైపు నిస్సహాయుడై చూశాడు

సుమతి ఏమనుకుందో ఏమో గాని నెమ్మదిగా పోయి డ్రయివరు ప్రక్కకు చేరి నిలుచుంది

ఆ మరు నిమిషంలోనే సుమతి తన కష్టాలనూ అవమానాలనూ మరచిపోయింది

సుమతి నిశితంగా రోడ్డు వైపే చూడసాగింది రోడ్డు మీద ప్రతి గతుకూ ప్రతి మలుపూ ఆ చిన్నారి మనసులో వింత అనుభూతులను కలిగిస్తున్నాయి ఒక గొప్ప సస్పెన్స్ చిత్రాన్ని చూస్తున్న అనుభూతితో ఆ బాలిక దారిని చూడసాగింది

ఒక్కోచోట ఆ పిల్ల అనుకొన్న రీతిలో రోడ్డు మలుపులు తిరుగుతోంది కొన్నిచోట్ల అనుకొన్న



## దీపావళీ!

రమ్యంగా అలంకరించుకొని
క్రమం తప్పకుండా వచ్చావా
దీపావళీ!
నీకు స్వాగతం ఇవ్వడానికి
ఎవ్వరూ రాలేదని చిన్నబోతున్నావా?
పండుగ వస్తోందంటే
గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయ్
భయంతో!
తారాజువ్వల్లా,
ధరలు ఆకాశాన్ని తాకుతుంటే
విష్ణుచక్రాల్లా సమస్యల విషవలయాల్లో
మనిషి గిర్రున తిరుగుతుంటే
వెలగని చిచ్చుబుడ్డిలా ఫలించని కోరికలు
"తుస్సు" మంటుంటే,
నూనెచాలక కళావిహీనమైన ప్రమిదలాగ
బాధలతో వెలవెలపోతూ
నీకేమని చెప్తాడు స్వాగతం!
ఎలా తీరుస్తాడు నీ అభిమతం!

– కొడిమెల శ్రీరామమూర్తి

విదంగా గాక ఆశ్చర్యకరమైన రీతిలో రొద్దు కనుపింపసాగింది

సుమతి ఒక్కసారిచూచినా, విన్నా, చదివినా ఆ విషయాన్ని బాగాగుర్తుంచుకొంటుంది తరగతిలో ఫస్టుగా వస్తూ ఆ పిల్లకు ఫస్టుమార్కులే!

ఇప్పుడా పిల్ల మనసంతా రొద్దు మీదే కేంద్రీకరించి ఉంది

ముసలాయన ఒక్కొక్కళ్ళ దగ్గరకు పోయి తనకు రావలసిన డబ్బులు వసూలు చేస్తున్నాడు

పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకటం లాగా ఉంది ఆయన పని అంతా ఆయనను ఆటలు పట్టించే వాళ్ళే! కొంతమంది ఇస్తున్నారు కొంతమంది ఇవ్వకుండానే 'ఇప్పుడే గదా ఇచ్చాం!' అంటున్నారు ముసలాయన ఎంతో ఓర్పుతో వ్యవహరిస్తున్నాడు మొత్తం మీద సగం మంది డబ్బులివ్వలేదు తిరిగి లాడ్జింగ్ చేరిన తరవాతగాని ఇవ్వం!' అని వాళ్ళు ఖండితంగా చెప్పేశారు

పొద్దు బారెడు ఉండగానే బస్సు బ్రహ్మంగారి మఠం చేరింది బిలబిలమని అందరూ బస్సు దిగి క్షేత్రంలోకి ప్రవేశించారు సుమతి కాళ్ళు కడుక్కొని శ్రద్ధాభక్తులతో లోనికి పోబోయింది తీరా ద్వారం దగ్గరకు పోయిన తరువాతగాని తెలిసి రాలేదు. ప్రవేశ రుసుం చెల్లించి టికెట్ కొనుక్కొంటేగాని ప్రవేశం లేదని!

అంతా టికట్లు కొనుక్కొని లోనికి పోతున్నారు ఇనుప కటకటాల నుండి లోనికి చూచింది సుమతి లోపలి దృశ్యాలు సరిగా కనబడటం లేదు తాతయ్య కోసం బయటకు చూచింది అతడు బస్సు దగ్గరే కూర్చొని డబ్బు లెక్కపెట్టుకుంటున్నాడు ఒక్కొక్క రూపాయనీ తడిమి తడిమి పట్టుకొని, ఆప్యాయంగా మడిచి జేబులో పెట్టుకుంటున్నాడు

ఒక్క రూపాయి సంపాదించాలంటే ఎంత కష్టం! తాతయ్య ఈ వయస్సులో గూడా తమ కోసం ఎంత కష్టపడుతున్నాడు! సుమతికి తల్లీ, తమ్ముళ్ళూ గుర్తుకు వచ్చారు తాతయ్య ఇన్ని తిట్లు తిని, ఇన్ని అవమానాలు పొంది నాలుగు డబ్బులు సంపాదించుకొస్తే తాము హాయిగా ఇంటి దగ్గర కూర్చుని రోజులు గడుపుతున్నారు

సుమతి లోనికి పోయే ప్రయత్నం విరమించింది.

ఆ పిల్లకు బ్రహ్మంగారి చరిత్ర గుర్తుకు వచ్చింది తాతయ్యకు బ్రహ్మంగారి చరిత్ర బాగా తెలుసు ఇంట్లో తను ఏదైనా కథ చెప్పమని అడిగితే ఆయన చెప్పేది బ్రహ్మంగారి కథనే!

సుమతి బ్రహ్మంగారి సమాధికి బయట ఉన్న ఒక్కొక్క రాతినీ భక్తితో స్పృశిస్తోంది.

ఈ ప్రాంతమంతా ఆ మహనీయుని పాదధూళిచే పవిత్రమైనదే!

ఈ భావం రాగానే సుమతి భక్తితో ఎదురుగా ఉన్న గోపురానికి నమస్కరించింది

ఏయ్! పిల్లా! దొంగ దండాలు మాని వచ్చి బస్సెక్కు! ఒక విజ్ఞాన ఖని కేక వేయడంతో

## సుమతి

సుమతి ఇహలోకంలోకి వచ్చింది

సుమతి బస్సు ఎక్కింది కక్కని గుడి, పోలేరమ్మ గుడి చూచినతరవాత, బస్సు సిద్ధయ్యగారి సమాధికి బయలుదేరింది

సుమతి ఆ పరిసర ప్రదేశాల నన్నింటినీ భక్తి భావంతో పరిశీలించసాగింది ఆ పసి మనసు పరిపరివిధాలా పోయింది

అవును ఈ ప్రాంతంలోనే బ్రహ్మంగారు పోలేరమ్మను నిప్పు తెమ్మని ఉంటారు -

ఈ ప్రాంతంలోనే కక్కడు భార్యను కోసి, తన అజ్ఞానానికి పరితపించి బ్రహ్మంగారిని శరణు వేడి ఉంటాడు

ఇక్కడే సిద్ధయ్యగారిని బ్రహ్మంగారు శిష్యునిగా స్వీకరించి ఉంటారు

. చివరకు సిద్ధయ్యగారు ఇక్కడ సమాధి అయ్యారన్నమాట! అబ్బ! ఎంత దూరం! ఆ రోజుల్లో ఈ మహానుభావులు ఇంతంత దూరం ఎలా వచ్చేవారో!

సుమతి చిన్నారి హృదయం భక్తి భావంతో నిండిపోయింది

చీకటి పడుతోంది అంతా బస్సు ఎక్కారు బస్సులో ఉన్న వాళ్ళంతా పరమ పట్టభద్రులు కొందరు మరి ఎక్కువ చదివి పరిశోధనలు చేసి పట్టాలు పుచ్చుకున్నారు వాళ్ళకి అసలు ఈ బ్రహ్మంగార్లూ, భగవంతుళ్ళూ నచ్చరు ఏదో విలాసయాత్ర కోసం వచ్చారే గానీ మరోటిగాదు వాళ్ళు 'ఏమిటో మూఢ నమ్మకాలు ప్చ్!' అంటూ అడపాదడపా తమ హేతువాద దృక్పథాన్నీ, తెలివితేటల్నీ చాటుతూనే ఉన్నారు బ్రహ్మంగారి మఠంలోనూ, పరిసర ప్రాంతాల్లోనూ వాళ్ళకి చూడదగ్గ ప్రదేశమంటూ ఏం కనిపించలేదు

ఏముందీ ఇక్కడ? అనవసరంగా' వచ్చాం! అన్నాడొక మేధావి

ఏమీ లేదనుకుంటే లేదు! ఉన్నదనుకుంటే ఉంది!' డ్రయివరు గొణుగుతూ బస్సు స్టార్టు చేశాడు

బస్సు డొంకరొద్దు వదిలి తారురోడ్డు ఎక్కింది.

లోకాన్ని గాఢాంధకారం ఆవరించింది చుక్కలు మినుకు మినుకు మంటూ తమ ఉనికిని మాత్రమే చాటుకోగలుగుతున్నాయి

రోడ్డు ప్రక్క పొదరిళ్ళ నుండి అప్పుడప్పుడు మిణుగురు పురుగులు మాత్రం మిలమిలలాడుతున్నాయి ఎక్కడో దూరంగా విసిరి వేసినట్లుగా ఉన్న గ్రామాల్లో నుంచి దీపపు వెలుగులు స్పష్టాస్పష్టంగా కనబడుతున్నాయి

హఠాత్తుగా బస్సు హెడ్ లైట్లు ఆరిపొయ్యాయి డ్రయివరు కంగారుగా బస్సును ఆపాడు

బస్సులో ఉన్న పెద్దమనుషుల గుండెలు ఝల్లుమన్నాయి

కాళరాత్రి కటిక చీకటి

అడపాదడపా ఆర్టీసీ బస్సులు ఆ దోవన పోతున్నాయి చెయ్యెత్తితే ఒక్కటీ ఆగటం లేదు

డ్రయివరూ క్లీనరూ ఏవో తిప్పలు పడుతున్నారు అదృష్టవశాత్తూ ఒక పంతులుగారి దగ్గర టార్చి లైటు ఉంది దాంతో చాల సేపు పరిశీలించి 'మావల్లగాదు అని డ్రయివరు తేల్చి చెప్పేశాడు

ఇప్పుడెలా? ఈ నిర్జన ప్రదేశంలో రాత్రంతా జాగరణ చేయవలసినదేనా!

కొందరికి దారి దోపిడీ దొంగల ఉదంతాలు గుర్తుకు వచ్చి, ఉంగరాలూ, గడియారాలు తడుముకుంటున్నారు

మరికొందరికి అప్పుడే నాలుకలు అర్థంటుగా పిడచగట్టుకొని పోయి విపరీతమైన దాహం వేసి, సుమతి దగ్గరున్న వాటర్‌బాటిల్ లాక్కొని నిమిషంలో దాన్ని ఖాళీ చేశారు

కాసేపు నిశ్శబ్దం

ఎవరి ఆలోచనల్లో వాళ్ళు ఏం చేయాలో ఎవరికీ పాలు పోవడం లేదు ఛడామడా ముసలాయన్ని తిట్టి పోశారు తిట్టి తిట్టి అలిసి పోయి నోరు మూసుకొని కూర్చున్నారు

ఒక ప్రక్క భయం ఒక ప్రక్క విసుగు నిరాశ ఆకలి దప్పిక ఒకరి ముఖం ఒకరు చూచుకోవడానికి కూడా వీల్లేదు కటిక చీకటి!

తాతయ్యా! నేను దారి చూపిస్తా!'

ఆ నైరాశ్య గాఢాంధకారంలో ఆశాకిరణంలా ఓ మృదువైన గొంతు పలికింది

ఆ గొంతు సుమతిది

'ఎలా?

–అని తాతయ్య అడగలేదు అతడికి తెలుసు– సుమతి తనకు చేతగాని పనిలో జోక్యం చేసుకోదని బహుశా తన మనుమరాలు వచ్చేటప్పుడే దారి బాగా గుర్తుపెట్టుకొని ఉంటుంది. డ్రయివరు ఈ రూటుకు కొత్తగాబట్టి ఇప్పుడు సుమతి సహాయం తీసుకుంటే మంచిదే!

ముసలాయన డ్రయివరుతో ఏదో మాట్లాడాడు క్లీనరు టార్చిలైటు పట్టుకొని బస్సుపై కెక్కాడు వెనుక నుండి వచ్చే వాహనాలు తమ బస్సును ఢీకొట్టకుండా, క్లీనరు టార్చిలైటును ఆర్పుతూ వెలిగిస్తూ అక్కడ కూర్చున్నాడు

బస్సు నెమ్మదిగా బయలు దేరింది

అంతటి చీకటిలో గూడా రోడ్డు ఉన్న ప్రాంతం మాత్రం ఒక చార లాగా కనబడుతూనే ఉంది

వెధవది నిజంగానే దేవుడున్నాడా ఏంటి కొంప దీసి బ్రహ్మంగారికి నిజంగానే మాహాత్మ్యం ఉందా

బస్సులో ఉన్న కొందరి బుర్రల్లో ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయి

ఆ వీరబ్రహ్మేంద్రస్వామి దయ వలన ఎట్లాగో అట్లాగా కడప చేరుకొంటే కొందరు మనస్సులో నే దేవుడికి మొక్కుకుంటున్నారు

డ్రయివరు జాగ్రత్తగా సుమతి చెప్పిన గమనికలను అనుసరించి బస్సు నడుపుతున్నాడు

మామయ్యా ఇక్కడ పల్లం ఆ ప్రక్కనే మలుపు నెమ్మది నెమ్మదిగా జాగ్రత్త ఈ ప్రక్కనే ఓ పెద్ద గొయ్యివుంది

ఇలా సుమతి మార్గదర్శకత్వం నెరుపుతూ ఉండగా బస్సు పోతోంది

బస్సులో కూర్చున్న వాళ్ళలో సుమతిని అభినందించని వాళ్ళు లేరు

ఇంత చిన్నపిల్లకు ఎంత పెద్ద జ్ఞాపక శక్తి! చ! చ! ఈ చిన్న పిల్ల విషయంలో తామెంత కఠినంగా ప్రవర్తించారు, నిజంగా ఆ వీరబ్రహ్మేంద్రస్వామే ఈ పిల్లలో ప్రవేశించి తమకు సాయం చేస్తున్నాడు

వారి మనసుల్లో సుమతి యెడ కృతజ్ఞతా వాహనులు పొంగి పొర్లాయి

అప్పుడప్పుడూ వెనుకనుండి వచ్చే బస్సులూ, ముందునుండి వచ్చే లారీలూ కొంత వెలుగును ప్రసాదిస్తున్నాయి

డ్రయివరు మావయ్యా జాగ్రత్త జాగ్రత్త! అక్కడే చెరువుంది! సుమతి చేసిన హెచ్చరికతో డ్రయివరు బ్రేకులువేసి బస్సు ఆపి, క్లీనరును ముందుకు పంపి, టార్చి లైటు వెలుగులో నెమ్మదిగా ఆ ప్రాంతంనుంచి బస్సును బయటకు నడిపించాడు

క్షణకాలంలో జరుగబోయే ప్రమాదాన్ని పసిగట్టి తమ ప్రాణాలను కాపాడిన సుమతికి ఏ మిచ్చినా ఋణం తీరదని ఎవరికివారు మనసులో అనుకున్నారు

దూరాన విద్యుద్దీపాల వెలుగు కనబడింది

'మైదుకూరు' ఎవరో పెద్దగా అరిచారు

అంతా గట్టిగా ఊపిరి పీల్చి అమ్మయ్య' అనుకున్నారు

ఇక మళ్ళీ బస్సులో మాటలు మొదలయ్యాయి వాళ్ల సంభాషణ బస్సు ప్రయాణం గూర్చి మొదలై, బ్రహ్మంగారి మీదగుండా ఆకలి మీదకు మళ్ళింది

'మైదుకూరిలో మంచి హోటళ్ళుంటాయా?

"మంచో చెడో ముందు ఏదో ఒకటి లోపలికి పడితేగానికుదరదు'

టైమెంత?

పదవతూంది!

అయితే పరవాలేదు మీల్సు దొరుకుతుంది

ఈ రోడ్డుప్రక్కన మాంచి నాన్ వెజిటేరియన్ హొటల్ ఒకటి ఉందటగా?

ఇలా భోజనాన్ని గూర్చి చర్చలు సాగుతూ ఉండగానే బస్సు మైదుకూరులో ఆగింది

భోంచేసే వాళ్ళు వెళ్ళిరండి! ఈ లోపల నేను బండిని మెకానిక్కుకు చూపించుకొని వస్తా! డ్రయివరు టీ బంకులోకి దూరుతూ కేక వేశాడు

అంతా బిలబిలమని బండిదిగారు ఇక ఆ బస్సు బాగయినా, కాక పోయినా వాళ్ళకు పరవాలేదు ఎలాగో అలాగా కడపకు చేరవచ్చు!

సుమతికి ఇప్పుడు కూర్చోవడానికి చోటు దొరికింది ఆ పిల్లకు కాళ్ళు పీక్కుపోతున్నాయి మద్యాహ్నం నుంచి నిలుచొనే ఉంది!

ఆ పసిపిల్ల పొద్దుటి నుంచి ఏమైనా కాస్త తిన్నదో లేదో ఆ సంగతి పట్టించుకొన్న వాళ్ళే లేరు

సుమతికి నిద్ర ముంచుకొని వస్తున్నది తన నెవరూ పట్టించు కొన లేదనే బాధ ఆమెకు లేదు

తాను చెయ్యగలిగినది చేసింది

అందుకు ప్రతిఫలంగా ఎవరి కృతజ్ఞతలనూ ఆ బాలిక ఆశించలేదు

వేళ మించి పోవడంతో ఆకలి చచ్చి పోయినట్లయింది

కొద్దిగా దప్పిక వేస్తున్నట్లున్నది సుమతి వాటర్ బాటిల్ చూచుకొంది చుక్క గూడాలేదు నీళ్ళకోసం దిగితే తాతయ్య కొప్పడతాడేమో

పాపం! తాతయ్య! తమ కోసం ఎన్ని కష్టాలు పడుతున్నాడు! నాన్నకు చదువు చెప్పించడానికి ఎన్నో తిప్పలు పడ్డాడట తాతయ్య అమ్మమ్మ, నాయనమ్మ ఎప్పుడూ తాతయ్య సంగతే చెబుతుంటారు తనకు ఇప్పుడు ఇంత ముసలి తనంలో గూడా ఆయనకు శ్రమ తప్పలేదు నాన్న ఉంటే తాతయ్య హాయిగా ఈ పాటికి రామా కృష్ణా అంటూ ఇంటిదగ్గరే విశ్రాంతి తీసుకుంటూ ఉండేవాడు తమ కోసం తాతయ్య ఇవాళ ఎన్ని తిట్లుతిన్నాడు ప్రతిరోజా ఇంతే కాబోలు మొత్తం ఎన్ని తిట్లో తాతయ్యా! నువ్వే మాకు దేవుడివి!

సుమతికి తాతయ్య వీరబ్రహ్మేంద్ర స్వామిలాగా కనిపించాడు

మా తాతయ్య బ్రహ్మంగారు!

సుమతి బస్సు సీట్లో పండుకొని కలవరిస్తోంది

సుమతీ! అమ్మా సుమతీ!

సుమతి కళ్ళు తెరచింది తాతయ్యా! అన్నది భక్తితో తాతయ్య సుమతి తల నిమురుతున్నాడు

తాతయ్యా! సుమతి తాతయ్య కళ్ళలోకి చూచింది మెకానిక్ రిపేరు చేయడం పూర్తయింది బస్సులో లైట్లు వెలిగాయి ఆ వెలుగులో తాతయ్య కన్నుల్లో మిలమిలలాడే కన్నీటి బిందువులను సుమతి చూచింది

ఏమిటి తాతయ్యా! ఏడుస్తున్నావా?

లేదమ్మా సుమతీ! ఏమీలేదు గద్గద స్వరంతో కన్నీళ్ళు తుడుచుకుంటూ, తన చేతిలోని కూల్‌డ్రింకు సీసాను సుమతి నోటి కందించాడు తాతయ్య! □



## పాలాక్షుని హోరి

## భర్త ఆగ్రహం – భార్య పరలోక యాత్ర!

మదనపల్లికి చెందిన 40 ఏళ్ళ నరసింహులు ఎప్పుడూ తన అత్తగారు తనని గౌరవించడం లేదని, అవమానపరుస్తుందని భార్యతో పోట్లాట పెట్టుకునే వాడట దానికి అతని బార్య 32 ఏళ్ళ వెంకటమ్మ ఎదిరించి, తన తల్లిని ఏమన్నా అంటే వూర్కునేది కాదట ఈ వాగ్యుద్ధంతో నరసింహులు అప్పుడప్పుడు భార్య మీద చేయి చేసుకునే వాడట కూడాను ఒకనాటి రందిలో అతనికి ఆవేశం పెచ్చుపెరిగి, తన బార్యను కత్తితో పొడిచి, చంపి, పారిపోయాడట

## పరువు తీసిన తండ్రి హత్య!

చెంగంకు చెందిన నాగప్పాడిలో మన్న గవుండర్‌కు ఇద్దరు బార్యలూ, రెండు కాపురాలూనట ఆతడు తన ఆస్థిని వారికి పంచేసి, తాను చిన్న భార్య యింట్లో వుంటున్నాడట ఒకనాడు ఆయన తన పెద్ద భార్య పెద్ద కొడుక్కు రాసిచ్చిన పొలంలో వున్న వో తాటి చెట్టు ఆకులు కోశాడట దాని కాతని పెద్ద బార్య పెద్ద కొడుకు చిన్నప్పయన్ అడ్డొచ్చి, తంతాను పొడుస్తాను అని ఆర్భాటం చేశాడట ఈ విషయం ఆ మన్న గవుండరు పోలీసులకు రిపోర్టు యిచ్చాడట వారొచ్చి చిన్నప్పయన్‌ను విచారణ చేసి వెళ్ళేసరికి తన బ్రతుకు నడిబజార్లో కన్న తండ్రే పారేశాడన్న ఆత్రంతో ఆ రాత్రి నిద్రపోతూన్న మన్న గవుండర్ పీకకోసి, చంపేశాడట

## ఈత తెచ్చిన తంటా!

చెంగంకు చెందిన మేల్‌పాలయంలో 40 ఏళ్ళ రవిచంద్రనుకు, ఆతని బార్య 38 ఏళ్ళ విజయలక్ష్మికి అనుదినం దరిద్రం తెచ్చిన తగాదాలుండేవట రవిచంద్రను వో హోటల్లో రోజు కూలిగా పని చేసేవాడట వీరికి 13 ఏళ్ళ సురేష్, 6 ఏళ్ళ కార్తికేయన్ అనే కొడుకులూ, 9 ఏళ్ళ కల్పన, 4 ఏళ్ళ గాయత్రి అనే యిద్దరు కూతుళ్ళు వున్నారట సురేష్ లాటరి టిక్కట్లమ్మేవాడట ఒక రోజు వచ్చిన పోట్లాటలో విజయలక్ష్మి తన బర్త, కొడుకు సురేష్, బయటకు వెళ్ళాక, మిగిలిన ముగ్గుర్ని తీసుకుని, వూరు చివర మోట బావిలో వారిని పడేసి, తానూ దూకేసిందట తనకూ, 6 ఏళ్ళ కార్తికేయనుకూ యీత వచ్చినందు వల్ల వారిద్దరూ చావలేదట ఆ తల్లికి చట్టం యావజ్జీవ కారాగార శిక్ష బహూకరించిందట

## అత్యధిక సర్క్యులేషన్ గల పత్రికలు!

1982 నాటి లెక్కల ప్రకారం బారత దేశంలో అత్యదిక సర్క్యులేషన్ కలిగి, ఒకే చోటు నుంచి ప్రచురణ అయ్యే దినపత్రిక ఆనందబజార్ పత్రికట ఇది 4,06,276 కాపీలు అమ్ముడు పోతుందట కొట్టయం నుంచి వెలువడే మళయాళ మనోరమ అనే వారపత్రిక 5,77,730 కాపీలమ్ముడు పోతుందట

## అత్యధిక వయస్సున్న మహిళ!

1984 లోక్‌సబ ఎన్నికలలో పూనాలోని రాజేంద్ర ప్రసాద్ ప్రయిమరి స్కూలులో జరిగిన పోలింగులో 128 ఏళ్ళ తనూబాయ్ మలహరి ఇంగ్వాలే వచ్చి వోటేసి వెళ్ళిందట ఈమె మన బారత దేశంలో అత్యదిక వయస్సున్న మహిళట

## ధూమపాన ప్రియులకు ఊక పొగ సన్మానం!

మానా మదురై గ్రామవాసులంతా చేరి ఆ వూరిలో ఎవరూ పొగ త్రాగకుండా నిషేధించి, అందుకు వలసిన జాగ్రత్తలు తీసుకుంటున్నారట ఆ వూర్ని అజ్ఞమిరి ఏ నరుడైనా ధూమపానం చేస్తే, అతగాడిని వో గదిలో పెట్టి, ఆ గదిలోకి ఊకపొగను గుప్పున పంపుతారట బాబోయ్, అమ్మోయ్ అన్నాక, బుద్ధి వచ్చిందని ప్రకటించాక, తలుపులు తెరుస్తారట

## అత్తింటి ఆరళ్ళకి మరో యువతి బలి!

చిత్తూరు పూతలపట్టు గ్రామానికి చెందిన 20 ఏళ్ళ పరంధామరెడ్డి అనే అతను సెప్టెంబరు 2వ తేదిన శ్రీరామపురానికి చెందిన 19 ఏళ్ళ వసంత అనే ఆమెను పెళ్ళాడట పెళ్ళికి 10 వేలు కట్నంగా యివ్వడానికి వొప్పుకున్న వసంత తండ్రి ఆ సమయానికి వో అయిదు వేలిచ్చి, మిగతా డబ్బు త్వరలో సర్దుతానని మాటిచ్చాడట కాపరానికి వచ్చిన వసంతను ఆమె అత్తగారు (విధవ) నవనీతమ్మ, ఆవిడ పెద్ద కూతురు (విధవ) సుజాతా కలసి రోజూ యీ కట్నం విషయం దెప్పి, నానా బాధలూ పెట్టేవారట వసంత వాటిని ధైర్యంతో ఎదుర్కొని, ఎదిరించి సమాదానం చెప్పేదట దాంతో అహం దెబ్బతిన్న ఆ యిద్దరూ ఆమెను సాయం పట్టి నూతిలో పడేసి చంపేశారట

## వరుణదేవుని కరుణకై గాడిదల పెళ్ళి!

కర్నాటక బెల్గాంకు చెందిన కట్టకోల్ గ్రామంలోని వ్యవసాయదారులు తమ పంటలకు కావాల్సినంత వాన కురవకపోతే వారు గాడిదలకు శాస్త్రోక్తంగా పెళ్ళి చేసి వరుణదేవుని ప్రార్థిస్తారట ఆనాటి నుంచీ వో వారంలో వాన ఝూమ్మని కురుస్తుందట ఇప్పటికీ యిది జరుగుతూనే వుందట □













డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

## 12

భవభూతికి ఒక ఉత్తరం వచ్చింది అందులో విభూతి, గజ్జెల గుర్రం అని వ్రాసి వుంది అంతే మరేమిలేదు ఈ మాటలకు అర్థం ఏమిటో అతనికి వెంటనే స్ఫురించలేదు. దానిని వాత్సాయనశర్మకు చూపిద్దామా అనుకున్నాడు. కాని చూపించలేదు. ఒకనాడు భవభూతి రవీంద్రభారతిలోని ఒక సభకు హాజరయి రాత్రి పది గంటలు దాటిన తర్వాత ఇంటికి వెళ్ళాడు అప్పటికి నగరమంతా సద్దుమణిగింది వాత్సాయనశర్మ కవుల కళాశాలలో చదువుతున్న ఇద్దరు విద్యార్థులానాడు ఇంటికి వెళ్ళలేదు వాళ్ళు కళాశాలలోని గదిలో పడుకున్నారు. గదంటే గదికాదు వసారాలాంటి చోటు అక్కడికి గాలి బాగావస్తుంది ఆ పక్క నుండి మెట్లెక్కి మేడమీదికి పోవాలి భవభూతి అక్కడిదాకా వచ్చాడు. వారి మాటలు స్పష్టంగా అతనికి వినబడుతున్నాయి మన గురువుగారికి భవభూతికి ఏమిట్రా సంబంధం? ఒకడు ప్రశ్నించాడు "సంబంధమంటే సంబంధమే లేదంటే లేదు ఈయన ఆయనను అన్నా అని పిలుస్తాడు. అట్లని రక్త సంబంధమేమి లేదు మన గురువుగారు ఎంత గొప్ప నటుడో ఆయన అంత గొప్ప రచయిత ఇద్దరు గొప్ప ఆర్టిస్టులు. వారి వారి రంగాలలో గొప్పవారు "

'అయితే వీరిది కళాత్మకమైన అనుబంధమన్న మాట కాని మన గురువుగారు తరుచు అండాళ్ వద్దకు వెళుతుంటాడు. భవభూతి ప్రతిభ ఇంటికి వెళుతుంటాడు ఎందుకంటావు'.

అండాళ్ ఈ కళాశాలకధ్యక్షురాలు. అందుకని వీరిద్దరి మధ్య లావాదేవీలుంటాయి. కాని భవభూతికలా కాదు. ఆయనకు ప్రతిభ అంటే చెప్పలేనంత ఇష్టం ఒంటరిగా ఆమె బెడ్‌రూంలోకి గూడ వెళ్ళే అధికారం ఒక్క భవభూతికే వుంది"

"ఔను! ఈయన వ్రాసిన రచనలనే ఆవిడ నృత్యరూపకంగా ప్రదర్శిస్తుంది గదా!'

"కావచ్చు కాని అదేమంత ముఖ్య విషయంకాదు ఇక్కడ మనం గమనించవలసిన అంశం, భవభూతికి, ప్రతిభకు మధ్య ఉన్న సంబంధమే వీరిరువురు నేడో రేపో వివాహం చేసుకుంటారని కూడ అంతా అనుకుంటున్నారు"

'నిజమా! నమ్మలేకున్నాను."

"అవును! నాకు ఒక ఆప్తమిత్రుడు చెప్పాడు భవభూతి ప్రతిభ వెంట పొరుగూళ్ళకు ఆవిడ ప్రదర్శన ఇచ్చిన ప్రదేశాలకు వెళుతుంటాడు గదా! అప్పుడు గెస్టు హౌసులో దిగుతారట ఒకే చోట భోంచేస్తారట ఒకే మంచంలో పడుకుంటారట "

"ఆఁ ఆఁ ఎట్లా? ఎట్లా?" వింటున్నవారిలో లైంగికమైన ఉత్సాహం ఇనుమడించింది.

"ఎలాగూ – కొంచెం వివరంగా చెప్పరాదా?"

"ఏమో? నేను మాత్రం చూచానా ఏమిటి నలుగురు అనుకుంటున్న మాటలే! విభూతి గజ్జెల గుర్రం అని వీరికి నిక్‌నేమ్స్ పెట్టారు '

నవ్వులు - గుసగుసలు - భవభూతికి అన్నీ స్పష్టంగా వినపడ్డాయి. విభూతి అంటే తానన్న మాట గజ్జెలగుర్రం అంటే నర్తించే ప్రతిభ అన్నమాట. తనకు తెలియదే తమ గురించి లోకం ఇట్లా అనుకుంటున్నదా? తన వాత్సాయనశర్మ శిష్యులే ఇట్లా అనుకుంటున్నారంటే ఇంకా ఎందరెందరో ఏ విధంగా అనుకుంటున్నారో తేలిగ్గానే ఊహించుకోవచ్చు. సృష్టిలోని రహస్యమే ఇంత కర్ణుని జన్మ రహస్యం గురించి అందరికీ తెలుసు కాని ఎవ్వరూ అతనితో అనలేదు. అందరిలోను చిట్టచివరిగా తెలుసుకున్నది అతడే రహస్యం తనకు తప్ప ముందుగానే లోకానికి తెలుస్తుంది భవభూతి విషాదంగా నవ్వుకున్నాడు తనను లోకం అపార్థం చేసుకొన్నందుకు బాధలేదు. కాని అనవసరంగా ప్రతిభ అపవాదుపాలు కావలసి వస్తున్నదే అని అతని విచారం

భవభూతి గిరుక్కున వెనుకకు తిరిగాడు ఆ రాత్రి గదిలో పడుకోలేదు. చీకట్లో అలాగే నడుచుకొంటూ అశోక్‌నగర్ మీదుగా టాంక్‌బండ్ మీదికి చేరాడు రాత్రి నగరమంతా నిద్రావస్థలో సగం జీవితాన్ని కోల్పోతుంది. భవభూతి మాత్రం జాగురూకుడు. అతడు నిరీహతో అలల వైపు చూస్తూ కూర్చున్నాడు. అకస్మికంగా అతని కంఠం నుండి ఒక గీతం వెలువడింది

"అమని, గొంతెత్తి పిలిచెను ఏమని - ప్రవహించి పారెను రసధుని - పులకించి ఆడెను మధువని - ప్రతిభాభినయ శుభవేళని"

గాలి అతని పాటకు ప్రతిధ్వని పలుకుతోంది జలతరంగాలు ఆర్కెస్ట్రా సమకూరుస్తున్నాయి అతని మనోనేత్రానికి ప్రతిభ ఒక విశ్వ నర్తకివలె తాను ఆమె పాద మంజీరం వలె కనిపించింది. భగవంతుని ముందు నిలబడ్డ

జరిగిన కథ–14 : ప్రతిభకి హైదరాబాదులో భవభూతి పరిచయం అవుతాడు భవభూతి రాసిన క్షీరసాగరమధనంలో మోహినీ పాత్రను అభినయించడానికి ప్రతిభ అంగీకరిస్తుంది. సుధారాణి తన కథను భవభూతికి చెప్పి గిరిజ తన కూతురని చెపుతుంది సుధారాణి ప్రతిభ కథను భవభూతికి చెపుతుంది. మాధురి పటేల్ వివాహ సందర్భంగా నృత్యం చేస్తున్న ప్రతిభ పందిట్లో తానే వధువయినట్లు ఊహించుకుంది నృత్యానంతరం కనిపించిన భవభూతి ఆమెకు తన పెళ్లి కుమారునిగా కనబడ్డాడు.

పూజారివలె ఈ కళామూర్తి ముందు తానొక సేవకుడు తెలుగువారు ఎన్నో ఏళ్ళు చేసుకున్న పుణ్య ఫలితంగా ఆమె ఈ గడ్డమీద జన్మించింది. తానామె నర్తన వైభవానికి వాగ్గేయకారుడు

'ప్రతిభ? కాటుక నౌదు నీ కనులలో సీమంతినీ! నీదు చెక్కిలిపై చుక్కనైగ, మోముపై తిలకమై, కెమ్మోవి రంగై, మహా లలితంబవు కరయుగ్మమందు సొర్లై, లావణ్యమౌ దేహదీప్తుల మాంజిష్టము, పాద కింకిణినై దేవీ ప్రమోదించెదను

ఆదికావ్యం వ్రాసిన మహాకవి శోకం శ్లోకంగా పరిణమించినట్లు భవభూతికి బాధపడిన మనస్సులో నుండి లయాన్వితమైన వృత్తం ఛందస్సుతో కూడుకొని బహిర్గమించింది అతడా వావావేశానికి తట్టుకోలేక పోతున్నాడు తెల్లవార్లు బవభూతి అలా జాగరణ చేస్తూనే వున్నాడు లోకానికి కవిత్వం గూర్చి, కళల గూర్చి చాల తక్కువ తెలుసు వారి కర్ధమయ్యే భాష స్త్రీపురుషుల మధ్య ఒక్కటే అది సెక్స్ అంతకుమించి ఆలోచించలేరు తనకూ ప్రతిభకూ పెళ్ళేమిటి? ఎవరైనా వింటే నవ్వుతారు స్నిగ్ధమైన ముగ్ధమైన హిమాలయ సానువుల నెవరైన పెళ్ళి చేసుకొంటాడా? తనకు పెళ్ళి ఏమిటి? గగనసుందరి వినీలకేశములను అలంకరించే నక్షత్రపుష్పం తను. తన దృష్టిలో ఆమె ఒక దివ్య నర్తకి. ఆమె జన్మించడంతో కాళిదాసు కవితలకే కదలికలు వచ్చాయి అన్నమయ్య పదములకు అడుగులు పడ్డాయి సిద్ధేంద్రుని రచనలకు శ్రీగంధపు సౌరభం వచ్చింది తెలుగునాట ప్రతిభామయ చాంద్రీ మధునర్తనం కనిపించింది. రసవాహిని ప్రవహిస్తున్నది మధురోహలు చిగురిస్తున్నవి విహరించే తేటులగమి వికసించే కుంకుమ వని కళకే తానొక వెలుగై కూచిపూడి తెలిపులుగై స్వప్నేందిర దరహాసం శోభామయ మధుమాసం ఒక విభావరి కేలన, ఒక ప్రభారవి జాలన ఒక మధూలికా నర్తన ఒక మదాలసావర్తన. ఒక సుహాసిని




రూపం ఒక విలాసిని చాపం ఒక మనస్విని స్పందన ఒక తపస్విని వందన చిరుమువ్వల సవ్వడి జడి వడి మువ్వల కలరుత ధ్వని ఎలతేటల పాటలలో, సెలయేరుల ఆటలలో, బడిపూవుల వానలలో చిరుగాలుల సోనలలో ప్రవహించే తేనెవాక తెలివెన్నెల కలువ రాక గలగల పారెడి ఝరిఝరి, కలకల విరిసిన విరిఝరి,

తెలుగు కళకు ఉషోదయం నృత్యరంగ మహోదయం అభినయ మధురసోదయం ప్రతిభామయ శుభోదయం కలహంసల యానముతో మలయ పవన గానముతో వినవచ్చినదొక ప్రభాత వేళ ఒక ప్రతిభాగీతం ఏదో లోకాల నుండి ఇట దిగెనొక హిమకిరణం అభినయ కళకాదర్శం అమృత ప్రతిభా వరం - భవభూతి రసాప్లావితుడై భావామృత సుస్నాతుడై నిశీధిలో వెలుగు వెన్నెలలను చూస్తూ అలాగే ఉండిపోయాడు మరునాడు ప్రతిభ వద్దకెళ్ళాడు

ఆమె చిరునవ్వుతో భవభూతిని ఆహ్వానించింది

ఉండండి' క్లాసులు ముగిసాక వస్తాను డ్రాయింగు రూంలో కూర్చొని వుండండి అన్నది భవభూతి ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు' మధ్యాహ్న వేళకు ఆమె విద్యార్థినీ విద్యార్థులను పంపి వచ్చింది

ఎలా వుంది సంస్థ? ఏదో మామూలుగా పలకరించాడు ఆమె చిరునవ్వు నవ్వి మీ దయవల్ల అంతా బాగానే వుంది చాలమంది పెద్దవారి సహాయం లభిస్తున్నది బెంగుళూరు నుండి వచ్చిన తర్వాత మీవంటివారి సుహృద్భావంతో నేనిక్కడ నిలదొక్కుకొగల్గాను మొన్న మీరు వచ్చి వెళ్ళారట గదా' సుధారాణి చెప్పింది ఆ రోజు నేను లేను

అవును మిమ్మల్ని చూద్దామని వచ్చాను లేరని తెలిసి వెళ్ళిపోయాను దారిలో ఓ గుడిలో కూర్చున్నాను మీరక్కడ స్వామివారి సన్నిధానంలో కళ్యాణమంటపంలో నాట్యం చేస్తూ కనబడ్డారు

ప్రతిభ నవ్వి మీ భావుకతకు నా జోహార్లు నేనేమి దేవతను కాను అప్సరస వంశంలో జన్మించినదానిని కాదు సామాన్య మానవకాంతను అన్నట్లు నేనే మీకు కబురు పెట్టాలనుకున్నాను ఇంతలో మీరే వచ్చారు మన సంస్థ గూర్చి ఆండాళ్ వ్యతిరేకంగా ప్రచారం చేస్తుందట అది నా దృష్టికి గూడ వచ్చింది ఆమెకు నేను చేసిన అపకారం ఏమీలేదు ఆమె పూర్వీకులను నేను హత్య చేసిందిలేదు నా ఆస్తిని ఆమె దోచుకుంటున్నదీ లేదు ఇద్దరం ఒకే రంగానికి చెందిన కళాకారిణులం అనవసరమైన ఈర్ష్యాద్వేషాలు ఎందుకు? ఎవరి పలుకుబడి గొప్పదనం వారికి ఉంది ఎవరి అభిమానులు వారికున్నారు అనవసరంగా ఒకరినొకరు ఆడిపోసుకోవటం వల్ల ప్రయోజనమేమి లేదు

భవభూతి గుండె గుబేలుమంది ఏదో జరిగిందని అతడు ఊహించాడు కాని అదేమిటని అడిగే సాహసం లేకపోయింది

కవిగారూ' నాకొక జాబు వచ్చింది అందులో విభూతి గజ్జెల గుర్రం అని వ్రాసి వుంది అదేమిటో మొదలు నాకర్థం కాలేదు కాని తర్వాత విచారించగా




తెలిసింది విభూతి అంటే భవభూతి అట గజ్జెల గుర్రం అంటే నేనట నన్నల్లరిపాలు చేయటం కోసం ఆండాళ్ ఇలా చేసిందని నమ్మకంగా తెలియవచ్చింది నిజానికి ఇది ఆమె స్థాయికి తగిన పనికాదు

భవభూతి నిశ్చేష్టుడై, నిశ్శబ్దమానసుడై ఉండిపోయాడు ప్రతిభయే మళ్ళీ ఇలా అన్నది

నాకు భగవంతుడు కళను ప్రసాదించాడు నాకాయన ఇచ్చింది ఈ వరాన్నే ఇదే నాకు వరం ఇదే నాకు శాపంకూడ నా జీవితం ఆటోగ్రాఫ్‌ల మధ్య అట్టహాసాల మధ్య, కరతాళాల మధ్య సన్మానసభల మధ్య నడిచిపోతున్నదని అందరూ అనుకుంటున్నారు కాని క్షీరసాగరంలో కూడ `క్షార బిందువులుంటాయని అందరికీ తెలియదు అమృతసాగరం కడుపులో హాలాహలం దాగివుంటుందని, వెలుగు వెనుక చీకటి కూడ ఉంటుందని ఎంతమందికి తెలుసు నేని ఆండాళ్ వంటి వారికి భయపడటంలేదు కాని నేను స్త్రీనే నాకూ స్త్రీ సహజమైన కోర్కెలుంటాయి నేనొకవేళ వివాహం చేసుకోవాలంటే తప్పా చెప్పండి ఆమె కంఠం భావోద్వేగంతో గాద్గదికమైంది భవభూతి అవునని కానీ, కాదని కానీ సమాధానం చెప్పలేదు చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు తర్వాత ఉన్నట్లుండి ఏదో లోకంలో ఉన్నట్లు ఇలా అన్నాడు నా దృష్టిలో కళాకారులు కళాకారిణులు పెళ్ళి చేసుకోకూడదు దీనివల్ల వారి జీవన ప్రయోజనము పరమార్థము దెబ్బతింటుంది అన్ని సుఖాలూ అందరికీ లభించవు శాశ్వత కీర్తి సుఖాన్ని పొందదలచుకున్న కళాకారుడు శారీరకమైన కొన్ని సుఖాలను త్యాగం చేయక తప్పదు ప్రతిభ భవభూతి కళ్ళలోకి సూటిగా చూచింది ఆమె కన్నులు విచిత్రంగా అభినయించాయి భవభూతి వాటిని శబ్దాల్లోకి అనువదించుకున్నాడు

ఓయి భవభూతి' నేనెంత వెర్రిదానిని నేను వివాహం చేసుకోవాలనుకున్నాను నేను స్త్రీనే కాబట్టి నాకు సహజమైన వాంఛలు ఉంటాయి కాబట్టి తగిన వరుణ్ని అన్వేషించుకోవటంలో తప్పేమిలేదు అయితే సింహాసన మెక్కిన చక్రవర్తి రాజ్యాధికారం అనే బందిఖానాలో చిక్కుకుపోయి సామాన్య ప్రజలకు దూరమై వారితో కలిసి మెలసి వీధుల్లోను పొలాల గట్లల్లోను తిరిగే అదృష్టాన్ని కోల్పోయినట్లే నేను కూడ రంగస్థలం ఎక్కి గజ్జె కట్టడం ద్వార సామాన్యమైన స్త్రీ పొందే అనుభవాలను, అనుభూతులను కోల్పోవలసి వస్తుందని అనుకోలేదు ఓయి భవభూతి' నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను అయితే నేని మాటను చెప్పడానికి శబ్దజాలం లేదు అలా చెప్పడంలో నాకు ఔచిత్యంలేదు అయితే నవు నన్నసలు వివాహం చేసుకోకూడదని శాసిస్తున్నావు నిన్నే కాదు మరెవరినీ కూడ నేను జీవితంలో పెళ్ళి చేసుకోకూడదన్న మాట ఎందుకంటే నేనొక పేమసి అర్థిస్తున్నమాట ఇదెక్కడి న్యాయం అనే అర్థం స్ఫురించేటట్లు ఆమె కనురెప్పలు నర్తించాయి భవభూతి ఏం మాట్లాడలేదు కొంచెం సేపాగి ప్రతిభే అన్నది కవిగారూ' మీరు జీవితంలో వివాహం చేసుకొంటే ఎలాంటి స్త్రీని వివాహం చేసుకుంటారు

నేనొక రచయితగా జీవించాలని కోరుకుంటున్నప్పుడు వివాహం చేసుకొనే ప్రసక్తిలేదు గజ్జెలతో మీ కాళ్ళకు బంధం పడ్డట్లే శబ్దంతో నాకెప్పుడో పాణిగ్రహణం జరిగిపోయింది ఇక అయితే గియితే అనే ప్రశ్న వచ్చినప్పుడు ఏమవుతుందో నేనేం చెప్పగలను?

నా గూర్చి మీ అభిప్రాయం ఏమిటి? ప్రతిభ అన్నది ఆమె సూటిగా ఇలా అడిగేసరికల్లా భవభూతికి ఏం సమాధానం చెబితే బావుంటుందో తోచలేదు కొంచెం సేపాగి అటూ ఇటూ చూచాడు గోడకు గజ్జెల పట్టీలు తగిలించి వున్నాయి దూరంగా మృదంగం, వేణువు వీణ కనపడుతున్నాయి

సంధ్యా సమయంలో శివుడు నర్తిస్తూంటాడు ఆయన చుట్టూ నంది భృంగి, విష్ణువు బ్రహ్మ అంతా నేపథ్య సంగీతాన్ని నిర్వహిస్తూ వుంటారు కైలాస శిఖరం ఆయన వేదిక అయితే ఈ పృథ్వి నీకు రంగస్థలం నవు స్త్రీ రూపంలో

# ధర్మపథం



## ఉత్తమ లక్షణాలు

తమ పనిని విడిచిపెట్టి కూడా ఇతరుల పనులు నెరవేర్చేవారు ఉత్తములనీ, పరుష వాక్యాలు పలకకుండా వుండి, పాపకృత్యాలకు దూరంగా ఉండేవారు ఉత్తములనీ నీతివేత్తలు తెలుపుతున్నారు మంచి వారందరూ ఉత్తములే అని చెప్పవచ్చును

మంచి పేరు రావడానికి అనేక మార్గాలున్నవి తమ వద్ద డబ్బు ఉంటే ఇతరులకు ఇచ్చి మంచి పేరు తెచ్చుకోవచ్చు లేదా శ్రమదానం చేసి, శ్రమసాధ్యమైన పనుల్లో చేదోడుగా ఉండి ఇతరుల ప్రశంసలను అందుకోవచ్చు లేదా తన మాటకు విలువ ఉండగలదని తోచినప్పుడు వాక్య సహాయం చేసి ఇతరులకు ఉపకారం చెయ్యవచ్చును

ఇతరులకు సహాయం చేస్తే మంచివారనీ, సహాయం చెయ్యకపోతే చెడ్డవారనీ అనుకోవడం కూడా పొరపాటే! శక్తి లేనివారు ఇతరులకు తోడ్పడలేకపోవచ్చు ఉపకారం చెయ్యకపోయినా, ఇతరుల పనులకు అడ్డం రాకుండా ఉన్నా, అపకారం చెయ్యకుండా ఉన్నా కూడా అలాటివారు మంచివారే! అలాగే, అనవసరంగా ఇతరుల పనులలో జోక్యం కలుగజేసుకొని, వారికి అపకారం చెయ్యకుండా ఉండడం అత్యుత్తమం ఇతరుల్ని ఏ పనిని చేస్తే మన మనస్సునకు బాధ కలుగుతుందో, ఆ పనులు మనం ఇతరుల విషయంలో చెయ్యకుండా ఉంటే - అదే ఉత్తమ ధర్మమని ఆర్యుల అభియుక్తోక్తి

మనస్సులో ఎట్టి దురభిప్రాయమూ లేకపోయినా, ఇతరులకు సహాయం చెయ్యవలెననే సంకల్పం ఉన్నా, మాటల తీరునుబట్టి తాను అనుకున్న దానికి వ్యతిరేకం జరుగుతూ ఉండడం కూడా సహజమే! ఉపకార బుద్ధి కలిగి ఉన్నా, అట్టి వ్యక్తి అపకారిగానూ, చెడ్డవాడుగానూ పేరు పొందగలడు అందువల్ల మాట లాడేటప్పుడు ఉచితానుచితాలనుబాగుగాపరిశీలించి, ఏ మాట వల్ల ఇతరులకు మేలు కలుగుతుందో, ఏమాటవల్ల కీడుకలుగుతుందో గ్రహించి మరీ మాటలాడడం మేలు అలా తగిన రీతిని మాటలాడ లేనప్పుడు ఊరక ఉండడం ఉత్తమం మంచితనం గాని, చెడ్డతనం గాని మానవుని ప్రవర్తనను అనుసరించి ఉంటుంది

— బులుసు వేంకట రమణయ్య

నున్న నటరాజస్వామివి నేను నీకొక భక్తుడిని మాత్రమే ఆరాదకుడిని మాత్రమే జీవునికి ఈశ్వరునికి మధ్య వున్న సంబంధమే నీకూ నాకూ వుంది ఎవరో విభూతి గజ్జెల గుర్రం అని వ్రాస్తే గుమ్మడికాయల దొంగవలె భుజాలు తడుముకోవడమెందుకు

ఈ మాటలు విని ప్రతిబ నిరుత్తరురాలైంది ఆమెలో ఒక్కసారిగ బావోద్వేగం విజృంభించింది అది ఆమె కన్నులలో ప్రతిపలించింది ఆమె చివాలున లేచి లోపలికి వెళ్ళిపోయింది

బవభూతికి ఏం చేయాలో తోచలేదు మరి ఇక అక్కడ ఎక్కువసేపు కూర్చోవటంలో ఔచిత్యం లేదనిపించింది మాట్లాడకుండా తిరిగి వెళ్ళిపోయాడు భవభూతి పసిపిల్లవాడు కాడు అతడొక రసయోగి శబ్దాన్నే కాదు నిశ్శబ్దాన్ని కూడ బాష కిందికి అన్వయించుకోగలడు ప్రతిబ అకస్మాత్తుగా ఎందుకలా లోపలికి వెళ్ళిపోయింది - ఆమె తనను గూర్చి ఏమైనా ఊహించుకుంటున్నదా? అలా ఊహించుకోవడానికి ఏమైనా అవకాశం ఉన్నదా? తాను ఒక బికారి ఆమె దనవంతురాలు తన పేరుప్రతిష్టలు హైదరాబాదుకు మాత్రమే పరిమితం ఆమె విశ్వవిఖ్యాత నర్తకీమణి ఆమెకూ తనకూ వయస్సులో కూడ కొంచెం భేదం ఉంది తాను అందగాడని తను చెప్పుకోలేడు అలాంటప్పుడు ఆమె తనను ప్రేమిస్తున్నదా? తననొక కళాకారునిగా ప్రేమిస్తున్నదా? లేక జీవితంలో ఒక స్త్రీకి కావలసిన మగ తోడుగా ఆమె తన సాహచర్యం వాంచిస్తున్నదా? దేవునితో భక్తునికి పెళ్ళి జరగదు ఈ మాట తాను అనేసరికి ఆమె మానసికంగా దెబ్బతిన్నదా? ఏమో మరి! ఆమె అనవసరంగా తనమీద ఇలా ఆశలు పెంచుకొనేటట్లు తాను ప్రవర్తించాడా? తనెంతలో ఉండాలో అంతలో వుంటే సరిపోయేది ఆరాధనలు, ఉపాసన అంటూ ఆమె వెంట పడ్డాడేమో ఒక చీర ప్రక్కనే బట్టల షాపులో పంచె ఉంటే ఆ రెండు బీరువాలకు ఈ లోకం లైంగిక సంబందం అంటగడుతుంది. అధునిక లోకానికి తెలిసిందిఒకే పరిభాష వారు ఈ మనస్తత్వంతో నే ఆలోచిస్తారు తన హద్దులలో తానుంటే సరిగదా అలాగాదు తన రచనలకు అభినయం కూరుస్తున్నది అందామా? కూరిస్తే కూర్చనీ ఏమైంది కనుక బలిజేపల్లి లక్ష్మీకాంత కవి రచించిన సత్య హరిశ్చంద్ర నాటకాన్ని వాత్సాయనశర్మ ప్రదర్శిస్తున్నాడు అందుకని బలిజేపల్లి వచ్చి వాత్సాయనశర్మ ప్రక్కనే కూర్చోవడం లేదు తిరుపతి వేంకట కవుల రాయబారాన్ని వాత్సాయనశర్మ ఆడుతున్నాడు అప్పుడు తిరుపతి కవులు వచ్చి వాత్సాయనశర్మకు దర్శకత్వం నిర్దేశించడం లేదు అలాకాదు వారు నిర్జీవులు తాను బ్రతికే వున్నాడు కాబట్టి తాను తన నృత్య రూపకానికి ప్రక్కనే కూర్చుని వ్యాఖ్యానం చెప్పడంలో తప్పేముంది? తప్పా? తప్పున్నరా? లోకం మాట అటుంచి చివరకు ప్రతిభకూ తనమీద కామవాంఛ కలిగిందనేది సుస్పష్టం, తానిప్పుడు వరూధినిని తిరస్కరించిన ప్రవరాఖ్యునిలా ఫోజు పెట్టటం అసహ్యంగా ఉంటుంది భవభూతి చాలా బాదపడ్డాడు కాని ప్రతిభ వద్దకు వెళ్ళకూడదనుకున్నాడు ఆమె కబురుపెట్టినా సరే వెళ్ళకూడదు అని నిర్ణయించుకున్నాడు

(ఇంకా ఉంది)

# కాన్సర్‌ని మటుమాయం చేసే ఆంజియోజెనిన్

కాన్సర్ వ్యాధికి మూలమేమిటో జన్యుచికిత్సలో పరాకాష్ఠకి చేరుకొన్న ఈ తరుణంలో కూడా ఇంకా అంతుబట్టడంలేదు ఈ వ్యాధి సోకకుండా ఎలాంటి ముందు జాగ్రత్తలు తీసుకోవాలో తరచూ సూచించడం జరుగుతోంది వ్యాధి సోకాక తీవ్రం కాకుండా చికిత్స చేయబడుతోందే కాని వ్యాధిని మటుమాయం చేసే ప్రక్రియ ఇంతవరకూ రూపు దాల్చలేదు ఇట్టి వాతావరణంలో ప్రారంభదశలో నే కాన్సర్‌ను గుర్తించగలిగే శక్తిని కలిగించి ఆ వ్యాధి తాలుకూ ఆనవాలు కూడా లేకుండా చేయగలిగే ఒక అద్భుత పదార్థాన్ని వాషింగ్‌టన్ విశ్వ విద్యాలయానికి చెందిన హార్వర్డ్ వైద్య సంస్థలో పనిచేసే జీవ రసాయనిక శాస్త్రవేత్త చెరట్ వాల్లీ (66) కనుక్కోవడం ఎంతైనా సంతోషించదగ్గ అంశం

కాన్సర్ కణం రూపు దిద్దుకొన్న వెంటనే కణ విభజన ప్రక్రియ అనూహ్యమైన స్థాయిలో జరిగి కణాల సంఖ్య ఉధృతమై కంతి ఏర్పడటానికి అవకాశం కలుగుతుంది కాన్సర్ కణం కంతలా రూపొందడానికి రక్తం అంటే రక్తంలోని గ్లూకోస్ ఎంతైనా అవసరం ఈ కాన్సర్ కణం తనకు కావలసిన రక్త సరఫరా కోసం ప్రత్యేకమైన రక్త కేశనాళికలని కావలసిన మోతాదులో నిర్మాణం చేసుకొంటాయి ఈ శక్తి కాన్సర్ కణానికి

ఎక్కడినుంచి వస్తోంది అనే విషయం గత దశాబ్దంగా ప్రశ్నార్థకంగానే మిగిలి ఉంది ఇప్పుడు చెరట్‌వాల్లీ పరిశోధనల ఫలితంగా ఆ ప్రశ్నార్థకం కాస్తా తుడిచి పెట్టుకొని పోయింది రక్త కేశనాళికలని వృద్ధి పరచుకొనే శక్తి కాన్సర్ కణానికి ఆంజియో జెనిన్ అనే అద్భుత పదార్థంవల్ల వస్తోందని తొలిసారిగా వాల్లీ ప్రకటించారు ఈ అద్భుత పదార్థం కేవలం ఒక ప్రొటీన్! ఈ ప్రొటీన్‌ని నిర్దేశించే జన్యువుని కూడా ఆయన సంగ్రహించ-గలిగారు" చిన్న పేగు పెద్ద పేగుతో కలిసే సంధి భాగంలో వచ్చే కాన్సర్ వ్యాధిగ్రస్తులపై పరిశోధనలు జరుపుతున్న వాల్లీ ఆ కాన్సర్ కణాలనించి ఆంజియో జెనిన్‌ని అతి తక్కువ మోతాదులో ఎంతో కష్టపడి సంగ్రహించగలిగారు ప్రస్తుతం ఆయనవద్ద కేవలం 100 మైక్రో గ్రాముల ఆంజియో జెనిన్ ఉన్నట్లు మాత్రమే అక్టోబర్ 7 1985 టయిమ్ వార పత్రిక ద్వారా తెలుస్తోంది మిల్లీ గ్రాములో వెయ్యోవంతుని మైక్రోగ్రామ్ అని పిలుస్తారు!

ఆంజియో జెనిన్ అత్యంత శక్తివంతమైనది జేమ్స్ రీ ఆర్డన్ అనే జీవ శాస్త్ర నిపుణుని అంచనా ప్రకారం క్వాడ్రిల్లియనులో ఒక భాగం రక్త కేశనాళికలున్నా చాలు • ఆంజియో జెనిన్ నిమిషాలమీద వాటిని వృద్ధి చేస్తుంది బిలియన్ అంటేనే బ్రిటిష్ వారికైతే మిలియన్ మిలియన్‌లు! అదే అమెరికా వాళ్ళకయితే వెయ్యి మిలియన్‌లు! ఇక క్వాడ్రిల్లియన్ అంటే ఎంతో లెక్క వేసుకో వచ్చు" ఊహించడానికి కూడా వీలు కానంతగా ఆంజియో జెనిన్ పనితనపు సామర్థ్యాన్ని ప్రదర్శిస్తుందని స్పష్టంగా తెలుతోంది

జూడా ఫోక్‌మన్ అనే కాన్సర్ నిపుణుడు వాల్లీ కనుగొన్న ఆంజియో జెనిన్ విశిష్టతని కొని యాడుతూ కాన్సర్‌ని అరికట్టడంలో వాల్లీ పరిశోధన ఎంతైనా ఉపకరిస్తుందని ప్రకటించడం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది రక్తము మూత్రము పరీక్ష చేస్తే వాటిల్లో ఏమాత్రం ఆంజియో జెనిన్ ఉన్నా కాన్సర్ సోకినట్లు నిర్ధారించవచ్చు వెంటనే జన్యు చికిత్స జరిపి ఆంజియో జెనిన్ పుట్టుకకి మూలమైన జన్యువుని తొలగించివేస్తే రక్త కేశ నాళికల వృద్ధి కొనసాగదు అంటే కాన్సర్ కణాలకి రక్త సరఫరా ఆగిపోతుంది, ఫలితంగా అనూహ్యంగా అమిత వేగంగా జరిగే కణ విభజనకి అంతరాయం కలుగుతుంది దాంతో కాన్సర్ కంతి రూపొందే అవకాశం శూన్యమవుతుంది ఒక్క మాటలో చెప్పాలంటే కాన్సర్ మటుమాయమై పోతుంది రెండు దశాబ్దాలుగా మానవాళిని పట్టి పీడిస్తున్న కాన్సర్ రాక్షసిని ఇంత సునాయాసంగా మట్టుబెట్టే పద్ధతిని కనుగొన్నందుకు వాల్లీని అభినందించక తప్పదు ఆంజియో జెనిన్ పనితనం కేవలం కాన్సర్‌ని మట్టుబెట్టడం వరకే పరిమితంకాదు ఇతరత్రా మనుష్యుల్ని బాధించే కొన్ని క్లిష్టమైన వ్యాధులని కూడా ఈ ఆంజియో జెనిన్ ఎదుర్కోవడం ముదావహం!

ఉదాహరణకి గుండెపోటు వచ్చి రక్తం బాగా కోల్పోయిన వారికి ఆంజియో జెనిన్‌ని అందిస్తే రక్త కేశనాళికలు అతి త్వరితంగా వృద్ధి చెంది

హృదయ వ్యవస్థ ఎంతో వేగంగా కుదుటపడుతుంది వ్యాధిగ్రస్తులకి ఇందెంతైనా ఆశాజనకమైన పరిణామం! మధుమేహం తారాస్థాయికి చేరుకొన్నప్పుడు అర్ధాంతరంగా గుడ్డితనమిచ్చే ప్రమాద ముంది రెటీనాని చేరుకొనే రక్త కేశనాళికల అసాధారణ పెరుగుదల ఈ గుడ్డితనానికి కారణం 'ఆంజియో జెనిన్‌ని తొలగించిన పక్షంలో ఈ అసాధారణ పెరుగుదల నిమిషాలమీద అరికట్ట బడుతుంది. మితిమీరిన రక్తప్రసారం క్రమ పరచబడి రెటీనా ఆరోగ్యానికి భంగం వాటిల్లకుండా ఉంటుంది. ఫలితంగా గుడ్డితనం అనే ప్రశ్నే ఉదయించదు

ఇంటర్ ఫెరాన్ తరువాత అంతటి అద్భుత పదార్థంగా భావించబడుతున్న ఈ ఆంజియో జెనిన్" ఉత్పత్తి అవధులమేరకు జరగాలి ఈ ప్రొటీన్ సంశ్లేషణకి సంగ్రహణకి బాక్టీరియాలని ఈస్ట్ కణాలని ఇతోధికంగా వాడుకోక తప్పదు జన్యు చికిత్సలోని అత్యంత అధునాతనమైన మెళుకువలని ఆంజియో జెనిన్ ఉత్పత్తి కోసం వినియోగించుకోవడం శాస్త్రవంతంగా ఉంటుంది లోక శ్రేయస్సు కోరేవారి ప్రథమ కర్తవ్యం ఇంతేకదా!

—డా గుమ్మనూరు రమేష్‌బాబు

ఎలుక కాన్సర్ వ్రణం (ఎడమ వైపు నల్లటి భాగం)లోకి కొత్త గా ఉత్పత్తి అయిన రక్త కేశ నాళికలు ప్రవేశిస్తున్న దృశ్యం!



# అభిమానం

## - అర్.కె. అంకాల

బోయ్‌మని ముందు హారన్ మోగటంతో టక్కున ఈ లోకంలోకి వచ్చాడు అరవింద్ అతని ముందు ఆపిన స్కూటర్ మిద అతను, కోపంగా ఏం నాయనా నిద్రపోతు నడుస్తున్నావా? అన్నాడు

. సారిసార్? అని పక్కకు తప్పుకున్నాడు అరవింద్

ఏం కుర్రాళ్ళో ఏమిటో రోడ్డుమిద నడుస్తూనే కలలు కంటారు అనుకుంటు గేరు మార్చి ముందుకు వెళ్ళి పోయాడు ఆ స్కూటరిస్టు

నిజానికి అరవింద్ మనస్సు కలలు ఏమి కనటం లేదు కొంచం అల్లకల్లోలంగా వుంది ఎలా? ఏం చెయ్యాలని శత విదాల ఆలోచిస్తున్నాడు ఎంత ఆలొచించినా ఏమి పరిష్కారం దొరక్క సమస్య సాయంకాలం నీడలాపెరిగి పోతుంది

సమస్య ఏమిటంటే అతడికి కొంత డబ్బు కావాలి!

కొంత అంటె ఎంతో కాదు కేవలం పాతిక రూపాయలు! అది గరల్ ఫ్రండ్‌తో సినిమాకి వెళ్ళటానికి, ఫ్రండ్స్‌తో పార్టి చేసుకుంటానికి కాదు ఎందుకంటే అతడికి గరల్ ఫ్రండ్స్ కాదు కదా! అసలు ఫ్రండ్సే లేరు!

ఇంతకీ అతడి సమస్య చాల సిల్లి థింగ్! (మికు మాత్రమే సుమా!) అతడికి మాత్రం పెద్ద సమస్య

ఆ సమస్య ఏమిటో చెప్పేముందు అరవింద్‌ను గురించి కొంచెం చెప్పాలి!

5 అడుగుల నాలుగు అంగుళాల పొడవు వుండె 19 ఏళ్ళ అరవింద్ డిగ్రి 2వ సం చదువుతున్న సామాన్య యువకుడు ఎక్కువ ఎవ్వరితొను మాట్లాడడు హలో అంటె హలో అంటాడు అంతే! అతడు ఎవ్వరితోను ఎక్కువ మాట్లాడక పోవటానికి కొంత కారణం అతడి 'ఇన్ఫిరియారటి కాంప్లెక్సు' పుస్తకాలె అతడి నేస్తాలు' ఎప్పుడు ఏదో ఒకటి క్లాస్ పుస్తకాలు గాని, నవల్స్ గాని, చదువుతూ వుంటాడు అతడి అభిమాన రచయిత గౌరిశంకర్ నాద్!

అతడి రచనలంటె అరవింద్‌కి ప్రాణం అలా అని అతడికి లెటర్ వ్రాయడం, అతడి నుంచి రిప్లయి వస్తే నలుగురికి చూపించుకోవటం, అలాంటి అబిమానం కాదు అతడిది గుండెలో వుండె అభిమానం!

అతడికి ఎంత అబిమానం అన్నదానికి చిన్న ఉదాహరణ గౌరిశంకర్‌నాద్ లాంటి రచయత తెలుగు వాడుగా పుట్టటం తెలుగు పాటకుల అదృష్టం! నిజంగా ఆ బగవంతుడు దివ్యమైన నవంబరు 14న బారత ప్రజల కోసం నెహ్రూ ని పుట్టించాడు అదే మదురమైన రొజున తెలుగు పాటకుల కొసం గౌరిశంకర్ నాద్ ని పుట్టించాడు అని అనుకుంటాడు

అతడి సీరియల్ వచ్చే పుస్తకాల కొసం ఏజంట్ కంటె ముందే రైల్వేస్టేషన్‌కి వెళ్ళి ఎదురు చూస్తాడు ఆ రోజు వీక్లి వచ్చిందంటె అక్కడె తీసుకుని గౌరిశంకర్‌నాద్ సీరియల్ చదివి ఇంటికి వస్తాడు (అఫ్‌కోర్స్ దార్లొ కూడ చదువుతాడు అనుకోండి!) ఒకవేళ వీక్లి రాలేదో! ఆషాడ మాసంలో కొత్త పెళ్ళాన్ని పుట్టింటికి రైలు ఎక్కించి వచ్చే బర్తలాగ నీరసం మొహంతో తిరిగి వస్తాడు మళ్ళి ఎదురు చూపులు రేపు ఎప్పుడు వస్తుందా అని!

ఇంతకీ అతడి మనసును అల్లకల్లొలం చేస్తున్న సమస్య? అతడి అబిమాన రచయిత 'గౌరిశంకర్‌నాధ్' నవల సిరియల్ పూర్తికాకుండా నవల రిలీజ్ అయ్యింది! సిరియల్ మంచి సస్పెన్స్‌లో వుంది రెండు మూడు వారాలవరకు పూర్తికాదు అలాంటిది నవల రిలిజయ్యి అద్దాల బీరువాలో 25 రూపాయల ముద్ర వేసుకుని అతడిని మురిపిస్తూంది! ఎలాగైనా దాన్ని కొని చదవాలి! ఎలా? ఎలా?? అని బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాడు

ఇంట్లో అడిగితే ఇవ్వరా?అనుకొంటే! వాళ్ళది మద్యతరగతి కుటుంబం అందులోను 26వ తారికు అయినా నవల కొసం 25 రూపాయలుఇచ్చేంత గొప్పవాడు కాదు అతడి జనకుడు

ఆ నవల కొనటం అసాధ్యమని అతడికి తెలుసు కాని అబిమానం ఎలాగైనా చదవాలనిపిస్తుంది

వాడి పోయిన మొహంతో ఏదో విలువైనది పోగొట్టుకున్న వాడిలా నిర్లిప్తంగా, నిరాశక్తంగా నడుస్తు ఇంటికి వెడుతున్నాడు

నీ రక్తాన్ని చిందించి నేర్పావు త్యాగము ఆ త్యాగమార్గాన చూసాను నేను రక్త సంబందము రొడ్డు మిద వెళుతున్న సినిమాబండిలో 'బాలు' గొంతు చించుకొని పాడుతున్నాడు ఒక్కసారి ఆగిపోయాడు అరవింద్! అతడి ఆలొచనలు కూడ అక్కడే! నా రక్తాన్ని చిందించి' అన్న వాక్యం దగ్గర! మనసులో తళుక్కున మెరిసింది ఆ అలొచన! తను చూసిన సినిమాల్లో ఆ సీన్లు! రక్తం అమ్మి తల్లికి మందులు కొనడం, పిల్లలకు స్వీట్సు, పెళ్ళానికి పూలు తేవడం, అన్ని ఫ్లాష్‌బ్యాక్‌లా కనుల ముందు మెదిలాయి

'నేను అదే పనిచేస్తాను నా అభిమాన రచయిత నవల చదవటం కన్నా నా రక్తం నాకు ముఖ్యంకాదు ఒక్కసారి తెలికగా గాలి పీల్చుకొని టైమ్ చూసాడు (టవర్ క్లాక్‌ది) అయిదున్నర

ఇంక ఈ రోజు కుదరదు రేపొద్దున్నే చెయ్యాలి పని అనుకుని తేలిక మనసుతో ఇంటికి నడిచాడు ఆ రాత్రి అంతా అతడికి నిద్ర పట్టలేదు నేను చేసే (చెయ్యబొయే) పని సరి అయినదేనా? ఇంట్లో తెలిస్తే ఎన్ని చివాట్లు పెడతారో? ఎవరికైనా తెలిసినా వెర్రివాడు అనుకొని నవ్వు కుంటారు!అతడికి మనసులో భయంగానే ఉన్నది కాని నవలమిదున్న అభిమానం ఆ భయాన్ని డామినేట్ చేస్తుంది ఆలొచనలతో తెల్లవారు జామున నిద్రపోయాడు అరవింద్

* * * * *

ఉదయం 8 30 గంటల సమయం నీట్‌గా డ్రస్ చేసుకొని హాస్పిటల్‌కి చేరుకొన్నాడు అరవింద్ చాల పెద్ద హాస్పిటల్! విశాలమైన స్థలంలో వూరికి దూరంగా వుంది అది గేటు లోపలకి వెళ్ళగానే అక్కడవున్న ఎత్తైన రకరకాల పచ్చని చెట్లనుంచి వచ్చే చల్లని గాలి ఎంతో ఆహ్లాదకరంగా ఉంది నెమ్మదిగా బ్లడ్ బ్యాంక్ వైపు నడుస్తున్నాడు అరవింద్ మనసులో అదో రకమైన స్వఛ్చత భయం. కాదు బెరుకు!

బ్లడ్ బ్యాంక్ వరండాలో ఇద్దరు అటిండర్లు కూర్చొని మాట్లాడుకుంటున్నారు అప్పుడే నెమ్మదిగా వచ్చిన అరవింద్‌ను చూసి 'ఏంకావాలి?' అని అడిగాడు ఒకడు

రక్తం ఇవ్వాలి! నిదానంగా చెప్పాడు అరవింద్. మాట ఎక్కడో నూతిలోంచి వచ్చినట్లు చాల మెల్లగా వుంది వాళ్ళకు అర్ధమైంది డబ్బు కొసం రక్తం అమ్మటానికి వచ్చాడని ఇవ్వడానికి భయపడుతున్నాడని

రెండవవాడు అడిగాడు డబ్బుల కొసమా?

అరవింద్‌కు చాల సిగ్గేసింది వాళ్ళు అలా అడగడం అవును అని నోరు తెరచి చెప్పలేక మౌనంగా వుండిపోయాడు

మళ్ళి వాడే ఇంతకుముందు 15 రూపాయలు ఇచ్చేవాళ్ళు రక్తం తీసుకుని ఇప్పుడు డబ్బులు ఇవ్వటంలేదు వాలంటరిగా ఇస్తే తీసుకుంటారు' అన్నాడు

అది నిజంకాదు డబ్బులు ఇవ్వరంటే అతడు వెళ్ళిపోతాడని అలా చెప్పారు అది నిజం కాదని అరవింద్‌కి తెలుసు అతడి మనసులో పోరాటం మొదలయ్యింది వెనక్కి వెళ్ళిపోదామా? వద్దా?

# అన్వేషణ

ఆటంబాంబులు పేలుస్తున్నాను
ఆకలి ఏడుపులు వినిపించకూడదని–
తారాజువ్వలు ఎగరేస్తున్నాను
పోటీపడే ధరలను అడ్డగించాలని–
చిచ్చుబుడ్డి ముట్టిస్తున్నాను
చచ్చేదాకా చేవ చావకూడదని–
మతాబులను వెలిగిస్తున్నాను
రాజ్యమేలుతున్న చీకట్లను తరమాలని–
క్షణం క్షణం మదనపడుతూ అన్వేషిస్తున్నాను
వరకట్నపు మంటల్ని ఆర్పేదెలాగని– '

– మంత్రవాది మహేశ్వర్

# "అభిమానం"

ఇకతప్పనట్టు "రా బాబు" అని లోపలికి తీసుకెళ్ళాడు ఇద్దరు నర్సులు తెల్లని దుస్తులతో మెరిసిపోతు పని చేసుకుంటున్నారు గది మొదట్లో ఉన్న టేబుల్ మీద గ్లాస్ స్లైడ్స్‌ను పరీక్ష చేస్తున్న సిస్టర్ వాళ్ళు వచ్చిన అలికిడికి తలత్రిప్పి చూసింది

"గుడ్‌మార్నింగ్ సిస్టర్" అన్నాడు అరవింద్ చిరునవ్వుతో

"గుడ్ మార్నింగ్".

"సిస్టర్ ఈ బాబు రక్తం ఇస్తాడట ' చెప్పాడు అటెండరు

ఒక్కసారి ఆశ్చర్యంగా అరవింద్ ముఖంలోకి చూసింది ఆమె నూనూగు మీసాలు ఇంకా అమాయకత్వం పోని మొహం

"ఎందుకు ఇవ్వాలనుకుంటున్నావు? డబ్బులకోసమా?"ప్రశ్నించింది ఆమె.

అరవింద్ మనస్సు ఒక్కసారి చివుక్కుమంది

ఏం చెప్పాలి? ఎందుకు ఇవ్వాలనుకొంటున్నానా' అని మదనపడ్డాడు

అంతలోనే తేరుకొని "ఈ రోజు నాకిష్టమైన రోజు సిస్టర్, ఒక మంచి పని చెయ్యాలనుకున్నాను

అందుకోసమే డబ్బుల కోసం కాదు' అన్నాడు

'నీకు ఎన్నేళ్ళు?

"ఇరవై ఏళ్ళు సిస్టర్!" టక్కున చెప్పాడు అరవింద్ ఆ ప్రశ్న వస్తుందని అతడికి తెలుసు నిజానికి అతడికి 19 ఏళ్ళే రక్తం ఇరవై ఏళ్ళు నిండిన వాళ్ళకే తీసుకుంటారు. ఆ సంగతి తెలిసి అబద్ధం చెప్పాడు.

ఈ విషయం నిజం చెప్పి అతడు మర్యాదగా రక్తం ఇవ్వకుండా వెళ్ళిపోవచ్చు' కాని ఇంతవరకు వచ్చి వెనక్కి వెళ్ళటానికి అతడి మనసు ఒప్పుకోలేదు. ఎలాగైనాసరే రక్తం ఇచ్చి వెళ్ళాలని వెళ్ళిపొమ్మని పిరికి మనసు, వద్దు రక్తం ఇచ్చి వెళ్ళమని ఆత్మాభిమానం పోటీపడుతున్నాయి. వెనక్కి వెళ్ళి పోతే వాళ్ళ దృష్టిలో చాల చులకన అవుతాను నేను ఇటు తిరగగానే వాళ్ళు నవ్వుకుంటారు' అయినా డబ్బులు తీసుకున్నా వాళ్ళు ఇచ్చేది 15 రూపాయలే కదా' ఎటూ చాలదు! పోని 15 రూపాయలు తీసుకుని మిగతా 10 రూపాయలు పాత వీక్లీలు అమ్మితే వస్తాయి కదా' అని ఆలోచిస్తూ తల ప్రక్కకు తిప్పి అప్రయత్నంగా గోడకు వున్న బోర్డు మీద అక్షరాలు చదివాడు

రక్తదానం చెయ్యండి
ఒక ప్రాణం కాపాడండి"

అని వుంది

చళ్ళుమని కొరడాతో వీపు మీద కొట్టిన అనుభూతి ఛీ ఎంత నీచంగా ఆలోచిస్తున్నావు' నిజంగా రక్తదానం చెయ్యటమంటే ఒక ప్రాణాన్ని నిలబెట్టినట్టు, దానికి 15 రూపాయలు విలువగట్టి "తీసుకుంటావా? నువ్వు యువకుడివేనా? అని ఆత్మాభిమానం ఎదురు తిరిగింది' గెలిచింది కూడా'

వాలంటరీగా ఇస్తాను" అన్నాడు అరవింద్

డబ్బులు ఇవ్వరు బాబు" అన్నాడు వాడు మళ్ళీ.

"నాకు డబ్బులు వద్దు వాలంటరీగా ఇస్తాను' ఈసారి దృఢంగా అన్నాడు అరవింద్

దృఢంగా నిశ్చయించుకొన్నాడు.
ఏ గ్రూపు?" అడిగింది సిస్టర్
'తెలీదు సిస్టర్ ఇదే మొదటిసారి.'

ఆమె అతడి పెరు స్లిప్‌మీద రాసుకుని సూదితో అతడి చూపుడు వేలుమీద గుచ్చి గ్లాస్ స్లైడు మీద రెండు చుక్కలు రక్తాన్ని తీసుకొని, 'అక్కడ కూర్చో బాబూ పిలుస్తాను అని స్లైడు టెస్ట్ చెయ్యసాగింది
ఇంతలో ఒక వ్యక్తి లోపలికి వచ్చాడు అతడికి వయస్సు ముప్పయి అయిదు, నలభై మధ్య వుండవచ్చు

గుడ్‌మార్నింగ్ సిస్టర్! ఒక బాటిల్ బ్లడ్ కావాలి' అన్నాడు విష్ చేస్తూ
ఆమె అతడికి విష్ చేసి చేతిలోని స్లిప్ తీసుకొని చూసి పది నిమిషాలు కూర్చోండి సార్ ఇస్తాను ' అన్నది అతడు బెంచిమీద అరవింద్ పక్కనే కూర్చున్నాడు

సిస్టర్ టెస్ట్ ముగించి వాళ్ళ దగ్గరకు వచ్చి అరవింద్‌తో 'ఇంకోసారి ఆలోచించుకో బాబు"- అని పక్కనున్న ఆ వ్యక్తితో ఈ బాబు రక్తదానం చేద్దామని వచ్చాడు, బట్ ఐ హావ్ నో ఇంట్రస్ట్ టు టేక్ బ్లడ్ ఫ్రమ్ హిమ్, బికాస్ హి ఈస్ సో యంగ్!

ఐయామ్ ట్వంటీ ఇయర్స్ వోల్డ్ సిస్టర్! ఐ డోన్‌ట్ నో ఫైయు ఆర్ ఫీలింగ్ ఎబవుట్ ఇట్!
టక్కున చెప్పాడు అరవింద్
ఆ వ్యక్తి అరవింద్‌ను అభినందిస్తున్నట్టు చూస్తూ,
"ఎందుకు ఇవ్వాలనుకున్నావు బాబూ' అన్నాడు ఆ వ్యక్తి చేతిలోని స్లిప్ తీసుకుని వెళ్ళింది సిస్టర్

'ఈ రోజు నాకిష్టమైన రోజు ఒక మంచి పని చేద్దామని " అన్నాడు అరవింద్
'నీ పుట్టిన రోజా?"
అవును, కాదు అన్నట్టు తలూపాడు అరవింద్

నిజంగా రక్తదానం చెయ్యటం చాల గొప్ప బాబూ ఎందుకో చాలమంది భయపడతారు ఏమవుతుందో అని అంతదాకా ఎందుకు ఇప్పుడు నాభార్య నర్సింగ్‌హోమ్‌లో ఉంది ఆమెకి రక్తం కావాలంటే నా చెల్లెళ్ళు, ఆమె తమ్ముళ్ళు ఎవ్వరు ముందుకు రాలేదు నా గ్రూపు సరిపోలేదు నువ్వు చేస్తున్న పని చాల మంచి పని బాబు దేవుడు నీకు మంచి చేస్తాడు నీ కోర్కె తప్పకుండా తీరుస్తాడు " అన్నాడు ఆ వ్యక్తి

సిస్టర్ లోపల నుంచి వచ్చి "మీకు కావలసిన బ్లడ్ గ్రూప్ మా దగ్గర స్టాకు లేదు సార్! కాని లక్కీగా ఈ అరవింద్‌ది మ్యాచ్ అయ్యింది యు ఆర్ లక్కీ మీ మిసెస్ బ్లడ్ గ్రూప్ సామాన్యంగా చాల తక్కువమందికి వుంటుంది ఇప్పుడు ఈ అరవింద్ ఇలా రావటం నిజంగా మీ అదృష్టం!' చెప్పింది ఆమె. ఆ వ్యక్తి ఆప్యాయంగా అరవింద్ వైపు చూస్తూ,
"థ్యాంక్యూ అరవింద్, థాంక్యూ వెరి మచ్" అన్నాడు ఆర్ద్రతగా.
"నాటెటాల్ సార్' క్లుప్తంగా అన్నాడు అరవింద్.
తరువాత పని అంతా పది నిమిషాల్లో పూర్తి అయిపోయింది, అతడు టేబుల్ మీద నుంచి లేస్తుంటే సిస్టర్ అడిగింది
నీరసంగా వుందా?'
"ఏమిలేదు సిస్టర్!'
ఏమి వుండదు నువ్వు బాగా ఆరోగ్యంగా వున్నావు.

నిదానంగా ఇంటికి నడుస్తున్నాడు అరవింద్ చాల సంతృప్తిగా వుంది అతడికి ఒక మంచి పని చేశానన్న ఆనందముతో మనస్సు ఎంతో ప్రశాంతముగా ఎక్కడెక్కడో విహరిస్తోంది అసలు తనెందుకు రక్తదానం చెయ్యటానికి వచ్చాడో కూడా మరిచిపోయాడా క్షణం! □

# ఇ·వేమన·పద్యాలు




జ్యోతియందెబుట్టి సొంపైన నాదంబు
నాదమందెబుట్టి నరయ బిందు
బిందువందుబుట్టి పృథివియాకాశంబు
విశ్వదాభిరామ వినురవేమ.

## హైదరాబాదు నోట్‌బుక్

**కేరళ హస్తకళా ఖండాల కొలువు:–**

కేరళ రాష్ట్రం ప్రకృతి రామణీయకంలో అగ్రగణ్యం ఏలాలవంగ మరిచికా నారికేళ వనాలతో, నిరంతర వర్షాలతో సముద్రనేలకు దిగువన పండే విచిత్ర కేదారాలతో, పరిశుభ్రతకు పట్టుగొమ్మలయిన పల్లీ పట్టణ నగరాలతో, ఆత్మాదరంతో మణిప్రవాళ భాషతో పలుకరించే జానపదులతో ముచ్చట గొల్పుతూ వుంటుంది విద్యారంగంలోను దానిదే అగ్రస్థానం హస్తకళలలోను అగ్రతాంబూలం దానిదేనని ఎవరైనా చెప్పగలరు అక్టోబర్ 13 నుంచి దాదాపు మూడు వారాలపాటు కళాభవన్‌లో జరిగిన కేరళ హస్తకళా ప్రదర్శనం చూచిన వారు నాటకోనికి అనర్హమైనదేదీ కాదని భరతుడు చెప్పాడు దీనిని కేరళ ప్రజలు పూర్తిగా నమ్మినట్టున్నారు, కనుకనే తమ రాష్ట్రంలోని ఏ వస్తువూ – గడ్డి గాదం కూడా నిరుపయోగం కాదని నిరూపించుకొన్నారు కేరళ రాష్ట్రం ఆయుర్వేదం వైద్యానికి కూడ విఖ్యాతి చెందింది ఒక గురువు వద్ద కొందరు శిష్యులు ఆయుర్వేద అధ్యయనం చేస్తున్నారు. వారు శాస్త్రాన్ని పూర్తిగా అధ్యయనం చేసిన పిదప గురువు వారిని అడవికి పంపాడట మంచి ఓషదులు తెమ్మని అందరూ వెళ్ళారు. ఏవో మూలికలు తెచ్చారు ఒక శిష్యుడు బండెడుగడ్డిగాదం తెచ్చాడట ఏమిటి ఇదంతా?– అనడిగాడట గురువు అడవిలో ఏ మొక్కా, ఏ గడ్డీ ఔషధానర్హంగా నాకు తోచలేదు అన్నీ నమూనాగా తెచ్చాను – అన్నాడట నీవు పరీక్షలో నెగ్గావు నీవు ఇక పూర్తిగా ప్రాణాచార్యుడివి – అన్నాడట గురువు కేరళ వాసులు ఈ రహస్యం గ్రహించా రనడానికి ఈ హస్తకళా ప్రదర్శనమే నిదర్శనం ఈ ప్రదర్శనంలో కర్ర చెక్కడపు బొమ్మలు– మామూలు కర్ర, చందనం, రోస్‌వుడ్, మద్ది మున్నగు చెక్కడపు బొమ్మలు, ఏనుగు దంతం, కొమ్ము బొమ్మలు, కంచు ఇత్తడి వస్తువులు, ఖర్జూరపు ఆకుతో అల్లినవి కొబ్బరి చిప్ప, పీచునార, గుజ్జులతో చేసినవి, పేము, వెదురు వస్తువులు, కోరా (ఒక రకం తుంగ) గడ్డి వస్తువులు, మామూలు గడ్డి వస్తువులు, కుర్చీలు మొదలయిన గృహాలంకరణ వస్తువులు, చేనేత, కలంకారీవస్తువులు, శంఖాలు, ఆలి చిప్పలతో చేసిన వస్తువులు"– ఇలా కొన్ని వందలున్నాయి ఈ ప్రదర్శనాన్ని కేరళ స్టేట్ హాండీక్రాఫ్ట్స్ అపెక్స్ కోఆపరేటివ్ సొసైటీ– సురభి ఏర్పాటు చేసింది సురభి అధ్యక్షులు శ్రీ పి ఎం మహమ్మద్ కుట్టి కార్యదర్శి శ్రీ టి కె సహదేవన్ కేరళలో చెక్కడపు కళ అనాదిగా వుంది దేవాలయాలలోని వాస్తుశిల్ప కళ కుడ్య చిత్రాలు అతి ప్రాచీనమైనవి కర్ర చెక్కడపు నైపుణ్యానికి దేవాలయాలు పరాకాష్ఠ దంతపు చెక్కడం క్రీస్తుపూర్వం వేయి సంవత్సరాలకు ముందు నుంచే వున్నట్టు క్రైస్తవుల మత గ్రంథమైన ఓల్డ్ టెస్టమెంట్‌లో వుంది పాశ్చాత్య దేశాలకు కేరళతో దంతపు వ్యాపారం వున్నట్టు చరిత్రకారులు యాత్రికులు తెలిపారు. పూర్వం ఈ దంతపు చెక్కడపు పని దేవతా విగ్రహాల నిర్మాణం వరకే పరిమితం కాని, రెండు వందల ఏళ్ళుగా ఈ కళాకారులు ఇతర అలంకరణ వస్తువులను కూడ చేస్తూ ప్రఖ్యాతి పొందారు కంచు, వెండి, ఇత్తడి పోత వస్తువుల చరిత్ర కూడ అనాదిదే. వాటిలో దీపాలు ప్రముఖమైనవి అర్చనా దీపం, ఆరతి దీపం, నంది దీపం, దీపలక్ష్మి, గజలక్ష్మి దీపం, మయూర దీపం హంసదీపం, విమాన దీపం, అశ్వదీపం మున్నగునవి ఎన్నో విదేశీయులను ఎక్కువగా ఆకర్షించేది గ్రీక్‌దీపం ఏనుగు దంతాల లాగే బర్రె కొమ్ములూ కళకు వినియోగ మయింది. పొడుగాటి కొమ్ములో చెక్కిన నావ చాల ఆకర్షణీయ మైనది ఏటిలో పక్షులూ, పూవులూ దీపం, పెన్ స్టాండులు చాల రమణీయాలు. ఖర్జూరపు ఆకులతో చేసిన సంచులు, పర్సులు, చాపలు, హాట్లు, తడకలు ఆధునికులను విశేషంగా ఆకర్షించాయి కొబ్బరి చెట్టును కేరళులు వినియోగించు కొన్నంతగా ప్రపంచంలో మరెవరూ వినియోగించుకోలేదేమో! కేరళ నారికేళ మయం దానికాపేరు నారికేరళం నుంచే వచ్చిందని కొందరి వాదం కొబ్బరి చిప్పతో గిన్నెలు, చెంబులు, కూజాలు, పుష్పపాత్రలు, అగరువత్తుల స్టాండులు, డబ్బాలు, కప్పు, సాసర్లు, పంచపాళలు ఇలా ఎన్నో కొబ్బరి పీచుతో చేసినవి అసంఖ్యాకాలు కోరా (తుంగ) చాపలలోను వైవిధ్యం వుంది ఈ చాపలు అల్లేవారి కడకృతు అంటారు ఇది సంస్కృతంలో కటకృత్ అనే పదానికి వికృతి కాయితం గుజ్జుతో చేసిన కథకళి బొమ్మలు చాల చవుక గనుక సామాన్య ప్రజల ఆదరణకు పాత్ర మయాయి ఈ ప్రదర్శనాన్ని ఆంధ్ర ప్రదేశ్ హస్తకళాభివృద్ధి సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ జి కుమారస్వామి రెడ్డి ప్రారంభించారు ప్రారంభంలో సురభి కార్యదర్శి శ్రీ వాసుదేవన్ సురభి చరిత్ర చెబుతూ, కేరళలో 32 హస్తకళ లున్నవని, వీటి అభివృద్ధి వలన గ్రామ సీమలలో ఉద్యోగావకాశాలు ఎక్కువవుతాయని, గ్రామీణుల కది అదనపు ఆదాయంగా వుంటుందని అన్నారు. 1964లో ఈ సురభి సంస్థ ఎర్నాకుళం ప్రధాన కార్యస్థానంగా నెలకొల్పబడించని. దీని ప్రాథమిక సంఘాల సభ్యులు 25 వేల మంది వున్నారని ఆయన తెలిపారు ఆంధ్రప్రదేశ్‌లో ఇదే తొలి ప్రదర్శనమని, జంట నగరాల ప్రజలు తమ హస్త కళా ఖండాల పట్ల విశేషాదరణ చూపుతున్నారని ఆయన అన్నారు ఈ ప్రదర్శనం చూచిన తర్వాత మన రాష్ట్రం కేరళంత ముందుకు పోలేదేమో ననిపించింది. – ఇది పొరపాటు కావచ్చు సహరణకు స్పష్టం మనకు ప్రకృతి సంపదకు తక్కువలేదు ఏనుగులూ వున్నాయి, మన్నపోతులూ వున్నాయి వెదురు, పేము, గడ్డి తక్కువేమీ కాదు కళాకారులూ వున్నారు కాని, హస్త కళాకారులు అంతంత మాత్రంగానే వున్నారు ఈత చాపలూ, తుంగ చాపలూ అల్లుకునేవారు బిచ్చమెత్తుకుంటూంతటం, జంట నగరాలలోనే చూడవచ్చు తాటిచెట్టు ఆంధ్ర కల్పవృక్షం దానిని ఆమూలచూడం కళాఖండాలుగా తర్చవచ్చు కాని, దానితో తయారయ్యే వస్తువులు ఆదిమ దశను దాటలేదు

**ఉపశ్రుతి:–**

"ఏంసార్ ఈ మధ్య నామాలు తెగపెట్టు చుంటున్నారు మీరు" – అనడిగాడు ఒకరు నన్ను. "ఏముంది 'భగ్నాః కృషేః వాగపతాః భవంతి (ఆశలన్నీ నిరాశలయిన తర్వాత భక్తులయిపోతారు) అని సామెత – అన్నారు పక్కన వున్న పెద్ద మనిషి ఒకరు.

– తిరుమల రామచంద్ర



# ఇదిగో, వాడడానికి సులభమైన హేర్-డై.
# ఎంతో తక్కువ ధరకు.

గోద్రెజ్ పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్ మీ కోసమే ప్రత్యేకంగా రూపొందించబడినది.

ఇది భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్. అందుకే, మీరు దీనిని ఎంతో తక్కువ పరిమాణంలో వాడుకోవచ్చు!

అన్నిటికంటే ముఖ్యం, ఇది మీకు నమ్మశక్యం కానంత తక్కువ ధరకు లభిస్తుంది!



**కలపడం సులభం:** కొద్దిపాటి నీటిలో పౌడర్‌ను కలపండి. అంతే, అది వాడడానికి తయారు!



**వాడడం సులభం:** జుత్తుకు కాస్త పట్టించి నెమ్మదిగా లోపలికి రాయండి. అది తనంతటతానే మెత్తగా, అంతటా సమానంగా వ్యాపించి మీ జుత్తును యౌవ్వనవంతంగా చేస్తుంది!






భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై.

**Godrej**

**పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్**

**మీరు కోరే నాణ్యత. మీరు ఇష్టపడే ధర.**

CLARION/GS/11/244 TEL

సీరియల్

# త్రివేణీసంగమం

దురాశి వెంకటరావు

(గత సంచిక తరువాయి)

## 9

వనజ లేచేసరికి బారెడు ప్రొద్దెక్కింది రాత్రంతా ఆలోచనలతో సరిగ్గా నిద్ర పట్టలేదు

అద్దం ముందు నిలబడి తన ప్రతిబింబాన్ని చూసుకుంది నిద్ర చాలక కళ్ళెర్రగా వున్నాయి కళ్ళు మండుతున్నాయి మళ్ళీ పడకుంటే బావుండు ననిపించింది పడుకుంటే ఎలా? ఎనిమిదో గంటకల్లా డ్యూటీలో వుండాలి

తను చేసేది ప్రవేట్ హాస్పటలులో నర్సు పని తన వుద్యోగం డాక్టరుగారి దయ మీద ఆధారపడి వుంటుంది అతనికిగాని కోపం వస్తే తను నమ్ముకున్న ఆ వుద్యోగం కాస్త వూడిపోవటం ఖాయం

గబగబా లేచి కాలకృత్యాలు ముగించుకుని డ్రెస్ చేసుకుని హడావిడిగా హాస్పటలు చేరుకుంది

గుడ్ మార్నింగ్ డాక్టర్ విష్ చేసింది వనజ, అధరాలపై చిరునవ్వు చిందిస్తూ

యు ఆర్ లేట్ బై హాఫ్ యాన్ హవర్ రాత్రి సెకెండ్ షోకు గాని నంగాడు డాక్టర్ శ్యామ్ ప్రసాద్

అదేం లేదు డాక్టర్ ఎందుచేతో ఈ రోజు యర్లీగా తెలివి రాలేదు

నెవర్‌మైండ్ ఈ రోజు నిన్ను స్పెషల్ వార్డులో వేసాను అక్కడొక డెలివరి కేస్ వుంది చాలా కాంప్లికేటెడ్‌గా కనిపిస్తోంది ఉదయమే పెయిన్సు వచ్చి ఆగిపోయాయి ఆపరేషన్ గాని అవసరం వుంటుందో ఏమో! నువ్వామెను చాలా కేర్‌ఫుల్‌గా చూస్తూ వుండాలి సుమా? మళ్ళీ పెయిన్సు వస్తే తెలియపరచు

అలాగే డాక్టర్

డ్యూటీకి లేటుగా వచ్చినందుకు ఏమంటాడోనని ఎంతగానో బయపడిపోయింది ఐతే అతనేమీ అననందుకు మనసులోనే కృతజ్ఞతలు తెలుపుకుంది

నౌ యు కెన్ గో స్టెతస్కోపుతో ఎవరో బేబీని టెస్టు చేయడంలో లీనమయ్యాడు డాక్టర్ శ్యామ్

డాక్టరుగారి ఆదేశానుసారం స్పెషల్‌వార్డులో అడుగు పెట్టబోయి అక్కడ కంటబడిన దృశ్యానికి గతుక్కుమన్నది ఆమె గుండెలు స్పందించాయి కాళ్ళలో వణుకు పుట్టింది

చటుక్కున వెనుతిరిగి డాక్టరు గారి రూము చేరుకుంది.

పేషంట్లను చూస్తూ బిజీగా వున్నారు డాక్టరుగారు

ఒక నిమిషం తటపటాయించి డాక్టర్' అందామె

ఆమె ముఖంలో ఆవేదన, ఎలుపులో ఆరాటం కొట్టొచ్చినట్లు కానవస్తున్నాయి ఏం వనజా, ఆమెకు పెయిన్స్ వస్తున్నాయా?

లేదు

ఐతే ఆపరేషను తప్పనిసరిలా వుంది కావలసిన యాపరేటస్ సిద్ధం చేయి

అతడి మాటలు ఆమె కర్ణబేరిని చేరటం లేదు

నాదో మనవి డాక్టర్ సందేహిస్తూ అంది ఏమిటన్నట్లు చూసాడు శ్యామ్

మరేం లేదు ఈ కేసులో మరో నర్సుని డిప్యూట్ చేయమని

ఏం అతని చూపులదోలా మారిపోయాయి

ఆమె డాక్టర్ ప్రకాష్ గారి భార్య ఈ ఆపరేషనులో తల్లికి గాని, బిడ్డకు గాని ప్రమాదం వాటిల్లితే, నేను సరిగ్గా సహకరించలేదని అపనింద పడుతుంది కావాలనే నేనా మాతుకానికి పాల్పడ్డానని అంటారు దయచేసి

ఏం వనజా ఈ రోజు అదోలా బేలగా వున్నావ్ వుయ్ షుడ్ ప్రిపేర్ ఫర్ ఎవ్విరిథింగ్

అతనెవరో కాదు డాక్టర్ ఒకప్పటి నా భర్త డైవోర్సు ఇచ్చి మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు

ప్రకాష్ ని భర్తా' హవ్ వండర్ ఈజ్ ఇట్ సంభ్రమాశ్చర్యాలతో చూసాడు శ్యామ్

మౌనంగా నిలబడిందామె

నో ఈ ఆపరేషనులో నాకు నువ్వే ఎసిస్ట్ చెయ్యాలి ఇక్కడ రిలేషన్ షిప్స్‌కి తావులేదు గో అండ్ డూ యువర్ డ్యూటీ

మరి మాట్లాడకుండా అక్కడ నుండి వెళ్ళిపోయింది వనజ

* * * * * *

ఆపరేషన్ థియేటర్ నుండి బయటకొచ్చిన డాక్టరు వైపు ఆశగా చూసాడు ప్రకాష్

సారి మిస్టర్ ప్రకాష్ ఎక్స్ట్రీమ్‌లీ సారి. తల్లిని బిడ్డను బ్రతికించటానికి సర్వ విధాలా ప్రయత్నించాను కాని మనకు విధి ప్రతికూలించింది బిడ్డ మాత్రం క్షేమంగా వుంది" అంటూ వెళ్ళిపోయాడు శ్యామ్ ప్రసాద్

అతని మాటలకు షాక్ తిన్నట్లయిపోయాడు ప్రకాష్ మళ్ళీ ఈ లోకంలో కొచ్చేసరికి చాలా సేపు పట్టింది

శ్యామలా ! బోరుమన్నాడు ప్రకాష్

ఆమె ముఖం వరకు తెల్లటి దుప్పటి కప్పి వెను తిరిగి వెళ్ళిపోయింది వనజ

ప్రకాష్ ఆమెను గమనించే స్థితిలో లేడు అతని కళ్ళు జలపూరితాలయ్యాయి కంఠం వణుకుతోంది

నీ కప్పుడే నూరేళ్ళూ నిండి పోయాయా శ్యామలా! అంధకార బంధురమైన నా జీవితంలోకి జ్యోతిలా ప్రవేశించినట్లే ప్రవేశించి అప్పుడే అస్తమించావా! నీకు నేనేం ద్రోహం చేసాను నన్నిలోకంలో వంటరి వాణ్ణి చేసి ఎందుకు వెళ్ళిపోయావు పసిపాపలా విలపించ సాగాడు ప్రకాష్

అతని టెలిగ్రాం నందుకుని బయలు దేరి వచ్చిన అరుంధతీ, రమేష్‌లు ప్రకాష్‌ని ఆ స్థితిలో చూసే సరికి నీరైపోయారు

రమేష్‌ను పట్టుకుని బావురుమన్నాడు ప్రకాష్

**జరిగిన కథ–6 :** అరుంధతి రూంమేట్స్ వనజ, గిరిజ, మాల అరుంధతి వరకట్నం తీసుకునే యువకుడిని పెళ్ళి చేసుకోనని పెళ్ళి మానేస్తుంది అరుంధతి వనజ భర్త ప్రకాష్ అని, వారిద్దరు విడిపోయారని తెలుసుకుంటుంది. రమేష్, అరుంధతి రిజిస్టర్ మ్యారేజి చేసుకుంటారు మాల అరుంధతికి ఉత్తరం రాస్తుంది రమేష్, అరుంధతిలు వనజను తిరిగి స్వీకరించమని అడగటానికి ప్రకాష్ దగ్గర కెళతారు కానీ అప్పటికే ప్రకాష్ రెండవ వివాహం చేసుకుంటాడు

బిడ్డ పుట్టిన తరుణంలో పుప్పొంగి పరవశించి పోయే ప్రకాష్‌ని చూడాలన్న సంబరంతో పరుగెత్తుకుంటూ వచ్చాడు రమేష్ అంతలోనే అతడి ఆశ తారుమారైపోయేసరికి అతని నోటి నుండి మాటలు పెగలటం లేదు

'అప్పుడే కాలం తీరిపోయి వెళ్ళిపోయింది రమేష్ భయంకరమైన ఒంటరితనంలో, తోడుగా వచ్చి నీడలా వుంది. మురిపించి, మరిపించి మళ్ళ నన్నొదిలి వెళ్ళి పోయింది నేనెవరికి అపకారం చేసాను? ఆ భగవంతుడు నన్నె ఎందుకు శిక్షిస్తున్నాడు చెప్పు రమేష

అతడిని వూరడించటానికి సర్వ విధాలా ప్రయత్నించాడు రమేష్ కాని సాధ్య పడలేదు

పోయిన మీ భార్య ఎలానూ తిరిగి రాలేదు కనీసం ఆ బిడ్డ కోసమైనా మీ గుండెను బండగా మార్చుకోక తప్పదు. ఓదార్చడానికి ప్రయత్నించింది అరుంధతి

తల్లిలేని ఆ పసికందును నేనెలా చూడను? ఎలా పెంచను? దానికి నేనేం చేయగలను" అయ్యో శ్యామలా! నేను కోరుకున్నట్లే పాపనే ఇచ్చావు అందుకేనా నన్నె పెంచి పెద్ద చేయమని వదలేసావు

మరి మాట్లాడ లేకపోయింది అరుంధతి

మీకు అభ్యంతరం లేకుంటె ఆ బిడ్డకు నేను ఆయాగా వుండి పెంచుతాను ఆ పసి పాపను నాకంటి పాపకంటె ఎక్కువగా కాపాడుతాను ముందుకు వచ్చింది వనజ

అంతవరకు ఎవరో నర్సు అనే భావనలో వున్న ప్రకాష ఆమెను చూడగానే గతుక్కుమన్నాడు ఏం సమాధానమివ్వాలో స్ఫురించలేదు ఆమె విడచిపెట్టి వెళ్ళి ఆరేళ్ళయింది పీక్కు పోయిన ముఖం, లోతుకు పోయిన కళ్ళూ, వాటి క్రింద నల్లటి చారలు, సన్నగా కంపలా మారిపోయిన శరీరం అప్పటి వనజకు ఈమెకు అసలు పోలికే లేదు

ఆశ్చర్యం నుండి తేరుకుని 'వనజా నువ్వా' అన్నాడు ప్రకాష

ఔను వ్యక్తిత్వం పేరిట విచక్షణా రహితంగా వ్యవహరించి, సున్నితమైన మీ హృదయం మీద దెబ్బతీసి, మీ జీవితం నుండి నిష్క్రమించాను అందుకు ఆ దేవుడు నాకు సరియైన శిక్షే విధించాడు ఆడదానికి ఈ సంఘంలో ఆశ్రయం, ఆదరణ లభించేది కేవలం భర్త నుండేనని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను నన్ను క్షమించమని అడిగే అధికారం గాని, అవకాశం గాని లేనిదాన్ని

ఆమె మాటలకాశ్చర్యపోయాడు ప్రకాష్

గృహిణిగా మారి మాతృమూర్తి కాగలిగిననాడే ఆడదాని జీవితానికి ఒక అర్థం, పరమార్థం ఏర్పడేది కేవలం చదువు, ధనం, నాగరికతా– ఇవేమీ స్త్రీ జీవితానికి పరిపూర్ణత చేకూర్చలేవు అలా ఎవరైనా అభిప్రాయ పడితే కేవలం కాళరాత్రి కారు చీకట్లో మిణుగురు పురుగు మెరుపు చూసి అదే కాంతినిస్తుందని భ్రమ పడటమే ఔతుంది అనాడు అంతగా ఆలోచించలేక పోవడమే నేను జీవితంలో తప్పటడుగు వేయడానికి కారణం ఏది ఏమైనా ఈ సమాజంలో నా బ్రతుకును చూసైనా ఏ ఆడది అలా ప్రవర్తించకుండా వుంటె అంతే చాలు

అనాడు అంత కాఠిన్యంగా ఉత్తరాలు వ్రాసిన వనజేనా ఈమె? అనాడంత పాషాణంగా మారిపోయిన వనజ మనసేనా ఇది? ఆ దర్పం, ఆ దర్పం అన్నీ ఎక్కడకు పోయాయి? ఏమైపోయాయి? ఆలోచనలో పడ్డాడు ప్రకాష్

వారి అనూహ్యమైన కలయికకు అచ్చెరువొందారు అరుంధతి రమేష్‌లు

నువ్వెంతగా మారిపోయావు వనజా అనే మాటలు అనుకోకుండా అతడి నోటినుండి వెలువడ్డాయి

అజ్ఞానంతో, వ్యక్తిత్వం అనే పేరుతో భర్తను, సంసారాన్ని దూరం చేసుకోవాలనుకొంటున్న వడతులెవరైనా ఈ లోకంలో వుంటె వారిలో ఏ ఒక్కరైనా నన్ను చూసి తప్పటడుగు వేయకుంటె అంతకన్నా కావలసింది ఈ బ్రతుక్కి మరొకటుండదు

ఆమె మాటలు ప్రకాష మనసును కదిలించివేశాయి ఆతని హృదయం సానుభూతితో నిండిపోయింది వంతాలు ఎట్టువలలు పటాపంచలైపోయాయి

వనజా' నువ్వు ఆయావు కాదు ఈ బిడ్డకు కన్న తల్లివి స్వర్గానికెళ్ళిన నా శ్యామలె నిన్ను రూపంలో పంపింది మునుపటి వనజవు కాదు నువ్వు ప్రేమను



# త్రివేణీసంగమం

అమృతాన్ని పంచి ఇవ్వడానికొచ్చిన అమృతమూర్తివి నా ప్రేయసివి అర్ధాంగివి ఆరాధ్య దేవతవు ఆమెను గుండెలకు గాఢంగా హత్తుకున్నాడు

మైకంతో కళ్ళు మూసుకుని బరువుగా శ్వాస తీసుకున్నది వనజ అనిర్వచనీయమైన ఆనందంలో పరవశించి పోయింది

నింగి-నేల ఏకం కావచ్చు పంచభూతాలు కలిసి పోవచ్చు సూర్య చంద్రులు దిక్కులు మార్చుకోవచ్చు మనం మాత్రం మరి వేరు పడటం అసంభవం ఇక మనల్ని ఆ దేవుడు కూడా విడదీయలేడు అతడి కౌగిలిలో మరింత ఒదిగి పోయింది వనజ

వనజను, ప్రకాష్‌ను కలపాలని అరుంధతి శాయశక్తులా ప్రయత్నించింది విఫల మైనందుకు చింతించింది బాధపడింది ఏమి చేయలేనందుకు ఏడ్చింది ఎది మళ్ళీ ఈ విధంగా కలిసినందుకు సంబరపడి పోయింది ఆమె కళ్ళంట అనుకోకుండా రెండు నీటి బొట్లు చెక్కిలిపైకి జారాయి

శ్యామలకు చేయవలసిన దహన సంస్కారాలన్ని స్వయంగా ప్రకాషే చేసాడు అరుంధతి, రమేష్‌లు అతనికి సహకరించారు

శ్యామలా! నువ్వు వెళ్ళి పోతూ ఈ జీవితం చీకటి కాకూడదని కోటి దీపాల కాంతితో ప్రజ్వరిల్లాలని పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న వనజతో మళ్ళీ ముడివేసావు వనజలో నిన్ను చూసుకుంటూ ఈ జీవితం ముగిసిపోవాలని ఆకాంక్షించు నువ్వు నా జీవితంలో ప్రవేశించిన జ్యోతివి ఆరని జ్యోతివి ఆ కాంతి రేఖల్లో వెలుగై, బలమై మమ్ములను కాపాడగలవని ఆశిస్తున్నాను

పటం ముందు నిలబడి శ్రద్ధాంజలి ఘటిస్తున్న ప్రకాష్ వద్ద కొస్తూ సంకోచించి దూరంగా నిలబడింది వనజ

రా వనజా! దగ్గరకు రా

తడబడుతూ సమీపించింది వనజ

బలంగా ఆలింగనం చేసుకున్నాడు ప్రకాష్

ఆ తన్మయత్వంలో వారి లోకాన్నే మరచి పోయి మధురాతి మధురమైన కలలు కంటున్నారు

దూరం నుండి వారిరువుర్ని చూస్తున్న అరుంధతి రమేష్‌ల నయనాల నుండి నీటి బొట్లు రాలాయి అవి అశ్రువులు కావు అక్షతలు వారి జీవితమిలాగే వెయ్యేళ్ళు పండిపోవాలని మనసులోనే దీవించారు

ఆ మరునాడే ప్రకాష్ వద్ద శెలవు పుచ్చుకుని ఇంటి ముఖం పట్టారు అరుంధతి, రమేష్

తలుపు తీసి ఇంట్లో కడుగు పెడుతూనే నేల మీద ఒక కవరు పడివుండటం వారి కంట బడింది

తాము ప్రకాష్ వద్దకు వెళ్ళినప్పుడు పోస్టుమాను తలుపు సందులోంచి ఆ

వుత్తరాన్ని పడేసి వుంటాడనుకున్నారు

ఆదుర్దాగా కవరు చించి ఉత్తరం చదవసాగింది అరుంధతి అది మాల వ్రాసిన ఉత్తరం

అరూ!

నీ ఉత్తరం పూర్తిగా చదివాను వనజ జీవితాన్ని నా కళ్ళ ముందు చిత్రించి నాకో పరిష్కారం చూపావు సంసారాన్ని స్వర్గం చేసుకోవాలన్నా, నరకంగా మార్చుకోవాలన్నా అంతా ఆడదాని చేతిలోనే వుందని వ్రాసావు కడుపున పుడితేనే బిడ్డలు లేకుంటే కారు అనుకోవడం శుద్ధ అవివేకమని అన్నావు నాకూ అలానే అనిపిస్తోంది నీ సలహా తుచ తప్పకుండా పాటించాను గతాన్ని స్మృతి పథంలోంచి తుడిచేసి భవిష్యత్తును బంగారు బాటలా మార్చుకోటానికి, నాకు దూరం అవుతున్న భర్తకు ప్రేమను పంచి చేరువ చేసుకున్నాను ఇప్పుడు ఆయన పూర్తిగా మారిపోయారు నన్ను తన కంటిపాప కంటె మిన్నగా చూసుకుంటున్నారు నీకు పెళ్ళైందని, నీ ఆశయం నెరవేరిందని, కట్నం లేకుండా దేవుడు లాంటి భర్తను చేపట్టగలిగానని వ్రాసావు చాలా సంతోషం మీ నూతన దంపతుల కివే నా శుభాకాంక్షలు విష్ యు హేపీ ప్రోస్పరస్ మేరిడ్ లైఫ్ మీ దాంపత్య రాగవీణ సదా సుస్వరాలనే పలకాలని, మీ జీవన కలశం అనురాగామృతంతో నిండిపోవాలని, ఆనందానికి మారుపేరు మీ జీవితం కావాలని ఆశిస్తున్నాను

నా జీవితంలో తిరిగి వసంతం రావడానికి నువ్వే కారణం నీ ఉత్తరం నా హృదయాన్ని కదిలించింది నువ్వే ఆ సలహా ఇవ్వకుంటే నా జీవన రథం దారి మళ్ళేది అడ్డతోవ పట్టి వుండేది నీ మేలు మరవరానిది నువ్వు మా అంద కే ఆదర్శమూర్తివి మరి వుంటాను తరచూ లెటర్స్ వ్రాస్తూ వుంటావు కదూ!

ఇట్లు, నీ ప్రియమైన

మాల

ఉత్తరం చదవడం పూర్తి చేసిన అరుంధతి కళ్ళు అనుకోకుండా చమర్చాయి

గంగా, యమునా వాటిలో అంతర్వాహినియైన సరస్వతి నదులు పుట్టింది హిమాలయాలలోనైనా పాయలుగా విడిపోయి చిట్ట చివరికి ప్రయాగలో కలిసిపోతాయి అలాగే తన స్నేహితురాళ్ళ జీవితాలూ త్రివేణీ సంగమం లా ఒక కొలిక్కి చేరుకోవడంతో తృప్తిగా శ్వాస తీసుకుంది అరుంధతి

ఆమెను దగ్గరకు తీసుకున్నాడు రమేష్ తన స్నేహితురాళ్ళ జీవితాలూ ఇలాగే మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లాలని మనసులోనే కోరుకుంది

(అయిపోయింది)

# దీప్తయామిని

ఈ అమావాస్య యామిని నెదియొ స్వాదు
దీపలోకము మెల మెల్ల దిగెనొ యేమొ
అనగ భూలోకమందు మహాద్భుతముగ
దీపసందోహ విభవంబు తేజరిల్లె

2

ఎచట జూచిన దివ్వెలే యెచట విన్న
బాణసంచాల పటప టార్భటము లౌర!
వీనులకు కన్నులకు గూడ విందుగొలుపు
కలదె దీపాళికంటె నిక్కపు పసందు!

3

ఒక్కచో చిచ్చుబుడ్లు నిక్కివెలిగె
విష్ణుచక్రము లొక్కచో విఱ్ఱవీగె-
పూలు విరజిమ్మె కాకరపూవులచట
తళుకు బెళుకులు చిందె మతాబులిచట

శనగన నరసింహస్వామి

# వెలుగుబాట

కుదరవల్లి శ్రీలత

సూర్యుడు తన ప్రతాపం చూపించే మధ్యాహ్నపు వేళ అది తన కెవరూ ఎదురులేరన్నట్లు ఆకాశంలో స్వైర విహారం చేస్తూ బాణాలలాంటి తన కిరణాలతో అందరితో యుద్ధం చేస్తున్నట్లుగా ఉంది తట్టుకోలేక దాక్కున్నవారిని చూసి నవ్వుతున్నట్లుంది అతని వాలకం

కాళ్ళకి బందాలేస్తున్న చీర కుచ్చిళ్ళని ఓ చేత్తో పక్కకు ఎత్తి పట్టుకుని, మాటిమాటికీ జారుతున్న హాండ్‌బాగ్‌ని సర్దుకుంటూ, మధ్య మధ్యలో ముఖానికి పట్టిన చమటని కర్చీఫ్‌తో అద్దుకుంటూ నడుస్తూంది సునీత

బయల్దేరిన పది నిమిషాల్లోను అది ఐదోసారి టైమ్ చూసుకోవడం

సువర్చల వెళ్ళిపోయిందో ఏమిటో! ఏదో పనుంది రెండున్నరకన్నా బయల్దేరదామని చెప్పింది ఇప్పటికే పది నిమిషాలు లేటయ్యింది ఎప్పుడూ



చెప్పిన్న ట్రిమ్‌కల్లా చేయడం అలవాటు వెళ్ళిపోయిందేమో?'

లేదా ఇవ్వాళ ఆదివారమేకదా! పనేమి ఉందదుకదా! ఎదురు చూస్తుందేమో!

అనుకుంటూండగానే సువత్సల ఇల్లొచ్చేసింది బయటెవరూ లేకపోయేప్పటికే అనుమానం రానే వచ్చింది ఎందుకైనా మంచిది వెళ్ళి ఒకసారి చూసి వెళ్ళిపోదాం అనుకుంటూ గేటు తీసి లోని కెళ్ళింది

చేతిలోని హేండ్‌బాగ్‌ని ఊపుకుంటూ పరదాని పక్కకి జరుపగానే ఎదురుగా పని మనిషి రంగమ్మ కనిపించింది

'అమ్మ వెళ్ళిపోయిందా రంగమ్మా? అని అడిగింది లేదండమ్మా రంగమ్మ

'ఏంటీ అమ్మగారింకా వెళ్ళలేదా? ఏది లేదే? ఎక్కడా కనిపించనే?

లోపలేదో చదువుకుంటున్నారండి ఇంకా భోజనం చెయ్యలేదండి రంగమ్మ

అరె, పొద్దుట్నుంచి ఏం చేస్తుందబ్బా? నేను తొందరగా ఒస్తానని చెప్పానే! అనుకుంటూ రీడింగ్ రూంమ్‌లోకి అడుగుపెట్టిన సునీత స్నేహితురాలిని ఆ స్థితిలో చూసి ఆశ్చర్యపోయింది

పేషెంట్సుతో అలిసిపోయి వచ్చి, ఏదో పని చేసుకుంటూనో మిగిలిన కొద్ది సమయంలో చదువుకునే సువత్సలకి ఈవేళ మద్యాహ్నం నుంచి అదే పుస్తకం పట్టుకొని చూడడంలో కారణం ఏంటబ్బా?

అయినా తను మద్యాహ్నం ఒచ్చి వెళ్ళినప్పటినుంచీ, అదే పుస్తకం చేతిలో ఉండటం విచిత్రంగా ఉందే! అనుకుంది మనసులో

తనే ముందుగా తేరుకొని సువత్సలకి వెనగ్గా వెళ్ళి మొహంమీదకి ఒంగి,

హాయ్! సువ్వీ! ఏం చేస్తున్నావ్? అంది

ఆ అహ ఏంలేదు నువ్వొచ్చి ఎంతసేపయ్యింది?"

అబ్బ! ఏంటోయ్ నీ పరధ్యానం? పొద్దుణ్ణుంచి చదువుతున్నావ్ ఇంకా కాలేదా? రోజూ నాదే ఆలస్యం అనేదానివి ఇవ్వాళ నీదే లేటయ్యిందే?

సువత్సల ఇదేమి పట్టించుకున్నట్టుగా లేదు ఏదో ధ్యానంలో ఉన్నట్టుగా ఉంది

ఏంటే ఇంత మూడీగా ఉన్నావ్? దేని గురించైనా ఆలోచిస్తున్నావా? సునీత ధ్యానంలోంచి బయటికొచ్చినట్టుగా మెల్లిగా కదిలింది ఓ నిట్టూర్పు భారంగా విడిచింది

తను పడిన బాధ, ఆవేదన అన్నీ తను ఎంత బాధ పడుతున్నాయో చెప్తున్నట్టుగా ఉంది ఆ నిట్టూర్పు

ఎంతటి కర్కోటకులనైనా కదిలించేట్టుగా ఉంది

మెల్లిగా నోరు విప్పి సునీత వైపు తిరిగి,

ఆలోచనలు కాకపోతే ఏంటే? కష్టాలలో ఉన్న వాళ్ళకి ధైర్యం చెప్పి, వాళ్ళని ధైర్యంగా సమాజంలో నిలబడేటట్టు చెయ్యాలి కానీ, మరింత పిరికి మందు పోసి, వాళ్ళని చంపుతున్నారు

సునీ, ఇది న్యాయమంటావా? నువ్వే చెప్పు.

సునీతకి నిజంగా భయమేసింది ఏంటీ ఎప్పుడూ ఇట్లా మాట్లాడుతోంది? తను అనుకున్నట్టు పిచ్చిగాని పట్టలేదుకదా? అనుకుంది

సువ్వీ! నువ్వెందు కివ్వాళ ఇట్లా మాట్లాడుతున్నావ్? ఒంట్లో బాగుండలేదా? పొద్దున బాగానే ఉన్నావ్‌కదా ఈ కష్టాలు, బాధలు, ఏంటి? ఎవరైనా ఏమైనా అన్నారా?"

సునీతకి తెలుసు సువత్సల సున్నిత మనస్తత్వం పేషెంట్స్ చెప్పేకథలు విన్నా అలాగే బాధపడుతుంది కానీ ఇవ్వాళ అట్లా బాధ పడుతున్నట్టుగా అనిపించట్లేదు

సువత్సల సునీత మనసుని చదివేసిందేమో!

చేతిలోని వారపత్రికని సునీత కిస్తూ "చూడవే సునీ, ఈ కథ పూర్తిగా చదువు మధ్యాహ్నం నుంచీ నేనెందుకు బాధపడుతున్నానో నీకే అర్ధమవుతుంది

సునీత పుస్తకాన్ని చేతిలోకి తీసుకుంటూ సువత్సల కళ్ళలోకి చూసింది ఆ ఒక్క చూపే చాలు తను ఎంత బాధపడిందో మనసున్న ప్రతి ఒక్కళ్ళకి అర్ధమవుతుంది

ఇంతలో రంగమ్మ వచ్చింది

'అమ్మా భోజనానికి రండమ్మా సానా పొద్దు పోయినాది అంది

ఆ - ఒస్తున్నా' చూడు రంగమ్మా! అమ్మకి ఓ గ్లాస్ షరబత్ ఇచ్చేయి నేనింతలోపే కాళ్ళు కడుక్కొస్తాను " అంటూ లేచింది

"అట్టాగేనమ్మగోరూ!" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది

సునీత పుస్తకాన్ని చేతిలోకి తీసుకుంది

* * * * *

లక్ష్మీ! తొందరగా తయారవ్వు వాళ్ళు వచ్చే వేళయ్యింది' తండ్రి గావు కేక వినిపించింది హడావుడిగా ఉన్నప్పుడు అట్లా కేక వేయడం ఆయన అలవాటు

అసలే తొందరపడుతూన్న లక్ష్మి వాళ్ళమ్మ ఆ కేకకి ఇంకా తొందరెక్కువై లక్ష్మిని తొందరపెట్టనారంభించింది

లక్ష్మికి గుండెల్లో దడగా ఉంది భయానికి కడుపులో తిప్పేస్తున్నట్టుగా ఉంది అసలే మొదటిసారి పెళ్ళిచూపులు తను సరిగ్గా ఉందో లేదోనని అద్దంలో చూసుకుంది ఎన్నిసార్లు చూసుకున్నా అదే అద్దం, అదే ప్రతిబింబం చూసుకున్న ప్రతిసారి సిగ్గు పెరిగిపోయి రెప్పలువాలిపోతున్నాయి

ఎలా నడిస్తే బాగుంటుంది? కొద్దిగా తలొంచుకుని నడవాలి బాగానే వుంది కానీ ఎవరిలాగా జయసుధ లాగానా? లేకపోతే జయప్రదలాగానా? మరి శ్రీదేవిలాగానా?ఎవరిలాగానడిస్తే బాగుంటుంది?

రెండుసార్లు నడకప్రాక్టీసు చేసి చూసుకుంది

మళ్ళీ ఒచ్చి అద్దం దగ్గరే నిలబడింది గడియారపు చిన్నముల్లు ఏడుకి దగ్గరవుతోంది

ఇంతలో బయటేదో హడావిడి మొదలయ్యింది బాబోయ్ వాళ్ళొచ్చినట్టున్నారు' అనుకుంది భయంగా

ఇంతలో లక్ష్మి చెల్లెలు, తమ్ముడు ఒచ్చి అక్కని తొంగిచూసి ఆ ఒచ్చిన వాళ్ళ పిల్లలతో ఆడుకోడానికి వెళ్ళిపోయారు

మద్యవర్తి ఒచ్చిన వాళ్ళని నాన్నకి పరిచయం చేస్తున్నారనుకుంటా, నమస్కార ప్రతి నమస్కారాల్లు అయిపోయాయి

లక్ష్మి వాళ్ళమ్మ స్వీట్ ప్లేట్లు మాత్రం తీసుకొచ్చి లక్ష్మి ఉన్న రూంలో పెట్టి సర్దుతూంది ఏమి తోచక లక్ష్మికూడా వాళ్ళమ్మకి సహాయం చేస్తూ కూర్చుంది

అబ్బా ఎవరూ లేరు ఎట్లాగో ఏంటో? స్నేహితురాళ్ళెవరైనా ఉన్నా బాగుండేది అనుకుంది

ఇంతలో స్వీట్లున్న ప్లేట్‌ల స్థలాలు మారాయి వాళ్ళు తింటూ మాట్లాడుకుంటున్నట్టున్నారు

ఏమి తోచక ఏం మాట్లాడుకుంటున్నారో విందామని చెవులు రిక్కించింది

ఇంతలో,

ఎవర్దో లావుపాటి గొంతు 'అమ్మాయిని చూపించండి

వర్జ్యం వచ్చేట్టుంది అంది

అలాగే అని ఏమేవ్ అమ్మాయిని తీసుకురా అని లోపలికొచ్చి చెప్పి లక్ష్మి దగ్గరకొచ్చి

అమ్మాయ్ తల దించుకోమ్మా నవ్వకు అని చెప్పి ఏమేవ్ జాగ్రత్త అని భార్యను మరోసారి హెచ్చరించాడు

తెలుసులెండి నాకు మీరు చెప్పాలా ఏంటి? అని లక్ష్మి వైపు తిరిగి నెమ్మదిగా నడు అని మరోసారి చీర సర్ది అందరి ముందుకూ తీసుకెళ్ళింది

లక్ష్మి అచ్చం సినిమాల్లో పెళ్ళి చూపుల్లో మాదిరి హీరోయిన్లు నడిచినట్లే నడిచింది

లక్ష్మి కాళ్ళలో ఒణుకు ప్రారంభమయ్యింది

తన తండ్రి ఎక్కువ మొత్తం ఇచ్చుకోలేడని తెలుసు అయినా తన అదృష్టం బాగుంటే ఓ మంచి వరుడు రాడూ అని అనుకుంది తను మొన్నేదో సినిమాకెళ్తే అందులో హీరో హీరోయినికి ఇలాగే పెళ్ళి చూపులౌతాయి కట్నాల గొడవ రాగానే నాకు కట్నమేమి ఒద్దు మీ పిల్లే మాకు కట్నం అని ఓ పెద్ద డైలాగ్ చెప్పి అష్టకష్టాలుపడి అందరినీ ఎదిరించి పెళ్ళి చేసుకున్నాడు తను ఆ సినిమా ఏ ఐదుసార్లు చూసిందో ఎప్పుడు చూసినా అబ్బ ఎంత అదృష్టం' అని అనుకోకుండా ఉండలేక పోయేది

ఈమధ్య సినిమాలు చూడటం, నవలలు చదవడం, ఆ హీరో హీరోయిన్లతో తమని పోల్చుకోవడం తృప్తిపడటం, లేదా బాధ పడటం, వాళ్ళలాగే తామూ తయ్యారవాలని తాపత్రయపడటం- మనిషికి పరిపాటయిపోయింది

ఇది యవ్వనంలో నున్న పిల్లలకి మరీ ఎక్కువ

అమ్మాయిని తీసుకెళ్ళొచ్చు అని విన్పించింది, మెల్లిగా లోపలికొచ్చి వాచీ చూసుకుంది 'అబ్బ అప్పుడే అరగంట అయిపోయిందా? అనుకుంది స్వగతంగా

తన పరధ్యానానికి తనని తాను తిట్టుకుంటూ "కనీసం తలయినా ఎత్తి చూడలేదు అబ్బాయి ఎట్లా ఉన్నాడో తల ఎత్తి చూస్తే బాగుండేది

బొమ్మపడితే నాగార్జున సిమెంట్‌తో ఇల్లు కడ్తాను,
బొరుసు పడితే ఇల్లు కట్టడానికి నాగార్జున సిమెంటే వాడ్తాను.



అనుకుంది

ఇంతలో బయట గదిలోంచి ఏవో మాటలు విన్పిస్తున్నాయి మనసులో ని ఆలోచనలని నెట్టేసి కనీసం ఆ మాటలయినా విందామని మెల్లిగా తలుపెనక్కి చేరి చెవులు రిక్కించింది

ఎవర్తోగానీ ఓ మగకంఠం అడుగుతుంది ఎంతలో ఉన్నారు" అని

మెల్లిగా నాన్నాడు లక్ష్మి తండ్రి

తర్వాత వాళ్ళేం మాట్లాడుకున్నారో వినబడలేదు "తర్వాత కబుర్లు చేస్తాం" అని వాళ్ళన్న మాట విన్పించింది

కుర్చీల చప్పుడు తగ్గిపోయింది నాన్న ఒచ్చిన వాళ్ళందరినీ మెల్లిగా సాగనంపి లో నికొచ్చాడు

లక్ష్మి వాళ్ళనాన్న మొహం చూడగానే తెలిసిపోయింది ఈ సంబంధం తప్పిపోయిందని

లక్ష్మి మెల్లిగా లో పలికి తప్పుకుంది

తల్లి గునుస్తూంది అప్పుడే ఎందుకు చెప్పారు? ఏ అప్పో, సొప్పో చేసి పెళ్ళి చేసే వాళ్ళమేగా!

నాకూ తెలుసే వాళ్ళడిగిన దానికి కొద్దో గొప్పో ఎక్కువైనా ఎలాగైనా సర్దేద్దామనే ఉద్దేశ్యంతో నే ఈ పెళ్ళి చూపులకి ఒప్పుకున్నా, కానీ వాళ్ళడిగిన కట్నం అంతా అప్పుచేసి తెచ్చి పిల్ల పెళ్ళి చేసినా మన మనవళ్ళకాదు, ముని మనవళ్ళు కూడా కనీసం వడ్డీ అయినా తీర్చగలిగే స్థితిలో ఉండరేమో అన్నాడు నీరసంగా

'ఏం? ఎంతలో ఉన్నారేంటి?"

"ఆ! మనకందరులే అయినా వాళ్ళకి ఇంకో సంబంధం ఉందంటలే అక్కడికే ఇప్పుడు వెళ్తున్నారు వాళ్ళు వీళ్ళకి సరిపోతారనుకుంటా

"ప్చ్! ఏమైనా సత్యా! ఈ రేట్లు చూస్తే ఇహ ఈ జన్మలో పిల్ల పెళ్ళి చెయ్యగలనా అనిపిస్తూంది అని బాధ పడ్డాడు

'మన ప్రయత్నం మనం చేద్దాం తేపై పిల్ల అదృష్టం

కళ్యాణమొచ్చినా, కక్కొచ్చినా ఆగదంటారు ఆ ఘడియొస్తే మనమాపినా ఆగదు

"అయినా ఒక్కసారికే దిగాలుపడితే ఎట్లా ఇంకా ఎన్ని చూడాలో ఏమో?

"ఈ పూట వంట ప్రయత్నమే చేయలేదు ఎల్ల లొచ్చే వేళయింది. నే వంట మొదలెడతాను అనుకుంటూ లో నికెళ్ళింది

ఓ గ్లాసు మంచి నీళ్ళివ్వవే అంటూ ఎలిచాడు లక్ష్మి తండ్రి

లక్ష్మి వాళ్ళమ్మ సౌవడిలో వంట ప్రయత్నంలో ఉన్నట్లుంది వినిపించుకోలేదు

కొద్దిసేపు చూసి అమ్మాయ్ లక్ష్మి ఓ గ్లాస్ మంచినీళ్ళివ్వమ్మా అన్నాడు

లక్ష్మి వంటింట్లోకెళ్ళి ఓగ్లాసు మంచినీళ్ళిచ్చి లో పలి కొచ్చేసింది మెల్లిగా మంచాన్ని చేరింది

* * * *

ఇంట్లో వాళ్ళంతా మెల్లిగా ఎవరి దారిన వాళ్ళు నిద్రలో కొరిగారు ఆ రాత్రి లక్ష్మి బాగా

# వెలుగుపూలు

నక్షత్రాల్ని చూస ముని సంపాలిటి దీపాలు వెలగని
ఏపుల్లో ప్రవేలాత గట్టండి
ఆకాశం నుంచి జాబిల్లిని ఓ పూటకు అద్దెకు
తసుకొని
రోదిస్తున్న ఆ బాబు చేతిలో పెట్టండి
మతాబుల వెలుగు పూలని
ఐరతపూత నగలో అలంకరించండి
చిచ్చుబుడ్ల వెలుగు దారాల్ని సాలఘులకిచ్చి
బుస్సాండలో ని గుడ్డ బిచ్చగానిక బట్టలు
నేయించండి
మిణుగురుల్ని పట్టి ఇంటిముంగిట
రంగవల్లులు తీర్చిదిద్దండి
సూర్యకిరణాల్ని కృపాణాలుగా చరించి
మతో న్మాదుల మట్టుపెట్టండి
ఇలవేతలాని చూసుకు వస్తున్న ఉల్కల్ని
మచ్చాలో అవి
త్రిశంకు స్వర్గంలో సెటిల్ కమ్మని చెప్పండి
అరాచకపు శక్తుల్ని ఆత్మస్థైర్యమనే
డైనమెట్లతో పేల్చి పారేయండి
ఆత్మజ్యోతి ఆరిపోయేటట్లుంచి
త్వరగా జ్ఞానం తైలం పోయండి
చీకటి భూతాన్ని వెలుగు పొలిమేరల దాకా
తరిమి తరిమి కొట్టండి

—ఆర్. పట్టాభిరామరాజు

# వెలుగుబాట

ఆలోచించింది

ఇన్ని రోజులుగా తను కట్టుకున్న మేడలన్నీ గాలిమేడలై కూలిపోయినట్టుగా ఫీలయ్యింది

వాళ్ళక్కావాల్సింది అందం, డబ్బు ముఖ్యం నాకంటే ఇంకొకళ్ళురేటు ఎక్కువ పెడతున్నారు కాబట్టి వాళ్ళనే ఆ అదృష్టం వరిస్తుంది ఒకవేళ

వాళ్ళు డబ్బు ఎక్కువ పెట్టలేకపోతే వాళ్ళగతి ఇంతేనేమో లక్ష్మిలో ని మనిషి నిద్రలేచింది అహ మీరుదాన్ని మనసంటారేమో దానిపని మొదలేసింది

తానేమనుకుంది ఇప్పటివరకు అందంగా ఉంటే బాగుండుఅనికదూ, డబ్బుంటే బాగుండేది అనికదూ! అనుకుంది

నల్లగా ఉంటే తెల్లనిపిల్ల కావాలని, తెల్లగా ఉంటే సినిమా యాక్టర్లలాగా ఉండే వాళ్ళుకావాలని, లావుగా ఉంటే సన్నవాళ్ళు కావాలని, సన్నగా ఉంటే మరి ఎండిపోయినట్టున్నారు టి బి పేషంట్లలాగా ఉన్నారని, అందమైన వాళ్ళు కావాలని అంటారు

'ఏం! అందమే పెళ్ళికి అర్హతా?

ఒకళ్ళనొకళ్ళు పరస్పరం అర్థం చేసుకొని, జీవితాంతం ఒకళ్ళ కొకళ్ళు తోడుగా ఉండటానికి డబ్బు కావాలా?

మంచి మనసుంటే చాలదా!

ఈ మధ్య ఒకళ్ళింటికి వెళితే వాళ్ళచుట్టాలావిడ అన్నది జ్ఞాపకమొచ్చింది

'పిన్నిగారూ! మా అబ్బాయికి రంభా, ఊర్వశి, మేనక లున్నంత అందం గలమ్మాయి కావాలని నేననడంలేదు 'మామూలుగా ఉంటేచాలు

'కానీ పిన్నిగారూ! మరి తీసిపడేసేట్టు ఉండకూడదండి ఎవరైనా ఏమైనా అంటేకూడా బాగుండదు సుమా!' అంది

తన కొడుక్కి పెళ్ళిచేసేది ఊళ్ళో అందరూ మెచ్చుకోవడానికా? మరి తీసిపడేసేట్టు ఉండకూడదంట ప్చ్, ఏం మనుషులో ఏం మనస్తత్వాలో ఏంటో ?

ఇలా అమ్ముడుపోయే మగాళ్ళని బజార్లో పాడినట్లే, వాళ్ళని కూడా బయట నిలబెట్టి పాటపాడితే నయమేమో, ఎవరెంత రేటుపెట్టగలరో వాళ్ళకే దొరుకుతారు

ఏముంది ఈ పెళ్ళి చూపుల్లో? 'అసలు ఈ తరహా మనుషులకి మనసుండదా?ఇప్పటివరకూ, తనని తానేమనుకుంది నాకు బాగా అందముంటే బాగుండునని, బాగా డబ్బుంటే బాగుండునని తనని తాను కించపరుచుకుంది

కాని ఆలోచించిన లక్ష్మి ఇప్పుడనుకుంటుంది అసలు వీళ్ళిట్లా మనసు చంపుకొని, ఎలా ఉండగల్గుతున్నారు?

ఆలోచించిన కొద్దీ మనసు మంచిగా పనిచేయడం మొదలెట్టింది

అవును మరి రోజూ వాడకపోతే ఏదీ పనికిరాదు

లక్ష్మికి ఆ రోజంతా బుర్రకి పని చెప్పింది చివరికో నిర్ణయానికొచ్చి నిశ్చింతగా నిద్రపోయింది

* * * *

తెల్లారి లేవగానే తలస్నానం చేసింది

తండ్రి కూచొని పేపరు చదువుతున్నాడు

శుక్రవారం కాబట్టి లక్ష్మివాళ్ళమ్మ ఇంకా పూజలో నే ఉంది

మెల్లిగా వెళ్ళి చేతులు జోడించి దేవుడికి దణ్ణం పెట్టుకుంది

లక్ష్మి భగవంతుడా నే ఎన్నుకున్న మార్గంలో ఏమైనా తప్పులుంటే దిద్ది, నా ఆశయాలు నిజమయ్యేట్టు చెయ్యి అని మొక్కుకుంది

కుంకుమతీసి నుదుట పెట్టుకుంది

మెల్లిగా బయటకొచ్చి తండ్రి వెనక చేరింది

మెల్లిగా భయంగా అయినా, దృఢనిశ్చయం ప్రతిధ్వనించే గొంతులో చెప్పింది తన నిర్ణయాన్ని

నాన్నా నే చదువుకుంటానని

'అలాగేనమ్మా నువ్వెంతవరకు కావాలంటే అంతవరకూ చదువుకో అన్నారు లక్ష్మి నాన్న

చదువుమీద ధ్యాసతో బాగా చదివి, స్కాలర్ షిప్‌తో ఎం బి బి ఎస్. చదివింది

తలిదండ్రులు మధ్యలో గొడవచేశారు ఎట్లాగైనా పెళ్ళిచేసి అత్తారింటికి పంపిస్తామని

కానీ, లక్ష్మి ఆలోచించింది ఒకవేళ తండ్రి చెప్పినట్లు పెళ్లి చేసుకుంటే తను అత్తారింట్లో సుఖపడేది అట్లా ఉంచి తల్లితండ్రి, తననికన్న పాపానికి అప్పుల పాలవడం, తనకి తోడపుట్టిన పాపానికి తమ్ముడూ, చెల్లెలూ రోడ్లమీద అడుక్కునే స్థితికి రావడం ఖాయం

ఎంత చెప్తున్నా వినకుండా తను సంపాదించి, తమ్ముడిని, చెల్లెలిని చదివించింది పెళ్లిళ్లు చేసింది

ముసలివాళ్లు కాలం చాలించారు

తమ్ముడు, చెల్లెళ్లు, వారివారి ఇళ్లల్లో అన్యోన్యంగా కాపురాలు చేసుకుంటున్నారు

ఎప్పుడూ బాదపడని లక్ష్మి ఒంటరిగా పీలవడం మొదలెట్టింది ఎంత ఒద్దనుకున్నా చెల్లెలు, తమ్ముడు వాళ్ల అన్యోన్య దాంపత్యం కళ్లముందు కదలాడేది

ఏంటి! తను ఈర్ష్య పడుతోందా? అనుకునేది

చీ! ఎప్పటికీకాదు వాళ్లు సుఖంగా ఉండటమే తనకు కావలసింది అనుకునేది

కానీ మనసు రోజుకోసారి పెళ్లిమీదకి ధ్యాసమళ్లేది

తోడుకోసం, కనీసం తన బాద చెప్పుకోడానికైనా ఓ తోడు కావాలనిపించేది

తను పెళ్లి చేసుకుంటె తనకిప్పటికి ఎన్నేళ్ళ పిల్లలుండేవాళ్ళోకదా అనుకునేది

తనకేముంది? తనకోసం చూసే పిల్లలా?పేషెంట్లు తప్ప వాళ్ల బాదలన్నీ చెప్పి తగ్గించుకు వెళ్లిపోతారు కాని తన బాదవినే వాళ్లెవరు?

జీవితం రొటిన్ అనిపించింది ఏముంది పేషెంట్లు, ఇల్లు ఇదేనా జీవితం తానేదో కోరుకుంటున్నట్లు తనకి తెలిసిపోతుంది

'పోని పెళ్లిచేసుకుంటేనో అయ్యో' ఇప్పుడే అయినా తననెవరు చేసుకుంటారు

మనసు టూలేట్ అని చెప్పినట్లనిపించింది దేనికైనా ఆత్మధైర్యం ఉండాలి అదిలేకపోతే మనిషి జీవించడం కష్టమేమో!

లక్ష్మికి అన్నింటికంటే ముఖ్యమైన ఆత్మస్థైర్యమే కోల్పోయింది దాంతో గుండె బరువెక్కింది స్లీపింగ్ పిల్స్ తీసింది ఒకొక్కటి గొంతులోకి పోతుంటే అనుకుంది భగవాన్! కనీసం 'ఒచ్చే జన్మలోనైనా నా కోరిక తీర్చుబగవంతుడా, అనుకుంది

*    *    *    *

కథ చదివిన సునీత గుండె కూడా బరువెక్కింది

ఇంత చదువు చదివిన లక్ష్మి పిరికిగా, ఇంత తెలివి తక్కువగా పెళ్లికాలేదే అనే బాధతో చచ్చిపోయిందా ?

లక్ష్మి పిచ్చితనానికి కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి సునీతకి

చేతిపై పడ్డకన్నీళ్లని చూసుకొని ఒహ్ ఇది కదే కదూ!" అనుకుంది

కాదు ముమ్మాటికీకాదు ప్రతి కథనం మనం కల్పించినదైనా కనీసం ఆ స్థితిలో ఉన్నఒక్కరికైనా దారి చూపించే, వాళ్ల కష్టాలను గట్టెక్కించగలిగితే దానికి ఫలితముంటుంది అనుకుంది తనలో

అప్పుడే జొంచేసి ఒస్తున్న సువత్సల గాలికెగిరిపోకుండా పేపర్లపైన- పెన్నుపెట్టి ఉన్న రెండు పేపర్లని చూసి చేతిలోకి తీసుకుంది

ఇంతలో పనిమనిషి 'హాస్పిటల్‌కి టైమయ్యిందమ్మా అని పిలిచింది

ఒస్తున్నా రంగమ్మా అంటూ సున్నీ' ఇది చదివి చెప్పవే ఎలాఉందో అని సునీత ఒడిలో పేపర్లుంచి ఇప్పుడే తయారై ఒస్తాను అని చెప్ప లోపలి కెళ్లింది

రంగమ్మ ఇచ్చిన జూస్ త్రాగుతూ చదవడం మొదలెట్టింది

నేనెప్పుడూ పిరికదాన్ని కాకూడదు పెళ్ళే జీవిత పరమార్థం కాదు ఇకనైనా మంచిగా చదివి నలుగురికి సహాయం చేస్తే తన జీవితానికి ఓ సార్థకత దక్కుతుంది అనుకుంది

తాను ఈ సంవత్సరం ఎంట్రన్స్ రాస్తే అనే ఊహ తట్టింది తానొక నిర్ణయం తీసుకోగానే మనసు ప్రశాంతంగా మారిపోయింది తానిప్పుడు తండ్రి కట్నమిచ్చి పెళ్ళి చేయలేదని, తనకు పెళ్ళి కొడుకులని ఆకట్టుకొనే అందం లేదని బాద పడడం లేదు కాబోయే పెళ్ళి గురించి, పుట్టబోయె ఎల్లల గురించి ఇపుడు ఆలోచించడం లేదు

పరిక్షల్లో ఎలా పాస్ అవ్వాలో అనే విషయం తానిప్పుడు ఎంత మందికి సహాయపడగల్గుతానో? అన్న విషయమే ఆమెని ఆలోచింప జేశాయి

పగలు, రాత్రి కష్టపడి ఎం బి బిఎస్‌లో సీటు సంపాదించింది స్కాలర్‌షిప్ పై చదివి తల్లితండ్రులకి బరువు కాకుండా చదువు పూర్తి చేసింది

ముందు ప్రయివేటుగా ఒక్క రూంతో ప్రారంభమైన తన క్లినిక్ 20 రూమ్‌ల నర్సింగ్ హోమ్ అయ్యింది

ఇప్పుడు ఆమె దేవతగా, ఆమె చూస్తే చాలు రోగాలన్నీ మాయమవుతాయను కునే వాళ్ళు కొందరైతే, ప్రశాంతమైన ఆమె మొహంలో ఆప్యాయత వెతుక్కునే వాళ్ళు కొందరు

ఓ పెద్ద ఆశ్రమంలో అందరి దృష్టిలో అది అనాధశరణాలయం కావొచ్చేమో! కానీ ఆమె దృష్టిలో మాత్రం అది దేవాలయం చిన్నా పెద్దా ఎల్లలంతా ఆమె రాక కోసం ఎదురు చూసేవాళ్ళే

సమయం దొరికితే చాలు ఆమె ఉండేది ఆశ్రమంలో లేదా రిడింగ్ రూంలో

అప్పుడప్పుడు తానను కుంటుంది- ఒక వేళ తనకిపుడు పెళ్ళయితే పిల్లలు తన ఇల్లు సంసారం తప్ప ఏమి తెలిసేది కాదు కానీ ఒకరిద్దరు పిల్లలకే తల్లయి వారిని పెంచడమే కాదు మాతృత్వానికి హద్దు ఏది? పిల్లలందరూ ఆప్యాయంగా అనురాగంతో అమ్మా! అని పిలుస్తారు జీవితంలో









## వెలుగుబాట

ప్రతిస్త్రీ ఆ పిలుపు కోసం తపించి పోతుంది

సువత్సల ఎప్పుడూ పెళ్ళి కాలేదని, పిల్లలు లేరని బాధ పడలేదు అవును మరి ప్రతి మనిషిలో నూ తానై, అందరిలోను తనని చూసుకుంటూన్న, మనసున్న ప్రతి మనిషి ఎప్పుడూ బాధపడదు

తను నలుగురికి దారి చూపిస్తాడే కాని, తను ఎప్పుడూ జీవితాన్ని బలిచేసుకోడు

అందరినీ తను కావాలను కుంటే తనని కూడా అందరూ కావాలను కుంటారు అపుడు ఆ వ్యక్తి ఒంటరిగా బాధపడదు పిరికిగా జీవితాన్ని త్యాగం చేసుకోరు

* * * * *

చదవడం పూర్తి చేసిన సునీత కూడా సువత్సలని అభినందించకుండా ఉండలేక పోయింది తన అభిప్రాయాన్ని కూడా వెలిబుచ్చింది

నిజమే సువ్వీ! పెళ్ళనేది జీవితంలో భాగం మాత్రమే పెళ్ళికి డబ్బు అందం అర్హతలు కావు

ఒకరినొకరు అర్థం చేసుకొని నూరేళ్ళు జీవించడానికి ఒకరి కొకరు తోడుగా ఉండటానికే పెళ్ళి ఒక వేళ అవి జరగకపోతే, జీవితమే వ్యర్థమనే భావన నశించాలి

మనం ఎన్నుకున్న బాట మంచిదయితే దాంట్లో ఎన్ని అవాంతరాలొచ్చినా పట్టుదలతో ముందుకు నడిస్తే ఆ ధ్యేయంతో ఉన్న మరికొందరికి దారి చూపించిన వాళ్ళమవుతాం మనం నడిచే బాట సరియైనదైతే దాన్ని సాధించడానికి ఎన్ని కష్టాలైనా, ఎదుర్కోవాలి అంది సునీత

సునీతకి తెలుసు సువత్సల ఎందుకంత బాధపడిందో

సువత్సల జీవితం కూడా అలాంటిదే అవడంతో అంత బాధపడి తన జీవితంలో ఏవిధంగా ధైర్యంగా నిలబడిందో ఆ ముగింపే కథ రూపంలో రాసి మరికొందరికి ఓ దారి చూపింది

అందుకే సునీత సువ్వీ! నువ్వు నిజంగా వెలుగుబాటవి అని అంది సంతోషం, ప్రతిధ్వనిస్తున్న కంఠంతో □

# దీపావళే నా పుట్టిన రోజు

—కె. కె. శర్మ

దీపావళి వస్తోందంటే అందరికన్నా నాకు సరదా ఎక్కువ సరదాతో పాటు భయం కూడానూ

ఎందుకంటే నేను దీపావళినాడు పుట్టాను గనుకో

పుట్టిన రోజు నాడు మన సాంప్రదాయం అయినా కాకపోయినా చాలామంది కేక్ మీద వయసుకు తగినన్ని కొవ్వొత్తులు పెట్టి వెలిగించి ఊది ఆర్పేసి కేక్ కోస్తారు నా అలవాటు అది కాదు అరుగుమీద నా తృప్తి కోసం ఓ అరవై కొవ్వొత్తులు వెలిగించి నా వయస్సు అయిపోయినన్ని కొవ్వొత్తులు ఆర్పేసి మిగతావి వెలుగుతూండగా కాకరపువ్వొత్తులు కాల్చుకుంటా అదో సరదా

ఒకసారి ముమ్మరంగా మేము నాటకాలు ఆడుతున్న సమయంలో పొట్టి ప్రసాద్ అడిగితే దీపావళి నా పుట్టిన రోజు అని చెప్పాను అంతే! ఒక్కసారి కెవ్వున కేకెట్టి మూర్ఛ వచ్చినట్టు పడిపోయాడు మేమందరం కంగారుపడ్డాం సోడా



తెచ్చి మొహంమీద చల్లి పట్టించాడు ఒకడు అగరవొత్తి పుల్ల వెలిగించి గాలి ధూళి పట్టిందేమో అని ఆంజనేయ స్తోత్రం చేశాడు మరొకడు నీరసం వచ్చి నరాలు పీక్కుపోయాయేమోనని హార్లిక్స్ పట్టించాడు మరొకడు ఏమైతేనేం అన్నీ సేవించి లేచి కూర్చున్నాడు ప్రసాద్ ఏమైందిరా? అన్నాను నరక చతుర్దశినాడు చచ్చి దీపావళినాడు పుట్టేశావేమిట్రా నరకాసుర శర్మగా నాటక కళను నరికి ముక్కలుచేసి తినేస్తున్నావు కదరా! అందుకే కళ్ళు తిరిగిపడ్డాను అన్నాడు

అది విన్న మా వాళ్ళంతా పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వడమే కాకుండా ఆనాడు టపాకాయల్లాగా స్టేజీమీద పోర్షన్లు మరచి డూడలు వేశారు కూడా

కామెడి క్వీన్ రమాప్రభకు నాటకాలంటే అభిమానం నాకు ప్రాణం రమాప్రభకు ఒంటినిండా వస్తువులు వేసుకుని తిరగడమంటే భలే సరదా ఎక్కడికైనా బయలుదేరితే బుట్టబొమ్మలా చేతులకు చెవులకు మెడలో ఆభరణాలు వేసుకుని మరీ బయలుదేరుతుంది

ఒకసారి ఏదో నాటకానికి మేం పొదుగూరికి వెళ్ళాం గెస్టుహవుస్‌లో బస చప్పున స్నానాలు ముగించి రిహార్సల్స్‌కు హాజరవ్వాలని అందరికి ఆర్డర్ వేసింది

ఆర్డర్ ప్రకారం స్నానం పూర్తయ్యాక ఆమె గదిలోకి వెళ్ళాను ఆమె సీమ టపాకాయలా నా మీద పేలిపోతోంది విషయమేమిటో అర్థంకాలేదు ఏ ఊరికెళ్ళినా నాకు ఫ్రెండ్స్ ఎక్కువని పార్టీలు ఎక్కువని రిహార్సల్స్ టైముకి రానని నాతో దెబ్బలాడుతూంటుంది అందుకే అనుకుని టైముకి వచ్చినా తిట్టడం మానరా మేడమ్? అని అడిగాను

ఈ జోక్‌లు వదిలేసి నా నెక్లెస్ ఇయ్యి అంది నెక్లెస్ ఏమిటి? అన్నాను

వచ్చేటప్పుడు ఇంటి నుండి నేను వేసుకొచ్చింది ఇక్కడ పెట్టాను కనబడలేదు నువ్వు తీశావుట ఇచ్చేయ్ మర్యాదగా! అంది టపాకాయలు పేలినట్టు నేను తీశానని చెప్పింది ఎవరు? అన్నాను తాటాకు టపాకాయలా ఎవరైతే ఎందుకు? నువ్వు తీశావు ఇచ్చేయ్ అంది చిచ్చుబుడ్డిలా మీరు చూశారా? అడిగాను

లేదు అంది తడిసిపోయిన అగ్గిపుల్లలా మరి నేనే తీశానని చెప్పిన రాస్కెల్ ఎవరు? అని గర్జించాను ఆటంబాంబులా ధమ్‌గాడు అంది మతాబాలా పక్కనే ఉన్న ధమ్‌గాడి చొక్కా కాలర్ పట్టుకుని ఏరా! ఇడియట్! నేను తీశానా? అని అడిగాను ఏమో! నా ప్రెడిక్షన్ ప్రకారం నువ్వు అనుకుంటున్నాను అన్నాడు నీ ఎండా కూడు నీ ప్రెడిక్షన్ ఏమిట్రా? అడిగాను ఏమోనబ్బాయ్! నువ్వు అమావాస్యనాడు పుట్టావు అమావాస్యనాడు పుట్టినవాడు దొంగ అయినా కావొచ్చు ఖూనీకోరు అయినా అవొచ్చు తిరుగుబోతు కావొచ్చు ధీర కావొచ్చు అని పెద్దలన్నారు కాబట్టి కాకాసుర శర్మగారు తీసి ఉంటాడని నా డౌట్ అని చెప్పాన్రా అన్నాడు ఈ ఘర్షణ సమయంలో మన్మథుడు శరత్‌బాబు వచ్చాడు విషయం అడిగాడు రమాజీ చెప్పింది నీ మొహం! టేబుల్‌మీద పడేసి బాత్ రూమ్‌కి వెళ్ళావు నేనే మెడలో వేసుకుని బయటకు వెళ్ళాను అన్నాడు రమాజీతో పాటు అందరూ పేలని టపాకాయల్లా ఉండిపోయారు నిజమే రమాప్రభ మనసునే దోచుకున్నాడు నెక్లెస్ ఏ పాటిది? అన్నాను ఆమె ముఖంలో వెయ్యి మతాబుల కాంతి విరజిమ్మింది

నేను పుట్టగానే బరంపురం బిజ్జిపురంలో డెబ్భై ఇళ్ళు దీపావళికి తగలబడిపోయాయట మా అమ్మ అంటూ ఉండేది. అంతేకాదు, నా జీవితం ఎలా ఉంటుందో అని బెంగపడి పోయింది.

ఉన్నవాళ్ళ కుటుంబంలో పుట్టిన మేము నాన్నగారు పోవడంతో కష్టాల ఊబిలో పడ్డాం. దీపావళిపండుగ ఎంత ఘనంగా చేస్తారో అని అనిపించుకున్న మేము - ఇతరులు చేసుకుంటున్న సందడి చూసి సంబరపడటం అలవాటుగా మొదలయింది.

ఎస్. ఎస్. ఎల్ సి గట్టెక్కడానికి రెండు సంవత్సరాలు టపాకాయల్లా పేల్చేశాను పై చదువులకు మందు కుక్కని ఖాళీ మతాబు గొట్టాం అయిపోయింది బ్రతుకు ఈ ఖాళీ గొట్టాంలో మందు నింపడానికి కలకత్తాలో ఉద్యోగం మొదలైంది అక్కడ మతాబు చిరిగిపోయింది అక్కడ నుండి టాటానగర్‌లో పడ్డాను కాగితం గొట్టాం చిరిగిపోతుందని గట్టిగా ఉంటే మంచిదని చిచ్చుబుడ్డి డొక్క తీసుకుని మందు కుక్కాను దానిలో పాళ్ళు సరిగా లేక వెలగలేక వెలగలేక ఆరిపోయింది అంతే!

సరిగ్గా ఓ పెద్ద సర్కస్ కంపెనీలో బఫూన్‌గా పడ్డాను అక్కడున్నంత కాలం ప్రతి రాత్రి దీపావళే మనసులో అగ్నిగోళాలు బ్రద్దలవుతున్నా ఇతరులను నవ్వించడమే కర్తవ్యం అందుకే రాజ్‌కపూర్ మేరే నామ్ జోకర్ సినిమా చూసి తలచుకొని ఏడ్వని రోజులు లేవు సరిగ్గా అదే సమయంలో అదే బాటలో పంది నా జీవిత

## "భలే మిత్రులతో రమ్య, ఆనంద్ బాబు

ప్రయాణం కూడా మనసుని చంపుకోలేక ఆ నవ్వుల రాత్రులకు ఎసింద్రి వెలిగించేసి ఎలెక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పడ్డాను వెలుతురు లేకపోతే జీవితం అంధకారబంధురమే స్విచ్ వెయ్యగానే

వచ్చిన వెలుతురును చూసి సంబరపడి పోతున్నంత సమయంలో నే ఫ్యూజ్ మాడిపోయి అంధకారంలో మిగిలిపోయిన నేను ఊపిరి తీసుకుని ఇంజినీరింగ్ కాలేజిలో వచ్చి పడ్డాను నేను ఊహించకుండానే నా జీవిత సౌధానికి అక్కడ ఇనుప వస్త్రాలు, బద్దలు



వేసి గట్టిగా నిర్మించారు నా శ్రేయోభిలాషులు మనసు బలమైనదా ఇనుము బలమైనదా అని నాలో నాకే పర్షణ మొదలైంది ఓ డైనమైట్ పెట్టి పేల్చాను వీటన్నిటికంటే బలమైనది విధి అని ఆలస్యంగా తెలిసింది నేను పెట్టిన డైనమైట్ ఒక్క ఇనుమే కాదు ఉక్కుతో కట్టబడ్డ నా సౌధాన్ని నిలువునా కూల్చేసింది

చిరునవ్వుతో రైలుపట్టాల మీద పడ్డాను జీవితం ఒక రైలు ప్రయాణంలాంటిది అని తెలుసు కష్టాలలో సుఖాలలో నష్టాలలో లాభాలలో పయనించే కోట్లాదిమందిని వారి వారి జీవిత గమ్యాలలో ఇంజన్ డ్రైవర్‌గా దింపిన నేను నేనూ ఒక ప్రయాణీకుడ్నయితే అనే దుర్బుద్ధి పుట్టింది అందుకే నా ఇంజన్‌లో అగ్ని ఆరిపోయింది ఆవిరి నీరు కారిపోయింది

నా చక్రాలు ఓ దుర్ముహూర్తాన మదరాసు టి నగర్‌లో వెలగని చిచ్చుబుడ్ల మధ్య పేలని టపాకాయల మధ్య అంటుకోని మతాబుల మధ్య కాలని కాకరపువ్వొత్తుల మధ్య ఆగిపోయాయి

మహారణ్యంలో క్రూర జంతువులతో బ్రతకవచ్చు మహాసముద్రంలో పడితే తిమింగళాలతో బ్రతకవచ్చు ఇక్కడి వాతావరణం అర్థం చేసుకోడానికి ఏ చదువు చదవాలి! ఏ అర్హత ఉండాలి! తెలుసుకోడానికి ప్రయత్నిస్తూనే పట్టు వదలకుండా నిర్విరామంగా మరో పధ్నాలుగు కొవ్వొత్తులు అర్పేశాను దగ్గర దగ్గరగా రెండు వందల యాభై సింద్రిలు వెలిగించాను

మళ్ళీ దీపావళి వచ్చేసింది నూతనోత్సాహం నింపుకోవాలి కదా? మంచి చెడు నీతి న్యాయం కష్టం సుఖం కక్షలు కార్పణ్యాలు మమత మమకారాలు అన్నీ కలిపి మందు తయారుచేసి చిచ్చుబుడ్డిలో దట్టించి వెలిగించాను ఓ డజను కాకరపువ్వొత్తులు అరడజన్ మతాబాలు తగలబడ్డాయి గాని చిచ్చుబుడ్డీ అంటుకోలేదు

నేను దట్టించిన మందుగుండు సామగ్రి పాళ్ళు సరిగ్గా లేవేమో? ఇందులో ఏమిటో తీసెయ్యాలి మంచి చెడూ ఇవి మనిషి అనే నాణేనికి బొమ్మా బొరుసూ లాంటివి ఉండాలి మరి నీతి న్యాయం ఇవి మనిషికుండవలసిన ఆభరణాలు 'కష్టం సుఖం' ఇవి మనిషికి పూర్వజన్మ సుకృతాలు తుడిచేసినా పోయేవి కాదు కదా! 'మమత మమకారాలు', ఇవి లేనివాడు మనిషి కాడు. 'కక్షలు కార్పణ్యాలు'. ఇవేమిటో పలకడానికే ఇబ్బందిగా ఉన్నాయి. మనిషిని పశువుగా మార్చే ఆయుధాలు.

ఛి - ఛీ! వీటి పాళ్ళే ఎక్కువయి ఉంటాయి. 'తీసేయ్. వీటిని తీసేయ్!' అంది మనసు వాటిని తీసేసి మళ్ళీ మందు దట్టించి అగ్గిపుల్ల వెలిగించి ముట్టించాను

అంటుకుంది రవ్వంత మెరుపు మెరిసి ఆగిపోయింది అంతే పొగ నల్లటి పొగ

అర్థంకాలేదు ఇంకా ఇందులో కలపవలసిన మందుగుండు సామగ్రి ఏమైనా ఉందేమోనని

ఆలోచించాను తట్టింది పట్టుదల సహనం ఓర్పు నేర్పు ఈ సామగ్రి కలిపి మళ్ళీ చిచ్చుబుడ్డిలో దట్టించాను

శోభన్‌బాబుగారికి ఎప్పుడు కనబడ్డా నవ్వుతూ హౌ ఆర్ యు? అని ప్రశ్నిస్తారు నా ప్రొగ్రెస్ చెప్పాను ఆయన వేదాంతిలా నా ముఖం చూసి నో

డౌట్ మీ చిచ్చుబుడ్డి టేలెంటెడ్ అనే వస్తువుతో నే చేయబడింది మీరు తయారుచేసిన మందుగుండు

సామగ్రి సమపాళ్ళలోనే ఉంది ఎని వే ఈసారి దాన్ని అదృష్టం అనే అగ్గిపుల్లతో వెలిగించి

చూడండి మీ చిచ్చుబుడ్డి రంగు రంగుల కాంతులతో వెలిగి ఆహ్లాదాన్ని కలిగిస్తుందో!

అన్నారు

ఆయన చెప్పింది అక్షరాలా నిజం

కాని ఆ అదృష్టం అగ్గిపుల్ల ఎక్కడుంది?
నా అన్వేషణ నిరంతరం సాగుతూనే ఉంది

అది ఈ దీపావళికే దొరుకుతుందా?
మరే దీపావళికైనా దొరుకుతుందా? □



"రెండు రెళ్ళు ఆరు"లో రజని, ప్రీతి

## సినిమా విశేషాలు

-జి.వి.జి

### డిసెంబర్ మొదటి వారంలో జంధ్యాల హాస్యచిత్రం "రెండు రెళ్ళు ఆరు

చంద్రమోహన్ రజని ఒక జంట రాజేంద్ర ప్రసాద్ ప్రీతి మరొక జంట ఛాందస బావాలున్న చెవిటి తాతగా పుచ్చా పూర్ణానందం నాటి గ్రేట్ ఆర్టిస్ట్ ఎ ఎస్ ఆర్ ను అనుకరించే గిరిశం పాత్రలో వేలు సంగీతం పిచ్చితో భర్తను బాధ పెట్టే సంగీత లక్ష్మిగా శ్రీలక్ష్మి ఆ బాధను భరించలేక చొక్కాలు చింపుకునే భర్తగా వీరభద్రరావు ప్రతి విషయాన్ని తికమక చేసే నౌకరుగా రాళ్ళపల్లి పీతను ఆరాదించే స్వామిగా పొట్టి ప్రసాద్ ఇలా నిత్య జీవితంలో అగుపించే సహజమైన పాత్రల ద్వారా జంధ్యాల కడుపుబ్బ నవ్విస్తారు విశాఖపట్నం పరిసరాలలో అరకులోయలో షూటింగ్ జరిపాం గుడివాడలో 101 గుమ్మాల ఇంటిలో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించాం హిప్నాటిస్ట్ పట్టాభిరాం హిప్నాటిస్ట్‌గానే నటించడం మరో విశేషం అని తెలిపారు విశాఖపట్నానికి చెందిన ప్రముఖ చలన చిత్ర పంపిణీదారుడు జి సుబ్బారావు ఈయన విజయ కమర్షియల్స్ పతాకంలో మల్లాది వెంకట కృష్ణమూర్తి నవల ఆదారంగా నిర్మించిన రెండు రెళ్ళు ఆరు చిత్రంలో సాక్షి రంగారావు హరిబాబు జానకి కాకినాడ శ్యామల సిందూరి ఇతర పాత్రధారులు వేటూరి రాజన్- నాగేంద్ర కోటేశ్వరరావు దిలీప్‌సింగ్ గౌతంరాజు శేషు సత్యనారాయణ శాస్త్రి యోగానంద్ సభాపతిరావు ప్రభృతి సాంకేతిక వర్గంతో కె శాంతి కుమార్ సమర్పిస్తున్నారీ చిత్రాన్ని

### మోహన్‌బాబుతో కీర్తి పిక్చర్స్ చిత్రం

చాలా కాలంగా దాసరి నారాయణరావు గారి వద్ద అసోసియేట్ డైరెక్టర్‌గా పని చేసిన సి వి రమణబాబును దర్శకునిగా పరిచయం చేస్తున్నాం. నవంబర్ 15 నుంచి షూటింగ్ ఉంటుంది," అని తెలియ జేశారు కీర్తి పిక్చర్స్ అధినేతలు ఎం. వెంకటాద్రి నాయుడు, ఎం. కృష్ణ. వీరి చిత్రంలో మోహన్‌బాబు ఓ విశిష్టమైన పాత్రను ధరిస్తారు

'నాగదేవత'తో విజయశాంతి

### అభినందన

జీవితమంటే ఏమిటో అర్థం చేసుకుని సాఫీగా జీవయాత్ర సాగిస్తున్న దంపతులు ఎంతైనా అభినందనీయులు– అనేది ప్రధానాంశం హైదరాబాద్ విశాఖపట్నం అరకులోయ పరిసరాలలో నవంబర్ డిసెంబర్ జనవరి షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు

## సినిమా

అశోక్‌కుమార్ ఈయన ఛాయ దర్శకత్వంలో రమణమూర్తి నిర్మించే లలితశ్రీ కంబైన్స్ వారి పై చిత్రంలో శరత్‌బాబు జి వి సోమయాజులు వీరభద్రరావు రమాప్రభ ఒక కీలకమైన పాత్రలో షావుకారు జానకి పాత్రదారులు ఆత్రేయ సంభాషణలు ఇళయరాజా సంగీతం రఘు

నృత్యాలు యోగి సహ దర్శకత్వం తెర వెనుక హంగులు

## నవ దర్శకుడు, నవ నాయికా నాయకులతో విజయలక్ష్మీ సినీ ఎంటర్‌ప్రైసెస్ అర్జున్

సంపన్నుల కుటుంబానికి చెందిన రామకృష్ణ హెగ్డే పట్టభద్రుడు కరాటే గుల్బుపుస్వారి ఈత డిస్కోడాన్స్‌లలో సుశిక్షితుడు ఎలు కన్నడ తమిళ హిందీ చిత్రాల్లో నటించిన ఈ 'ఇరవై ఏళ్ళ యువకుడు ఒకేసారి పదమూడు తెలుగు చిత్రాలలో బుక్ అవడం విశేషం అందులో ఒకటి లంకగణపతి సతీష్ కుమార్ నిర్మించే అర్జున్ చిత్రం నాయిక మాధురి డైరెక్టర్ కె విక్రంలకు కూడా ఇది తొలి చిత్రమే అక్టోబర్ 10న చిత్రీకరణ మొదలైంది మద్రాసు నాగార్జునసాగర్ విజయవాడ ప్రాంతాలలో నవంబర్ 15 కల్లా షూటింగ్ పూర్తయి పోతుంది విజయవాడలో ప్రత్యేకంగా నిర్మించిన సెట్‌ను చివరన బ్లాస్ట్ చేయడం జరుగుతుంది అన్నారు కథకుడు ప్రొడక్షన్ డిజైనర్ లంక వెంకటేశ్వర్లు గిరిబాబు జయంతి రాజేష్ రాజ్యలక్ష్మి ఎల్కెస్మిత అనూరాధ శ్రీలక్ష్మి రాళ్ళపల్లి వైజయంతి నర్రా వెంకటేశ్వరరావు తక్కిన పాత్రదారులు దాసం వెంకట్రావు కథా సహకారం కొంపెల్ల విశ్వం సంభాషణలు రాజ్–కోటి సంగీతం ఎన్ ఎస్ రాజు ఛాయ రంగారావు శిల్పం దిలీప్ సహ దర్శకత్వం సాంబశివరావు కూర్పుతో ఎ రామచంద్రరావు సమర్పించే ఈ చిత్రానికి రాధాకృష్ణమూర్తి సహ నిర్మాత ఈ చిత్రం ద్వారా పరిచయం గావింపబడే నాయిక మాధురి పలు మలయాళ చిత్రాల్లో నటించింది

ఇవాళ రేప్ సీను వుందా
చాలా హుషారుగా వున్నారు'



## సినిమా

### తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో షూటింగ్ పూర్తయిన ఆక్రందన

కేవలం 23 రోజుల్లోనే షూటింగ్ పూర్తి చేసుకున్న ఈ చిత్రం సినిమా రంగంలో సంచలనం కలిగించింది మహిళా ప్రేక్షకలోకంలో కూడా సంచలనం కలిగించి తీరుతుంది విద్యాదికురాలు ఉన్నతోద్యోగంలో ఉన్న ఓ మహిళ సాంప్రదాయ సిద్ధంగా వివాహం చేసుకున్న భర్తనే హత్య చేస్తుంది ఎంతటి ఆవేదనతో ఎలాంటి పరిస్థితిలో ఆమె ఈ దుర్ఘటనకు పాల్పడిందో అదే సస్పెన్స్' అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో నాగచరిత సమర్పించే సత్యశక్తి పిక్చర్స్ ఆక్రందన చిత్రంలో జయసుద చంద్రమోహన్ రాజ్యలక్ష్మి దీప నూతన్‌ప్రసాద్ గొల్లపూడి నిర్మల అనూరాధ పాల్గొన్నారు బీశెట్టి కథకు గణేష్‌పాత్రో సంబాషణలకర్త చక్రవర్తి స్వర కల్పనలో వేటూరి గీతాలు రాశారు నవకాంత్ ఛాయ కె రామలింగేశ్వరరావు శిల్పం గూనా సహ దర్శకత్వం అట్లూరి నాగేశ్వరరావు శ్యాం సహకార దర్శకత్వంతో తాండవ కృష్ణమూర్తి ప్రొడక్షన్ కంట్రోలర్ సి ఆర్ ఆర్ ప్రసాద్ ఎ కె ఆర్ ప్రసాద్ నిర్మాతలు

### విజయబాపినీడు దర్శకత్వంలో చిరంజీవి, జయసుధ తొలి కాంబినేషన్‌లో మగధీరుడు"

ఆగ్రహం ఆవేశం అనేవి ప్రతివారిలోనూ ఉంటాయి ముందు వాటిని జయించి ప్రేమతో మంచితనంతో అవతలి వారిని నెగ్గగలిగిన వాడే సిసలైన మగదిరుడు సెప్టెంబర్ 20 నుండి అక్టోబర్ 25 వరకు జరిగే మలి షెడ్యూల్‌తోనే షూటింగ్ పూర్తవుతుంది అన్నారు విజయబాపినీడు ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాద్ చౌదరి నిర్మించే శ్యాంప్రసాద్ ఆర్ట్స్ వారి పై చిత్రంలో చిరంజీవి జయసుద జె వి సోమయాజులు చంద్రమోహన్ సత్యనారాయణ రావుగోపాలరావు నరసింహరాజు అల్లు రామలింగయ్య జయప్రకాష్ అనంత్ రోజారమణి శుబ కె విజయ శైలజ పాత్రధారులు కాశీ విశ్వనాద్ సత్యమూర్తి సంబాషణలు రాశారు ఎస్ ఎ బాలసుబ్రహ్మణ్యం సంగీతం లోకసింగ్ ఛాయ తోటయాదు శిల్పం విజయబాబు కూర్పుతో జి మధుసూదనరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు





శ్రీమతిగారు లో జయసుద

## బాలకృష్ణతో ఎన్ బి చక్రవర్తి దర్శకత్వంలో మిద్దె రామారావు చిత్రం పరశురాముడు

సెప్టెంబర్‌లో కొన్ని ప్రదానమైన సన్నివేశాలు చిత్రీకరించాం అక్టోబర్‌లో జరిగే షెడ్యూల్‌లో ఈ చిత్రంలోని అయిదు పాటలనూ ఎక్సరైజ్ చేస్తాం అన్నారు ఎన్ బి చక్రవర్తి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించే రాజ్యలక్ష్మి ఆర్ట్స్ వారి "పరశురాముడు" చిత్రంలో బాలకృష్ణ, రాధ శరత్‌బాబు నూతన్‌ప్రసాద్ వేలు పి జె శర్మ హేమసుందర్ వై విజయ సుందరి సిల్క్‌స్మిత అనూరాధ జయమాలిని పాల్గొంటున్నారు సత్యానంద్ మాటలు చక్రవర్తి సంగీతం సుధాకరరెడ్డి ఛాయ శాయికుమార్ శిల్పం రావు గోపాలరావు సహ దర్శకత్వం డి వెంకటరత్నం కూర్పు కాశీ- మల్లిక్ సహకార దర్శకత్వంతో ఎన్ వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ మిద్దె రామారావు నిర్మాత

## విజయ మాదవీ పిక్చర్స్ రావణబ్రహ్మ

కృష్ణంరాజు డ్యూయల్ రోల్ అక్టోబర్ నవంబర్ డిసెంబర్లలో 21వ తేది నించి ప్రతి నెలాఖరు వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు కె రాఘవేంద్ర రావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో వశ్వేశ్వరమేష్ నిర్మించే "రావణ బ్రహ్మ" విశిష్టమైన సాంఘిక చిత్రంలో రాధ రావు గోపాలరావు సత్యనారాయణ గిరిబాబు అన్నపూర్ణ ఆదిగా గల వారు పాల్గొంటున్నారు పరుచూరి సోదరులు వేటూరి జె వి రాఘవులు కె ఎస్ ప్రకాష్ భాస్కరరాజు పి ఎస్ రెడ్డి సునిల్ వర్మ రవి జి రామారావు రామమోహనరావు జి జి కృష్ణారావు ప్రభృతి సాంకేతిక వర్గంతో పత్తే కిశోర్ నిర్మాణ సారధ్యంతో వడే శివనాధ్ ఈ చిత్ర సమర్పకులు

## పి ఎస్ ప్రకాష్ ఛాయదర్శకత్వంలో కల్యాణ చక్రవర్తి హీరో

రాఘవేంద్ర సాయి క్రియేషన్స్ వారి తొలి చిత్రానికి సెప్టెంబర్ 15న ప్రారంభోత్సవం జరిగింది. కల్యాణ చక్రవర్తి, గుమ్మడి, రాజేంద్ర ప్రసాద్, బబిత, నాయకిగా భాగ్యలక్ష్మి అనే నవ నటి పాత్రధారులు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. రమేష్ నాయుడు సంగీతం, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, ఎస్. ఏ. రంగారావు సహ దర్శకత్వం, కె. కేశవకుమార్ కూర్పు. హరి వెంకట కుమార్ సహకార దర్శకత్వంతో ప్రముఖ పబ్లిసిటీ ఆర్టిస్ట్ కె రామదాస్ కె ప్రభాకర్ నిర్మాతలు సెప్టెంబర్ నెలాఖరు నుండి అక్టోబర్ మొదటి వారం వరకు ఫస్ట్ షెడ్యూల్ జరిగింది అక్టోబర్ చివరి వారం నుండి నవంబర్ మొదటి వారం వరకు రెండవ షెడ్యూల్ డిసెంబర్‌లో ఆఖరి షెడ్యూల్ అన్నారు స్క్రీన్‌ప్లే ఛాయ దర్శకత్వం వహిస్తున్న పి ఎస్ ప్రకాష్ □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada 3 Editor S Radhakrishna
Phones Business 61247 61248 Editoriel 75667